# కారు కూడా కొనుక్కోలేనా?

**-అంజలి**



టాలీవుడ్‌లో హీరోయిన్‌గా అంజలి 'జర్నీ' మొదలుపెట్టినప్పటి నుంచీ పేరొచ్చింది మాత్రం 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు'తోనే! ఆ సినిమాలో సీతగా తెలుగు ప్రేక్షకుల మనస్సులో చెరగని ముద్ర వేసింది. అందులో ఇద్దరు స్టార్ హీరోలు, మరో స్టార్ హీరోయిన్ నటించినా, సినిమా పేరు తలుచుకోగానే సీత క్యారెక్టరే కళ్ళముందు కదలాడుతోంది. తెలుగువారి మనస్సులో చెరగని ముద్ర వేసిన ఈ సీతమ్మకు టాలీవుడ్‌లో ఇంత వరకూ కాలం కలిసిరాలేదు. ఎప్పుడూ వివాదాలే.... ఓ కారు కొనుక్కున్నా, ఓ దర్శకుడు లేదా హీరోతో చనువుగా ఉన్నా గాలి కబుర్లు షికారు చేస్తూనే ఉంటాయి. అలాంటి వాటిని అస్సలు కేర్ చేయనంటున్న టాలీవుడ్ సీత...అదే అంజలితో...

### మీ తాజా సినిమా 'చిత్రాంగద' గురించి...

ఇప్పటివరకూ ఇంత అద్భుతమైన కథను నేను వినలేదు. ఈ సినిమాలో దర్శకుడు నన్ను కొత్తగా చూపించబోతున్నారు. ఇంతవరకూ తెలుగు సినిమాలో చూపించని సన్నివేశాలు ఈ సినిమాలో ఉంటాయి. అవే ఈ సినిమాకు పెద్ద ఆకర్షణ. నా ముందు సినిమాలలాగానే ఈ సినిమా కూడా ప్రేక్షకులకు తప్పనిసరిగా నచ్చి తీరుతుంది.

### సినిమాల్లోకి వచ్చి దశాబ్దం గడుస్తున్నా ఇంత వరకూ సరైన గుర్తింపు రాకపోవడానికి కారణం?

గుర్తింపు రాలేదని ఎందుకు అనుకోవాలి? 'జర్నీ', 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు', 'గీతాంజలి' సినిమాల పేర్లు విన్నప్పుడల్లా నేనే గుర్తుకొస్తాను. గ్లామర్ పాత్రలు చేస్తేనే గుర్తింపు వస్తుందని నేను అనుకోను. అంజలి మంచి నటి అనిపించుకోవడమే నాకు అసలైన గుర్తింపు.

### ఇటీవల ఖరీదైన కారు గిఫ్టుగా అందుకున్నారట?

ఇక్కడ ఒక సంగతి చెప్పి తీరాల్సిందే! అసలు తెలుగు సినిమా హీరోయిన్లలో ఎవరి మీదా రానన్ని పుకార్లు నా మీద వచ్చాయి. ఎందుకలా వస్తున్నాయో నాకు ఇంత వరకూ అర్థం కావడం లేదు. నేను కారు కొనుక్కున్నా వింతేనా? నాకు ఖరీదైన కారు కొనుక్కునే స్తోమత లేదా? ఇప్పటి వరకూ నేనేమీ ఖాళీగా లేనే! తెలుగులో కనిపించనంత మాత్రాన చేతిలో సినిమాలు లేనట్టేనా? తమిళంలో మూడు సినిమాలు, కన్నడంలో ఓ సినిమా చేస్తున్నాను త్వరలోనే 'చిత్రాంగద'తో తెలుగువారి ముందుకు రాబోతున్నాను. ఇన్ని సినిమాలు చేస్తున్న నాకు కారు కూడా కొనుక్కునే స్తోమత లేదు అనుకునే వారిని ఏం అనాలో అర్థం కావడం లేదు. ఏదైనా ఒక మాట అనేటప్పుడు ఆలోచించి అంటే బాగుంటుంది.

### 'జై'తో మీ ప్రేమాయణం గురించి?

చెప్పానుగా...ఇలాంటివి చాలాత్వరగా వ్యాపిం చేస్తున్నాయి. తను సరదాగా దోసె వేసి ఇవ్వడం నిజమే! నేను తినడమూ నిజమే! ఆ ఫొటో సోషల్‌మీడియాలో షేర్ చేయడం అంతకన్నా ఎక్కువ నిజం. జై నాకు దోసె వేసిచ్చినంత మాత్రాన మా మధ్య ప్రేమ ఉన్నట్టేనా? నా మొదటి సినిమా 'జర్నీ' దగ్గర్నుంచీ తను నాకు మంచి స్నేహితుడు. సూర్య సార్ విసిరిన సవాల్‌కి సరదాగా సమాధానం చెప్పాడంతే! అంతకు మించి ఏం జరగలేదు. జరగబోదు కూడా!

### తెలుగు హీరోయిన్ల అవకాశాలు ఉత్తరాది హీరోయిన్లు తన్నుకు పోతున్నారన్న వార్తల్లో నిజం ఎంత?

అది పూర్తిగా అబద్ధం అని మాత్రం చెప్పలేను. కాకపోతే తెలుగమ్మాయిలకూ మంచి మంచి అవకాశాలు లభిస్తూనే ఉన్నాయి. దానికి నేనే మంచి ఉదాహరణ. అందం, నటన అన్నీ ఉన్న తెలుగమ్మాయిలు ఇక్కడ చాలామందే ఉన్నారు. ఇక్కడ దర్శకనిర్మాతలు వీరి గురించి పట్టించుకోరు కానీ, ఎంతో ఎక్కువ ముట్టజెప్పి ఉత్తరాది భామలను తెచ్చుకుంటున్నారు. ఇలా ఎందుకు చేస్తున్నారో నాకు అస్సలు అర్థం కాదు. తెలుగు అమ్మాయిలంటే టాలీవుడ్ వారికి కొద్దిగా చిన్నచూపే ఉంది. కోలీవుడ్‌లో అలా ఉండదు. అందుకేనేమో మన తెలుగమ్మాయిలు చాలా వరకూ కోలీవుడ్ బాట పడుతున్నారు. ఇప్పుడిప్పుడే టాలీవుడ్ దర్శకనిర్మాతల్లో కూడా మార్పు వస్తోంది.

-కె.రామకృష్ణ

# ఊరికోసం ఓ శ్రీమంతుడు

శ్రీమంతుడు సినిమాలో ఊరికోసం పనిచేసే వాళ్లను చూశాం కదా! అలానే ఊరికోసం ఏకంగా 16 ఏళ్లు కష్టపడి చదివాడు ఓ వ్యక్తి. ఆ కథాకమామీషు మీరూ తెలుసుకోండి.

ఇతరులపై కేసు వేయాలంటే న్యాయపరంగా చర్యలు తీసుకోవాలి. ముందుగా ప్రత్యర్థిదే తప్పని నిరూపించాలి. అందుకు కావాల్సిన ఆధారాలు సేకరించాలి. అయితే ఇలాంటి విషయాల్లో సామాన్య ప్రజలకు అర్థం కాని విధంగా డాక్యుమెంట్లు, పేపర్లు, సెక్షన్లు అనేక రకాల అంశాలుంటాయి. లాయర్లకే తెలుసు వాటి గురించి. ఒక్కొక్కరు ఒక్కో ఉపయోగం కోసం లా చదువుతారు. కానీ చైనాకి చెందిన 60 ఏళ్ల వాంగ్ ఎన్లిన్ తన ఊరిని కలుషితం చేస్తున్న ఓ కార్పొరేట్ సంస్థపై కేసు వేసేందుకు 16 ఏళ్లు కష్టపడి న్యాయశాస్త్రం చదివాడు.



2001లో చైనాలోని యూషటున్ గ్రామంలో ఒక్కసారిగా టన్నులకొద్దీ రసాయనిక వ్యర్థాలతో కూడిన నీరు చేరింది. అందులో ఉన్న పాలీవినైల్ క్లోరైడ్ వల్ల గ్రామంలోని 71 ఎకరాల పొలం పాడైపోయింది. దీనికి కారణం స్థానికంగా ఉన్న క్వివువా కార్పొరేట్ సంస్థ అని గుర్తించిన వాంగ్, కోర్టులో కేసు వేసేందుకు వెళ్లాడు. కానీ లాయర్లు ఆ వ్యర్థాలు ఆ సంస్థవే అని రుజువేంటి? ఆధారాలు ఉండాలని తేల్చి చెప్పారు. మూడవ తరగతి వరకే చదివి పాఠశాలకు స్వస్థి పలికిన వాంగ్‌కు ఇవేమీ అర్థం కాలేదు. కానీ వారిపై కేసు వేయాలంటే న్యాయశాస్త్రంలో ఎలాంటి విషయాలు ఉంటాయో తెలుసుకోవాలి. అందుకోసం తానే లా చదవాలని నిర్ణయించుకున్నాడు.

అప్పట్నుంచి కాలేజీలో చదువుకునే పుస్తకాలు కొనుక్కునే స్థోమత లేక 16 ఏళ్లపాటు లైబ్రరీలో బుక్‌స్టాళ్లలో న్యాయశాస్త్రానికి సంబంధించిన అన్ని పుస్తకాలూ చదివి, అధికారిక పట్టాలేని న్యాయవాదిగా మారాడు. 2007 సంవత్సరంలో ఆ కార్పొరేట్ సంస్థపై కేసువేసినా విచారణ జరపలేదు. కాగా 2015లో కోర్టు విచారణకు అంగీకరించింది. వాంగ్ పట్టుదల చూసి గ్రామం మొత్తం అతనికి మద్దతుగా నిలిచింది. అంతేకాదు, గ్రామప్రజలు అతన్ని సాయిల్ లాయర్ అని పిలుస్తుంటారు. ఇటీవలే ఈ కేసు ప్రాథమిక విచారణలో వాంగ్ గ్రామస్థులే విజయం సాధించారు.

నవ్య

---

### చిన్నవయసులోనే.....

వాంగ్ ఊరికోసం పుస్తకాలు చదివితే అసలు తినడం కూడా స్వయంగా రాని వయసులో ఓ నాలుగేళ్ల చిన్నారి వెయ్యికి పైగా పుస్తకాలు చదివేసింది. ప్రపంచంలో అతిపెద్ద గ్రంథాలయానికి ఒక్కరోజు లైబ్రేరియన్‌గా పనిచేసింది. ఒకేఒక్కడు సినిమాలో 'ఒక్కరోజు సి.ఎం పదవి' నిర్వహించినట్టు ఈ చిన్నారి కూడా తన ప్రతిభతో ఒక్కరోజు లైబ్రేరియన్ పదవి ఉద్యోగం నిర్వహించింది. ఆ చిన్నారి పేరు దలైయా ఆర్నా. అమెరికా, జార్జియాలోని గైనేస్విల్లికి చెందిన ఆర్నా, గ్రంథాలయానికి లైబ్రేరియన్‌గా ఉన్న అరుదైన తొలి ఆఫ్రికా - అమెరికన్ చిన్నారిగా చరిత్ర సృష్టించింది. ఈ ఒక్కరోజులోనే ఆర్నా గ్రంథాలయం మొత్తం కలియ తిరిగి లైబ్రరీలో గోడలకు కొన్ని వైట్‌బోర్డులు పెట్టాలని సలహా ఇచ్చిందట. ఈ బోర్డులు చిన్నారులు రైటింగ్ ప్రాక్టీస్ చేసేందుకు ఉపయోగపడతాయని చెప్పడంతో, ఆ తెలివైన ఆలోచనకు లైబ్రరీ సిబ్బంది ముచ్చటపడి అమలుకు అంగీకరించారట.

ఆర్నా రెండేళ్ళ వయసులోనే చిత్రాలతో కూడిన ఆన్స్ బిగ్ ముఫిన్ అనే పుస్తకం చదివిందట. అదే ఆమె చదివిన తొలి పుస్తకం. మాటలు కూడా సరిగా మాట్లాడటేని నాలుగేళ్ల వయసు చిన్నారి 1000 పుస్తకాలు చదవడం నిజంగా గ్రేట్ కదూ!

నవ్య



8

## శివ శంభో స్వయంభో

జ్యోతిర్మయమైన మహాలింగంగా శివుడు ఆవిర్భవించిన రోజే శివరాత్రి. జగత్తును దేదీప్యమానం చేసిన లింగోద్భవ కాలంలో మనం నిద్రించడం అర్థరహితం. ఫిబ్రవరి 24 శివరాత్రి సందర్భంగా జాగరణకున్న ప్రాధాన్య విశేషాలు చదవండి.

**68**

### నిగ్గదీసి అడుగు ఈ సిగ్గులేని సినిమాని!

తెలుగు సినిమాను బాధ్యతాయుతమైన సాధనంగా తీర్చిదిద్దాలంటే ఏం చేయాలి? తెలుగు టాకీ చిత్రం 85 ఏళ్ళు పూర్తిచేసుకున్న సందర్భంగా సినీప్రముఖుల ఇష్టాగోష్ఠి నివేదిక

**72**

### ఇంటర్వ్యూ

బహుభాషా నటి బేబీ వరలక్ష్మి. ఆంధ్రాసిస్టర్‌గా తెలుగు ప్రేక్షకులకు సుపరిచితురాలు. బాహుబలి వంటి జానపద చిత్రాలు మరెన్నో రావాలంటున్న ఆమె ఇంటర్వ్యూ

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: శృతిహాసన్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### ఋషులు

ఇద్దరు తల్లులు మాట్లాడుకుంటున్నారిలా.

**1వ తల్లి:** మా అబ్బాయి గురించి నేను చెప్పకూడదు గాని, మావాడు ఋషి అంటే నమ్మండి. సిగరెట్ కాల్చడు. కష్టపడి పని చేస్తాడు. రెండేళ్లయ్యింది, పెళ్ళి ఊసే లేదు. ఆడాళ్లంటే అసహ్యించుకుంటాడు.

**2వ తల్లి:** మావాడూ అంతే! మహాఋషి! సిగరెట్ కాల్చడు. మందు ముట్టడు. ఆడాళ్లంటే అసహ్యం అంటాడు. మూడేళ్లయ్యింది, పెళ్ళి ఊసెత్తితే చాలు, ఇప్పుడెందుకంటూ దాటవేస్తున్నాడు.

**1వ తల్లి:** వాళ్లు అలాగే అంటారు, పిల్లలకి పెళ్ళి చేయకపోతే ఎలా? మావాడికన్నా మీవాడు కొంచెం పెద్దనుకుంటాను, తొందరపడండి. ఏదో ఒకటి నచ్చజెప్పి, పెళ్ళి చెయ్యండి.

**2వ తల్లి:** నేనూ అదే అనుకుంటున్నాను, నెక్స్ట్ మంత్ మావాడు పెరోల్‌మీద జైల్లోంచి బయటికొస్తున్నాడు. రాగానే ముందు ఆ పని మీదే ఉంటాను.

**1వ తల్లి:** !!!!!!!

### షూటింగ్

సిటీ నుంచి తనని చూడడానికి వచ్చిన మేనల్లుడికి ఓ రైతుగా ఆ మేనమామ తోటలూ, దొడ్లతో పాటు పొలాలనీ, పశువులనీ, కోళ్ళనీ చూపించాడు. మూడురోజులు గడిచాయి. బోరెత్తిపోయాడు మేనల్లుడు. గమనించాడది మేనమామ. నవ్వుతూ చెప్పాడిలా.

"ఓ పని చెయ్యి, సరదాగా గన్‌తీసుకుని, మన పెంపుడుకుక్కల్ని తీసుకుని అలా దూరంగా అడవిలోనికి వెళ్ళి షూటింగ్ చెయ్యి."

అలాగే అన్నాడు మేనల్లుడు. మామ చెప్పినట్టుగానే గన్‌తీసుకున్నాడు. పెంపుడుకుక్కల్ని వెంటబెట్టుకున్నాడు. అడవిలోనికి అట్టే వెళ్లి ఇట్టే వచ్చాడు.

"ఏంటప్పుడే వచ్చేశావు?" అడిగాడు మేనమామ.

"షూటింగ్ అయిపోయింది. ఇంకా పెంపుడు కుక్కలుంటే చెప్పు." గన్ని శూన్యంలోకి గురిపెడుతూ అన్నాడు మేనల్లుడు.

### అనుకో

జూలో పులిబోను దగ్గరగా నిలబడ్డారు తండ్రీ కొడుకులు. ఏడేళ్ళ కొడుక్కి పులి ఎంత క్రూరమైందో, ఎంత బలమైందో తండ్రి చెప్పసాగాడు. తండ్రి చెప్పిందంతా భయం భయంగా విని, ఆఖరికి అడిగాడిలా కొడుకు.

"ఇప్పుడు ఆ బోనులోంచి పులి బయటికి వచ్చిందనుకో! నిన్ను తినేసిందే అనుకో"

"అనుకున్నాను..."

"నేను ఇంటికి వెళ్ళడానికి ఏ బస్సెక్కాలి?" అడిగాడు కొడుకు.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 52
1-3-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజీ

## తీరే వేరు!

ఆసుపత్రికి రాగానే రౌండ్స్‌కి బయల్దేరాడు డాక్టర్ మురారి. మూడువార్డులు చూడాలతను. ఒకొక్క పేషెంటు పరిస్థితినీ అడిగి తెలుసుకోవాలి. కేస్‌షీట్స్ స్టడీ చెయ్యాలి. మొదటి విడత రౌండ్స్ పొద్దున పూర్తి అయితే రెండో విడత రౌండ్స్ సాయంత్రం ఉంటాయి. మొదటివార్డులోని రైట్‌సైడ్ పేషెంట్స్ అందరినీ చూసేశాడు. లెఫ్ట్‌సైడ్ పేషెంట్స్‌ని చూడాలి. అటుగా నడిచాడు. మొదటి బెడ్‌మీది పేషెంట్ ఎవరో స్త్రీ! చీరకొంగు ముఖమ్మీద కప్పుకుని నిద్రపోతూ కనిపించింది. కేస్‌షీట్ నర్స్ అందిస్తే యథాలాపంగా చదివాడు మురారి. పేరు: వై. సావిత్రి అని చదివి, సన్నగా నవ్వుకున్నాడు.

నాలుగవ తరగతి చదువుతున్న రోజులు. తెలుగువాచకంలో మూడుచేపల కథ ముచ్చటపడి పదేపదే చదువుతున్న రోజులు. ఫ్రెండ్స్ శీను, రాజు, ప్రభు, రాముతో చెరువులో ఈతలుకొట్టడమే కాదు, రాయుడిగారితోటలో మామిడికాయలను దొంగిలించే రోజులు. అల్లరిగా ఆనందంగా గడిచిపోతున్న రోజులవి. క్లాస్‌టీచర్ సావిత్రిని ఆటపట్టించాలనిపించింది. ఎక్కడో విన్నదో, ఎవరో చెప్పిందో గుర్తు లేదు, సావి వన్ కావాలి! సావి టు కావాలి! సావి త్రి కావాలి అంటూ ఫ్రెండ్సంతా టీచర్ వెంట పడ్డారు. వెంటపడితే టీచర్‌కి కోపం వస్తుంది. రాళ్ల విసిరికొడుతుంది. వాటిని తప్పించుకోవాలి. తప్పించుకున్నవాడిదే గెలుపు! శీనుకి రెండురాళ్లు తగిలాయి. రాజు, ప్రభు, రాముకి ఒకొక్కటి తగిలాయి. తనకి ఒక్కటి కూడా తగల్లేదు. గెలుపు తనదే! గెలిచినవాడికి ఓడిపోయినవారు  ఖాళీ గోల్డ్‌ఫ్లాక్ సిగరెట్ పెట్టెలు రెండేసివ్వాలి. ఇచ్చారు. ఆనాడు ఎంతగా ఆనందించాడో తను!

ఆ రాత్రే అమ్మకి గుండెనొప్పి వచ్చింది. నొప్పి భరించలేక విలవిల్లాడిందమ్మ. చెమటలు పోశాయి. అమ్మను ఆసుపత్రికి తీసుకు వెళ్ళేందుకు నాన్న రిక్షా తీసుకొచ్చాడు. రిక్షాలో అమ్మను కూర్చోబెట్టి వెళ్ళిన నాన్న, వెళ్ళినట్టే ఆసుపత్రి నుంచి తిరిగొచ్చాడు. రిక్షాలో అమ్మ కూర్చున్నట్టే ఉంది, కానీ చనిపోయింది. సావిత్రి టీచర్‌సహా అమ్మను చూసేందుకు చాలా మంది వచ్చారపుడు. అయ్యో అయ్యో అంటూ జాలిగా తనని దగ్గరగా తీసుకున్నారు. ఏడుస్తున్న తనని ఓదార్చారు. ఓదార్చనిదీ, తనని దగ్గరగా తీసుకోనిదీ సావిత్రి టీచరే! తల్లిలేని పిల్లాడైనా ఆమెకు కోపం పోలేదనుకున్నాడు. రెండు మూడు నెలలు గడిచాయి. ఒక రోజు ఒంటరిగా ఇంటికి వెళ్తూ సావిత్రి టీచర్ కనిపించింది. ఆటపట్టిద్దామన్నారు ఫ్రెండ్స్. వద్దు వద్దన్నాడు తను. వినిపించుకోలేదు. పాటగా అందుకున్నారు. సావి వన్ కావాలి! సావి టు కావాలి! సావి త్రి కావాలి! వెనక్కి తిరిగి చూసింది టీచర్. రాళ్లందుకుంది. విసిరికొట్టింది. తన మీదికి ఏ ఒక్క రాయీ రాలేదు. తనూ తప్పించుకునే ప్రయత్నం చెయ్యలేదు. చేతులు కట్టుకుని నిల్చున్నాడంతే! చేతులు కట్టుకుని నిల్చున్న తన దగ్గరకి టీచర్ పరుగున వచ్చింది. కొట్టేందుకు వస్తున్నదనుకున్నాడు తను. నేనేమీ అనలేదు టీచర్! నేనేమీ అనలేదు అన్నాడు ఏడుస్తూ. ఏడుస్తున్న తనని దగ్గరగా తీసుకున్నది టీచర్. గుండెలకి హత్తుకుంది. నువ్వేమీ అనలేదురా! నువ్వేమీ అనవు కూడా. నాకు తెలుసు అన్నది. నీ తీరే వేరు! నీకూ వాళ్ళకీ పోలికే లేదు! నువ్వు బాగా చదువుకుని పెద్ద డాక్టరవుతావు అన్నది. బుగ్గన ముద్దుపెట్టింది. సావిత్రి టీచర్ ముద్దుతో మారిపోయాడు తను. అల్లరినీ, ఆకతాయితనాన్నీ మరచిపోయాడు. బాగా చదువుకున్నాడు. డాక్టరైపోయాడు.



ఆలోచనల నుంచి తేరుకున్నాడు మురారి. కేస్‌షీట్‌ని నిశితంగా చూశాడు. ఈ సావిత్రి ఎవరో కేన్సర్‌తో పోరాడుతోంది. లాస్ట్‌స్టేజ్‌లో ఉంది అని జాలిపడ్డాడు. మేడం! మేడం! డాక్టర్‌గారొచ్చారు, లేవండి అని తట్టి లేపింది నర్సు. ముఖం మీది చీరకొంగును తొలగించి, లేచి కూర్చునేందుకు ప్రయత్నించసాగింది సావిత్రి. పట్టిపట్టి చూశాడామెను మురారి. అనుమానం లేదు, సావిత్రి టీచరే! టీచర్ అన్నాడు ఆందోళనగా. వినిపించుకోలేదామె. కూర్చునేందుకు కష్టాలు పడుతోంది. ఆఖరికి కూర్చోగలిగింది. నేనేం చనిపోను కదా డాక్టర్ అడిగింది. చనిపోరు టీచర్! మీరేమీ చనిపోరు! మీ తీరే వేరు! మీరు నిండు నూరేళ్ళూ బతుకుతారు. సావి వన్ కావాలి! సావి టు కావాలి! సావి త్రి కావాలి! అన్నాడు మురారి. దగ్గరగా తీసుకున్నాడామెను. కళ్ళు చెమర్చుకున్నాడు.

నవ్య




## ఆన్‌లైన్ కౌన్సెలింగ్

మారుతున్న కాలానికి తగ్గట్టుగా జీవితంలో ఉరుకులు పరుగులు ఎక్కువయ్యాయి. దాంతో ఒత్తిడి, డిప్రెషన్, యాంగ్జయిటీ అనే సమస్యలు కూడా ఎక్కువయ్యాయి. అయితే కొంతమంది వాటిని బ్యాలెన్స్ చేసుకుంటారు. కానీ బ్యాలెన్స్ చేసుకోలేక అవస్థలు పడేవాళ్లు ఎంతోమంది. ముఖ్యంగా ఐటీరంగం, ప్రైవేట్‌రంగంలో పనిచేస్తున్న వారు ఇటువంటి కంప్లయింట్లు ఎక్కువగా ఇస్తుంటారు. ఇలాంటివారికి ఆన్‌లైన్‌లో సలహాలు సూచనలు అందించేందుకు 'ఫైవ్ ఏ థాట్' అనే స్టార్టప్ ప్రారంభమైంది.

ఉద్యోగుల్లో పెరిగిపోతున్న మానసిక సమస్యలకు పరిష్కారం చూపించేందుకు అజయ్ పద్యే, అల్విన్ అల్వా అనే ఇద్దరు డాక్టర్లు ఈ స్టార్టప్ ముంబైలో ప్రారంభించారు. రోగుల్లో ఎక్కువ మంది మానసిక సమస్యలతో బాధపడడం గమనించి, దానిపై కొంతకాలం పరిశోధన చేసి ఈ వెబ్‌సైట్‌ను ప్రారంభించారు. మామూలుగా డిప్రెషన్‌లో ఉన్నవారు తమ సమస్య ఏమిటో నేరుగా డాక్టర్ ఎదుట చెప్పుకోవటానికి తటపటాయిస్తారు. కానీ చాటింగ్‌లో మాత్రం మొత్తం వివ



రంగా చెప్పగలరు. అందుకే 'ఫైవ్ ఏ థాట్'ను డిజిటల్ కౌన్సెలింగ్‌కు కేంద్రంగా తీర్చిదిద్దారు. మొదట ఈ వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకుని, నచ్చిన డిస్‌ప్లే నేమ్ ఎంచుకోవచ్చు. తర్వాత సమస్యను ఆన్‌లైన్‌లో ఉండే సైకాలజిస్ట్‌కు వివరించి సలహాలు తీసుకోవచ్చు. ఈ ప్రక్రియ మొత్తం ఉచితంగానే నడుస్తుంది. మొదటి సెషన్ తర్వాత వ్యక్తిగతంగా కౌన్సెలింగ్ అవసరమని భావిస్తే, సైకాలజిస్ట్ అపాయింట్‌మెంట్ బుక్ చేస్తాడు. 'ఫైవ్ ఏ థాట్'తో ఒప్పందం చేసుకున్న విభిన్న రంగాలకు చెందిన కౌన్సెలర్లు అందుబాటులో ఉంటారు. ఎవరి అపాయింట్‌మెంట్ కావాలో కస్టమరే ఎంపిక చేసుకోవచ్చు. 'ఫైవ్ ఏ థాట్' ఎక్స్‌పర్ట్స్‌లో సైకాలజిస్టులు, లైఫ్ కోచెస్, సెక్సాలజిస్టులు, సోషల్‌వర్కర్లు, స్పీచ్ థెరపిస్టులు, మ్యారేజ్, ఫ్యామిలీ థెరపిస్టులు, సైకియాట్రిస్టులు ఉంటారు. వీరంతా ఈమెయిల్, టెక్స్ట్ మెసేజెస్, ఫోన్, వీడియోకాల్ ఆధారంగా కౌన్సెలింగ్ ఇవ్వడానికి రెడీగా ఉంటారు. మొదటి సెషన్ వరకే ఉచితం... తర్వాత మాత్రం కొంత పే చేయాల్సి ఉంటుంది. ఆన్‌లైన్ కౌన్సెలింగ్ కాన్సెప్ట్ కొత్తగా ఉంది కదూ!

# మెయిల్ బాక్స్

### యూపీ రివ్యూ ఆసక్తికరం

రివ్యూలో ఉత్తరప్రదేశ్ రాజకీయాల విశ్లేషణ ఆసక్తికరంగా ఉంది. ఫేస్‌బుక్ గురించి చాలా విషయాలు ఆశ్చర్యం గొలిపేలా ఉన్నాయి. కోట శ్రీనివాసరావుగారి జీవిత చరిత్ర బోలెడు మలుపులతో రమణీయంగా ఉంది. శ్రేయశరణ్ ఇంటర్వ్యూ వైవిధ్యభరితం. గౌతమిపుత్ర శాతకర్ణి చిత్రంలో ఆమె నటన బాగుంది.

ఇవన్నీ నిజాలే చాలా వినూత్నంగా ఉంటూ ప్రతివారం ఎదురుచూసేలా చేస్తున్నాయి. ప్రతివారం సుధామ పదగారడి చక్కగా నింపగలుగుతున్నాం. ఏదైనా బహుమతి ఈ శీర్షికలో విజేతలకు ఇస్తే బాగుంటుంది.

*-శశిరేఖాలక్ష్మణన్, మూలకడై, చెన్నై-60*

### హుందాగా ఉంది

ప్రగ్యాజైస్వాల్ ముఖచిత్రం సంచిక హుందాగా ఉంది. రేడియో చరిత్ర ఎంతోబాగుంది. అపర ఇందిరాగాంధీ ప్రియాంకకు రాజకీయ భవితవ్యం ఉంది. కోట, బాబూమోహన్ కాంబినేషన్ హాస్య సంపుటి అవుతుంది. సినీవాలి సీరియల్‌లో ఎన్నో తెలుస్తున్నాయి.

*-వాస్తు రామచంద్ర, నెల్లూరు*

### కోట సినీజీవితం బాగుంది

కోటశ్రీనివాసరావుగారి జీవితం విపులంగా వివరిస్తున్నారు. ఆయన రామచంద్రపురంలో కాకర్లపూడి రాజుగారి కోటలో షూటింగ్ నిమిత్తం వచ్చిన ఆయనతో నాకున్న అనుభవం మరువలేనిది. రౌడీటీచర్, జోకర్‌మామ సూపర్ అల్లుడు, చిన్నరాయుడు చిత్రాల షూటింగ్ సమయంలో అతి సమీప గ్రామాల గురించి, స్థానిక ఆచార వ్యవహారాల గురించి ఆయన అడిగి తెలుసుకునేవారు. భోజన సమయంలో వారితోపాటు భోజనం నాకూ పెట్టించేవారు. ఆయన మంచి మనసుకు అదే నిదర్శనం.

*-జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి.తూ.గో.జిల్లా*

### చాకచక్య రచన సినీవాలి

సినీవాలి సీరియల్ ఆసక్తికరం. వచ్చేవారం ఏం జరుగుతుందో అనే ఉత్కంఠకు గురిచేస్తోంది. ఈ ఫిక్షన్ సీరియల్‌లో రచయిత ఎంతో చాకచక్యంగా బాలీవుడ్ సహా సినీరంగానికి చెందిన అనేక పాత కొత్త, వర్తమాన సంఘటనలను జత చేస్తున్నారు. రచయితకు అభినందనలు. ప్రపంచ రేడియో దినోత్సవం సందర్భంగా రేడియో చరిత్రను చక్కగా చెప్పారు.

*-ఎన్.ఆర్.రావు, రిటైర్డ్ ఇంజనీర్, హైదరాబాద్*

### సాహిత్యాభిలాష పెంచే 'మొదటిపేజీ'

మొదటిపేజీ పఠనం సాహిత్యాభిలాషను రెట్టింపు చేస్తోంది. స్వర్ణోత్సవాలు కథనం భార్యాభర్తలకు ఒక ప్రత్యేకమైన ఆచరణీయ సందేశం ఇచ్చింది. మార్నింగ్ కాఫీ స్కిట్లు వాసితో నవ్విస్తున్నాయి. చక్కని సబ్జెక్ట్‌తో సినీవాలి సీరియల్‌ను ప్రభాకర్‌జైనిగారు అత్యద్భుతంగా మలుస్తున్న తీరు బాగుంది. సినీరంగ చీకటికోణాలు, సంతోష ఘట్టాలు చెబుతున్నారు. రచయితకు అభినందనలు.

నోరులేని మూగజీవులను రక్షిస్తున్న యానిమల్స్ ట్రస్ట్ సేవలు మానవత్వానికి మచ్చుతునక. మలానా విశేషాలు ఆకట్టుకున్నాయి. ఫేస్‌బుక్ వ్యాసంతో తెలియని విషయాలు తెలిశాయి. పలు వంశవృక్షాల నామధేయాలతో 'హరివంశం' ఆసక్తిదాయకంగా ఉంది. ప్రాయశ్చిత్తం విలువ తెలిసింది. టీనేజ్ ట్యూన్స్‌లో యువతరం అలవాట్లు, అభిలాషలు పీపింగ్ టామ్ మనస్తత్వం ఆలోచింపజేశాయి. తోడికోడళ్ళ రాజకీయాలతో రచ్చకెక్కిన యూపీ రాజకీయాల రివ్యూ బాగుంది.

సురభి వింతలు అలరిస్తున్నాయి. చైనాలో కిరాయి భర్తలు ఆశ్చర్యపరిచారు. కోట శ్రీనివాసరావు కృతజ్ఞతాభావం నటులకు స్ఫూర్తిదాయకం. స్పోర్ట్స్ సినిమాల గురించి బాగా వివరించారు. వృద్ధులపట్ల ప్రేమ, ఆపేక్ష ఆదరణతో ఎలా మెలగాలో విశ్లేషించారు. పుస్తక సమీక్ష, ఇంటర్వ్యూలు, ఇవన్నీ నిజాలే ఆసక్తికరంగా ఉన్నాయి. కథలు ఆలోచింపజేస్తున్నాయి.

*-మాధవరపు కృష్ణ, కాకినాడ*

### రేడియో సేవలు మరువలేం

జనం గుండె చప్పుడు రేడియో వ్యాసం చాలా బాగుంది. ఆలోచింపజేసింది. ఒకప్పుడు రేడియో నెంబర్‌వన్. కానీ ఇప్పుడు దాని ప్రాభవం తగ్గిపోవడం బాధగావుంది. ఆకాశవాణి సేవలు తెలుగువారు ఎప్పటికీ మరువలేరు. చక్కనివ్యాసం అందించిన మీకు మా ధన్యవాదాలు. కథలు, సీరియల్స్ సూపర్బ్.

*-ఎల్. ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*



### జనం గుండె చప్పుడు

జనం గుండెచప్పుడు రేడియో చరిత్ర తెలుసుకున్నాం. వ్యాసం ఎంతో బాగుంది. ఒకప్పుడు రేడియో లేని ఇల్లు ఉండేదికాదు. కాలగమనంలో దాని ప్రాభవం తగ్గిపోతోంది. రేడియో మనకు ఎంతో విజ్ఞానం నేర్పుతోంది. ఆరోగ్యమే మహాభాగ్యం, ఇవన్నీ నిజాలే శీర్షికలు బాగున్నాయి. శరత్‌బాబు ఇంటర్వ్యూ చాలా బాగుంది.

వారం వారం వెట్టి, మహానంది సీరియల్స్ అద్భుతంగా ఉన్నాయి.

*-డా.టి.బాలముకుంద్‌సింగ్, అమరచింత*



ఫిబ్రవరి 24 'మహా శివరాత్రి' సందర్భంగా...

### పరమపవిత్రం శివరాత్రి

శివుడు అంటే మంగళకరమైన వాడని అర్థం. శివరాత్రి అంటే శుభప్రదమైన రాత్రి అని చెప్పుకోవచ్చు. ఆదిభిక్షువు ఆనందతాండవం చేసే రాత్రి శివరాత్రి. ఆ రాత్రి జాగరణ చేయాలని శాస్త్రం చెబుతోంది. ఎప్పుడూ పూజించని వారు కూడా ఈ ఒక్కరోజు మాత్రం శ్రద్ధాభక్తులతో ఈశ్వరుణ్ణి అర్చిస్తే సంవత్సరమంతా పూజించిన ఫలం దక్కుతుందట. అందుకే జన్మానికో శివ రాత్రి అనే సామెత పుట్టింది. నిత్య శివరాత్రి, పక్ష శివరాత్రి, మాస శివరాత్రి, మహా శివరాత్రి, యోగ శివరాత్రి... ఇలా ఏడాదిలో వచ్చే శివరాత్రులు మొత్తం ఐదు. వీటిలో పరమేశ్వరుడి పర్వదినం మహాశివరాత్రి. మాఘబహుళ త్రయోదశి అత్యంత పవిత్రమైన లింగోద్భవకాలం. శివునికి అతి ఇష్ట మైన తిథి. అందుకే ఈ రోజున శివలింగాన్ని ఆరాధించిన వారెవరైనా సరే పురుషోత్తముడు అవుతాడన్నది పురాణవాక్కు. ఈరోజు శివప్రతిష్ఠ, శివకల్యాణం చేయడం ఎంతో శ్రేష్ఠం. మహా శివ రాత్రి రోజు తనను పూజించినవారు తన కుమా రుడు కుమారస్వామి కన్నా ఇష్టులవుతారని సాక్షాత్తూ పరమశివుడే చెప్పినట్టు స్కందపురాణం చెబు తుంది.

### శివరాత్రి అంటే?

ఒకరోజు పార్వతీదేవి శివరాత్రి ప్రాశస్త్యం వివరించమని పరమశివుణ్ణి కోరుతుంది. శివ రాత్రి ఉత్సవం తనకెంతో ఇష్టమనీ, ఇంకేమీ

# శివ శంభో స్వయంభో

శం నిత్య సుఖమానందమకారః పురుష స్మృతః
వకారశ్శక్తిరమృతం మేలనం శివ ఉచ్చతే
తస్మాదేవం స్వమాత్మానం శివం కృత్వాశ్చయేచ్ఛివమ్

**శివ అనే శబ్దాన్ని పైవిధంగా వివరించింది శివపురాణం. శం అంటే శాశ్వతానందం, ఇ కారం పురుషుడు, వ కారం శక్తి, అమృతం, వీటి కలయికే శివ అనే శబ్దం. ఆవిధంగా ఏర్పడిన శివ శబ్దా నికి శుభం, మంగళప్రదం అనే అర్థాలున్నాయి. అట్టి శివతత్వం మూర్తీభవించినవాడు పరమేశ్వ రుడు. శుభకరుడు, మంగళకరుడు. అవ్యక్తుడైన ఆ పరమాత్మ, బ్రహ్మ ఇత్యాది దేవతల కోరికమీద వారు సేవించుకునేందుకు వీలుగా తన స్వరూపాన్ని వారికి అనుగ్రహించాడు. రూపాతీతమైన పర మాత్మ ఒకరూపంగా ఆవిర్భవించిన ఆ రోజే మహాశివరాత్రి.**

పరమేశ్వరుడు భక్త సులభుడు. తలపై కొద్దిగా జలాభిషేకం చేసి విభూది రాస్తే చాలు పర వశుడై అడగకనే వరాలు గుప్పించే బోళా శంక రుడు. నమ్మి కొలిచిన వారిని ఆపదలనుంచి కాపాడేస్వామి. శివా అని పిలిస్తే చాలు కష్టాల కడలి దాటిస్తాడు. కాసిని నీళ్ళు, నాలుగు మారేడు దళాలు, ఏరకమైన పిచ్చిపూలు తెచ్చి పూజించినా మురిసిపోతాడా భక్తవరదుడు.



చేయకుండా ఆ రోజు ఉపవాసమున్నా సరే తానెంతో సంతోషిస్తానని చెబుతాడు శివుడు. శివరాత్రి రోజు పగలంతా నియమనిష్ఠతో ఉపవాసం చేసి రాత్రి నాలుగు జాముల్లోనూ శివలింగాన్ని పంచామృతాలతో అభిషేకిస్తే శివునికి ప్రీతి కలుగుతుంది. మరునాడు బ్రాహ్మణుడికి భోజనం పెట్టి తాను భుజించి శివరాత్రి వ్రత సమాప్తి చేయాలి. దీనిని మించిన వ్రతం మరొకటి లేదంటాడు పరమశివుడు.

సుఖాన్ని ప్రదానం చేసేదాన్ని రాత్రి అంటారు. ఋగ్వేదంలో రాత్రిని గురించి వర్ణన ఉంది.

**ఉప మాపేపిశత్తమః కృష్ణం వ్యవక్తమస్థిత్**
**ఉష ఋణేవ యాతయ**

రాత్రి ఆనందదాయిని, అన్నింటికీ ఆశ్రయం ఇవ్వగలదని ప్రశంసిస్తూ ఋగ్వేదంలో ప్రస్తావన ఉంది. అందుకే మహాశివరాత్రి వ్రతం రాత్రిపూట చేస్తారు. రూపరహితుడైన శివుడు జ్యోతిరూపంలో లింగాకారంగా ఆవిర్భవించిన సమయం కనుక శివరాత్రిని లింగోద్భవకాలం అంటారు. ఈ పరమేశ్వరుడి 64 స్వరూపాలలో లింగోద్భవ మూర్తి చాలా ముఖ్యమైనది. అర్ధరాత్రి పన్నెండు గంటలకు లింగోద్భవ సమయమని పురాణాలలో చెప్పారు.

### లింగోద్భవకాలం

**శివంతు పూజయత్వా యోజా గర్తిచ చతుర్దిశీం**
**మాతః పయోధర రసం నపిబేత్ స కదాచన**

మాఘమాసంలో కృష్ణపక్ష చతుర్దశి రోజు వచ్చిన రాత్రికి ఓ ప్రత్యేకత ఉంది. అదే మహాశివరాత్రి. ఆ చతుర్దశి రోజు ఎవరైతే శివపూజ చేస్తారో, ఆ రాత్రి జాగరణ వహిస్తారో వారికి మళ్లీ తల్లిపాలు తాగే అవకాశం రాదు. అంటే ఆ భక్తుడు జీవన్ముక్తుడవుతాడని స్కందపురాణం స్పష్టంగా వివరించింది. గరుడ, స్కంద, పద్మ, శివ, అగ్ని మొదలైన పురాణాలన్నింటిలోనూ శివరాత్రి వర్ణన ప్రస్తావన ఉంది. ఆరోజు అర్ధరాత్రి జ్యోతిర్మయమైన ఒక మహాలింగంగా శివుడు ఆవిర్భవించాడు. పరమేశ్వరుడు లోకానికి తన స్వరూప దర్శనంతో, జగత్తును దేదీప్యమానం చేసిన లింగోద్భవ కాలంలో మనం నిద్రపోవడం అర్థరహితం. అందుకే శివరాత్రి జాగరణకు అంత ప్రాధాన్యం.

**ఉప సమీపే యో వాసః జీవాత్మ పరమాత్మనోః**
**ఉపవాసః సవిఘ్నేయ సర్వభోగ వసిర్జిత్**

అని ఉపవాసం గురించి వరాహోపనిషత్తులో ఉంది. ఉపవాసం అంటే దేవుడికి దగ్గరగా వసించడం, నివశించడాన్ని ఉపవాసం అంటారు. ఆ రోజు అభిషేకాదులతో శివుని పూజించి ఉపవాసముండి రోజంతా శివనామస్మరణంతో గడపడంలోని ఉద్దేశం మన తనువునూ, మనసును కూడా శివార్పితం చేయడమే. శివాంకితం చేయడమే. శివమంటే జ్ఞానమే. జన్మ పరంపర బంధాలు తెంచి నిత్యానందప్రదమైన మోక్షాన్ని అందించే శక్తి ఆ జ్ఞానానికే ఉంది. శివరాత్రి నాడు పద్నాలుగు లోకాలలోని పుణ్యతీర్థాలు బిల్వ మూలంలో ఉంటాయనీ, శివరాత్రి నాడు ఉపవసించి ఒక్క బిల్వపత్రాన్ని అయినా శివార్పణచేసి తరించమని శివపురాణం చెబుతోంది. కనీసం జన్మకొక శివరాత్రి అయినా చేయమని పెద్దలు చెబుతుంటారు. సమస్త ప్రాణికోటిలో సూక్ష్మజ్యోతి రూపంలో ఉండే శివుడు భూమిపై పార్థివ లింగంగా అర్చనలు పొందుతూ ఉంటాడు. శివరాత్రినాడు దేన్నయినా సరే శివార్పణం అని స్మరిస్తూ దానం చేయడమే మనకు ముక్తిదాయకం. శివరాత్రినాడు ఉపవసించి త్రికరణశుద్ధిగా శివుని పూజించిన సంవత్సరకాలం నిత్యం శివార్చన చేసిన ఫలం కలుగుతుందని సాక్షాత్తూ ఆ పరమేశ్వరుడు బ్రహ్మదేవునికి చెప్పాడని పురాణాలు చెబుతున్నాయి.

-బ్రహ్మశ్రీ అవధూత శర్మ

## శివరాత్రి విధులు



శివరాత్రిలో ప్రధాన నియమాలు ఉపవాస, జాగరణ. జాగరణ ఉద్దేశ్యం పగలూ రాత్రి కూడా మెలకువ కలిగి పరమాత్మను ఆరాధించడం. ఒకరోజును నాలుగు గంటల చొప్పున ఆరు భాగాలుగా చేసుకున్నట్లయితే షట్కాల శివార్చన కనిపిస్తుంది. శివభావనతో, శివనామస్మరణతో జాగరణ చేయాలి. శివుడు నిత్య జాగరూకుడు, జ్ఞానస్వరూపుడు. ఉపవాసం అనగా ఆహార విసర్జన. వారి వారి శారీరక అవస్థలను అనుసరించి ఉపవాసాలు చెప్పారు. చేయగలిగిన వారు నిర్జలోపవాసం చేయవచ్చు. లేనివారు దేహధారణార్థం సాత్విక ఫలహారం, క్షీరపానంతో ఉపవాస దీక్ష చేయవచ్చు. శివరాత్రి రోజున ఉదయం ఐదుగంటలకే నిద్రలేచి శుచిగా తలస్నానంచేసి, పూజా మందిరాన్ని, ఇంటిని శుభ్రం చేసుకోవాలి. గుమ్మానికి తోరణాలతో, పూజామందిరాన్ని ముగ్గులు, పూలతో అలంకరించుకోవాలి. తెలుపు దుస్తులు ధరించి, శివుని పటాలు, లింగాకార ప్రతిమలకు పసుపు కుంకుమలు పెట్టి పూజకు సిద్ధం చేసుకోవాలి. మారేడు దళాలు, తెల్లపూల మాలతో భోళా శంకరుణ్ణి అలంకరించాలి. అదేవిధంగా నిష్ఠతో ఉపవాసం చేయాలి. శివసహస్రనామములు, శివపురాణము, శివారాధన పారాయణం చేసే వారికి మరుజన్మంటూ లేదని శాస్త్రాలు చెబుతున్నాయి. శివరాత్రి సాయంత్రం ఆరుగంటల నుంచి మరుసటి రోజు ఉదయం ఆరుగంటల వరకు శివ స్తోత్రాలతో పూజలు చేసిన వారికి కైలాసవాసం ప్రాప్తిస్తుందని పండితులు చెప్పారు.

## భగవంతుని పుట్టినరోజు

భగవంతునికి పుట్టినరోజు అనేది ఉండదు. ఎందుకంటే పుట్టుకే లేదు కనుక. శివునికి స్వయంభూ, ఆత్మభూ అని రెండుపేర్లు ఉన్నాయి. దానర్థం తనంత కలిగినవాడు, ఉన్నవాడు అని. భగవంతుడు ఎప్పుడూ ఉన్నవాడే. కాకపోతే జగతిని అనుగ్రహించడం కోసం తనను తాను వ్యక్తం చేసుకుంటాడు. అందుకే శివునికి భవుడని పేరు. ఒక్కొక్క తిథికి ఒక్కొక్క అధిదేవతను వేదశాస్త్రం నిర్దేశిస్తోంది. అలా చతుర్దశి తిథికి పరమేశ్వరుడు అధిదేవత. ప్రతినెలలో వచ్చే బహుళ చతుర్దశి మాస శివరాత్రిగా చెప్పబడుతుంది. మాఘబహుళ చతుర్దశికి మహాశివరాత్రి అని పేరు.





# 'జ్యోతి' ఎక్కడ?

## విహారి

**నడకలో ఊగూ తూగూ లేవు. తప్పనిసరి అన్నట్టు అడుగులు పడుతున్నాయి. సర్వం కోల్పోయిన రాజరాజు లక్షణం.**

**ఆకారం చూస్తే కొబ్బరిపుల్లకు మద్దికాయ జొనిపినట్లుంది. చలువచేసిన వదులైన నేత పైజామా, లాల్చీ ధరించాడు. అతని మొహం నిరామయ భావనలు ప్రసారం చేస్తోంది. పగిలీపగలని పత్తికాయల్లాంటి కళ్ళు. చేతిలో ఇక్ష్వాకుల కాలంనాటిదిగా అనిపించే లెదర్‌బ్యాగ్ లోంచి కాగితాలు పైపైకి చొచ్చుకొచ్చి స్వేచ్ఛ కోరుతున్నాయి.**

మానసికంగా నిజాలకు, నిష్ఠూరాలకు మధ్య, భౌతికంగా కాంక్రీట్ జంగిల్‌రోడ్ ట్రాఫిక్ మధ్య నడుస్తున్న ముప్ఫైఏళ్ళ ముదుసలి దీపక్!

●●●

ఏ.సి హాలు కోలాహలంగా ఉంది. లోపలికి వచ్చి మధ్య వరుసల్లోవున్న ఒక కుర్చీలో కూర్చున్నాడు దీపక్.

అంతర్జాతీయఖ్యాతి గాంచిన వ్యక్తిత్వ నిర్మాణ నిపుణుడు ప్రొఫెసర్ రఘురాం నిర్వహిస్తున్న రెండురోజుల సెమినార్‌లో అదే చివరిరోజు. వికాసం పరిమితమైన వెలుగునిస్తుంది. అది నిలవదు. కానీ వ్యక్తిత్వ నిర్మాణం అనుభవపూర్వకం, సమగ్రం. అందుకే ప్రొఫెసర్ రఘురాం తాను వ్యక్తిత్వ నిర్మాణ ఫెసిలిటేటర్‌ని అంటాడు. కుర్చీలో కూర్చుని హాలంతా కలయజూశాడు దీపక్.

నాలుగువైపులా గోడలకు సూక్తులూ హితోక్తులూ ఫ్లెక్స్ బ్యానర్లూ. నిన్నటి బ్యానర్లస్థానే కొత్తవి వచ్చాయి.

'బ్రతుకొక ఉద్వేగ పర్వం. అయినా బ్రతుకొకవరం. విచక్షణారాహిత్యమే అసలైన విషాదం'.

అవును. ఆ విషాదం నుంచి అసంతృప్తి, నిరాశ, అలజడి, అశాంతి దాన్నుంచీ ఘటనలూ, దుర్ఘటనలూ, దుష్పరిణామాలూ... తల్చుకుంటే నవ్వొచ్చింది దీపక్‌కి.

●●●

సమయం ఉదయం పదిగంటలు.

హాలంతా నిశ్శబ్దం. వేదికమీద ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్ సిద్ధం. మంద్రస్థాయిలో బెల్ మోగింది. స్క్రీన్‌మీద 'శుభోదయం' అని ప్రత్యక్షమైంది. అభ్యర్థుల ఉత్సుకత ఆ వైపే!

క్షణాల్ని జారనీయకుండా రఘురాం వేదిక పైకి ప్రవేశించాడు. నిన్నటికంటే సాధారణమైన వస్త్రధారణలో ఉన్నాడు. వయస్సు, అందం, ఆరోగ్యం దేహాభరణాలుగా అమరిన స్ఫురద్రూపి! వదనంలో చిరునవ్వు అతనికి మరింత వన్నె తెచ్చింది.

'శుభోదయం' అన్నాడు. తారస్థాయి వయొలిన్ బీట్‌లా ఉందతని కంఠస్వరం. 'శుభోదయం' అన్ని గొంతుకలూ ప్రతిస్పందించాయి.

'నిన్న ఉదయం మనం స్థూలంగా వ్యక్తిత్వ నిర్వచనాన్ని 'బతుకు బతకనివ్వు'గా పాటించాలనే విషయంపై చర్చించి అంగీకరించడం జరిగింది. ఆ తర్వాత దాన్ని పాటించడానికి రిసోర్సెస్ ఏంటో తెలుసుకున్నాం. మంచితనం, చిత్తశుద్ధీ, సానుభూతీ అంటూ చాలా చెప్పారు. చివరికి అన్నింటిలోనూ ప్రేమ అనే గుణవిశేషం ఆవశ్యకమని సమన్వయం చేసుకున్నాం. సామాజికంగా కూడా ఈరెండింటి ప్రాధాన్యాన్నీ చర్చించాం. వాస్తవాలు ఎప్పుడూ సాధనలో ఆచరణలో మన

అడుగుల్ని ముందుకు సాగనీయకుండా అడ్డుపడవచ్చు. తడబడకూడదు. అని మీరు చెప్పిన ఉదాహరణలతోనే గమనించాం, అంతేకదా?"

అందరినుండీ అవునని సమాధానాలు వచ్చాయి. నిన్న రఘురాం తన సమ్మింగ్ అప్‌లో గీసిన బాణాలూ, సున్నాలూ అందరికళ్ళల్లో మెదిలాయి.

"లంచ్ తర్వాత మనం 'హ్యూమన్‌లాబ్'లో ప్రవేశించాం. కొంతమంది మిత్రులు మాట్లాడారు. ఇప్పుడు మళ్ళీ అదే సెషన్ కొనసాగుతుంది, అని ఆగి గుర్తుంచుకోండి, ప్రాసెస్ దానంతటదే ఎవాల్వ్ అవుతుంది. మీరంతా దీన్లో క్రియాశీల భాగస్వాములు. మౌన శ్రోతలు కారు అంటూ పూర్తిచేశాడు.

చాలామంది కళ్ళు చికిలించారు. కొన్ని తలలు ఔనన్నట్లు ఊగినై.

"మీరేమంటారు దీపక్?" దీపక్‌ని ఉద్దేశించి ప్రత్యేకంగా అడిగాడు రఘురాం.

"నథింగ్‌సార్" అని నిన్న ఇచ్చిన కోర్సు మెటీరియల్ తిరగేయసాగాడతను.

హాల్లో నిశ్శబ్దం పరుచుకుంది.

ఇప్పుడు రఘురాం తన కుర్చీలో కూర్చుని తాపీగా దినపత్రిక తిరగేయసాగాడు.

హాల్లో ఘనీభవించిన నిశ్శబ్ద వాతావరణం బరువుగా ఉంది. నిమిషాలు కదిలిపోతున్నాయి.

నిశ్శబ్దం భరించడం కష్టం. అది ఆలోచనలు రగిలిస్తుంది. అలజడితో మనసును అతలాకుతలం చేసేస్తుంది. అసహనాన్ని పైకి నెడుతుంది. భంగిమల్ని మారుస్తుంది. పెదవుల్ని కదిలిస్తుంది. పిడికిళ్ళు బిగించేట్టు చేస్తుంది. కళ్ళల్లో మంకెన పూవులు పూయిస్తుంది. చూపులతో ప్రశ్నలు రువ్వుతుంది. కానీ ఎవ్వరూ ఎవ్వరికీ ప్రతిస్పందనని ఇవ్వలేరు.

ఇప్పుడూ అదేస్థితి! కొందరు స్క్రీన్ సెర్ఫ్ చేస్తున్నారు. రఘురాం ఏవో అక్షరాలు వదులుతాడని ఆశ! ఏదో వెలుగురానున్న భ్రాంతి!

ఏమీలేదు. అంతా నిశ్శబ్దమే. స్మిత వదనంతో కాళ్లుచాచుకుని పత్రికాపఠనమే చేస్తున్నాడు రఘురాం.

మరికొన్ని నిమిషాలు గడిచిపోయాయి.

'దిసీజ్ టూమచ్' అంటూ లేచింది చంద్రిక.

హాలంతా సీరియస్ అయింది. పేపర్ మడిచి చిరునవ్వుతో, చెప్పు చంద్రికా అన్నాడు రఘురాం. అతని కంఠంలో ఆర్ధ్రత, ఆహ్వానం!

"మానాన్న కూడా ఇంతే. తాను చెప్పదలుచుకున్న ఒక్కముక్కా చెప్పి, ఇలాగే రాయిలా కూచుండిపోయేవాడు. నాకు తిక్కరేగిపోయేది. అరచేదాన్ని. నవ్వేవాడు చివరికి" దుఃఖోద్వేగంతో ఏడవసాగింది చంద్రిక.

రఘురాం లేచాడు. కదిలి వేదిక దిగి నెమ్మదిగా చంద్రిక ముందుకొచ్చాడు. భుజం తట్టాడు. చూపులతోనూ, ప్లీజ్ అన్న ఒక్కమాటతోనూ కూర్చోబెట్టాడు.

క్షణాల తర్వాత.. "అవునూ... చివరికేం జరిగిందంటావ్?" ప్రశ్నించాడు.

"ఏం జరుగుతుంది సార్. ఆయన చెప్పినట్టే జరిగింది. తాను వద్దనిచెప్పినా, ప్రేమవివాహం చేసుకున్నాను. ఆర్నెల్లు తిరిగేసరికి ఆ బంధం విఫలమైంది. ఒక్కమాటలో చెప్పాలంటే దానికి కారణం డబ్బు. ప్రస్తుతం కూటికీ, గుడ్డకూ చాలని సంపాదనతో కాలం గడుపుతున్నాను సార్".

"అవునా..." అంటూ వెనుదిరిగాడు రఘురాం. ముందు సీట్లో భానుచంద్ర చేయెత్తాడు. 'చంద్రిక విషయమా?' అడిగాడు.

'అవును' అన్నాడు. "నో ప్లీజ్ ఇతరుల అనుభవాలమీద నో కామెంట్స్" అంటూ వెళ్ళి వేదిక మీద కుర్చీలో కూర్చున్నాడు రఘురాం.

టీ వచ్చింది. అందరూ లేచివెళ్ళి టీ తాగి వచ్చి కూర్చున్నారు. మళ్ళీ నిశ్శబ్దం. కిలోలు కిలోలుగా నిట్టూర్పులు! పదినిమిషాలు గడిచాయి.

ఒక చివరినుండి రాజా లేచాడు. ఏక్షణానైనా ఏకధారగా రాబోయే కన్నీళ్ళను తమాయించుకుంటూ మొదలు పెట్టాడు.

"సార్! మా అమ్మకు నేనొక్కడినే సార్. నేను పుట్టడానికి నాలుగురోజుల ముందే మానాన్న చనిపోయాడు. మా అమ్మ చాలా కష్టపడి ఇళ్లల్లో పనిచేసీ, కూలీపనులకెళ్ళీ, బీడీలు చుట్టీ నన్ను పెంచింది సార్. నేను చదువుకుని ఉద్యోగం చేయాలని చాలా తాపత్రయపడింది. పెద్దవయసులో అండలేని తనకు అండగా నిలబడి ఉద్ధరి

స్తానని ఆశపడింది. నేను డిగ్రీ పాసై ఉద్యోగంలో చేరి ప్రేమ వివాహం చేసుకుని అమ్మను నిర్లక్ష్యం చేశాను సార్. వేరు కాపురం పెట్టి ఆమెను పట్టించుకోలేదు. పెద్ద వయసులో రోగాలపాలై తిండికి లేక గుడిమెట్లమీద నిస్సహాయంగా అంద రినీ అడుక్కుంటూ చనిపోయింది. తర్వాత తెలి సింది నాకు. మా అమ్మకు ఏకైక సంతానం నేను. చాలా ద్రోహం చేశాను సార్. నా పాపానికి నిష్కృతి లేదు. న్యాయస్థానాలకు దొరకని హంత కుణ్ణి" అరచేతుల్లో ముఖం దాచుకున్నాడు.

"అమ్మది కడుపుతీపి, కష్టం అనిపించదు. నీది బాధ్యతా రాహిత్యం. నిన్న మనం అనుకున్న ప్రేమ రాహిత్యానికి నీదొక ఉదాహరణ" చేత్తో రాజా భుజం తడుతూ అనునయించాడు రఘురాం. నెమ్మదిగా అతన్ని కూర్చోపెట్టాడు. అనుభవం అనేది సంఘటన కాదు, దాన్నుంచి మనం ఏమి నేర్చుకున్నాం అనేదే ముఖ్యం' అంటూ అవే మాటలు ఇంగ్లీషులో బోర్డుమీద రాశాడు.

పరుగెత్తి పరుగెత్తి ఏ రేగుచెట్టుకిందో అల సట తీర్చుకుంటున్నట్లనిపించింది అందరి మన సులలోనూ! ఆ హాలులో మరే ఇతర ఆలోచనలూ, తామూ మాట్లాడాలనే కోరికలూ వ్యక్తం కాలేదు.

ఉన్నట్టుండి రఘురాం దీపక్‌వైపు చూసి "ఏదైనా చెబుతారా?" అని అడిగాడు. కలవరపడ్డాడు దీపక్. తమాయించుకుని 'నథింగ్ సార్' అన్నాడు.

కొన్ని నిమిషాలు గడిచాయి.

"లంచ్ తర్వాత మనం మరికొన్ని అంశాల్ని మరో ప్రాక్టికల్ ఎక్సర్‌సైజ్‌తో రీయిన్‌ఫోర్స్ చేసు కుందాం. రెండున్నరకి కలుద్దాం" అంటూ బ్రేక్ ఇచ్చాడు. అప్పుడు సరిగ్గా ఒకటిన్నర అయింది.

విరామ సమయంలో చాలామంది రఘురాం చుట్టూచేరి జరిగిన చర్చ గురించి మాట్లాడారు. కొందరు తమ సందేహాల్ని వెలిబుచ్చారు. అందరి తోనూ ఆహ్లాదస్మిత పూర్వకంగా సంభాషించి లంచ్ ముగించాడు రఘురాం. వీరందరికీ దూరంగా ఒక చెట్టుకింద నిలబడి తన భోజనం ముగించాడు దీపక్. అతన్ని రఘురాం గమనిస్తూనే ఉన్నాడు.

కార్యక్రమం తిరిగి మొదలైంది.

"వేదికకి ఎడమవైపు ఒక ప్రత్యేకమైన గది ఉంది. మీరు నిశ్శబ్దంగా ఒకరితర్వాత ఒకరుగా ఆ గదిలోకివెళ్ళి అక్కడ సూచించినట్లు చేయండి. ఒక్కొక్కరికీ రెండు నిమిషాలు సమయం. బెల్ మోగిన తర్వాత తిరిగి హాల్లోకి వచ్చి మీ సీట్లో కూర్చోవాలి. నో క్రాస్ టాకింగ్. నో విస్పరింగ్స్" అంటూ "మనం కల్యాణితో మొదలెడదాం" అన్నాడు రఘురాం.

హాలంతా ఉత్కంఠ, నిశ్శబ్దం. కల్యాణి లేచి వెళ్ళింది.

**అతడో వ్యక్తిత్వవికాస నిపుణుడు. ఆ సెమి నార్‌కు చాలామంది వచ్చారు. వాళ్ళందరినీ ఇన్వాల్వ్‌చేసి వారి హృదయాలు కదిలించేట్టు చేశాడు ఆ నిపుణుడు. సెమినార్ ముగింపుదశకు వచ్చింది. ఒక్కొక్కరూ అతడు చెప్పినట్టే ఒక ప్రత్యేక గదిలోకివెళ్ళి రెండు నిమిషాలు గడిపి వస్తున్నారు. కానీ ఒకేఒక్క వ్యక్తి మాత్రం ఆ గది లోకి వెళ్ళలేదు. అతడు ఎందుకు వెళ్ళలేదు? ఆ గదిలో ఏముంది? అక్కడేం జరిగింది?**

నిమిషాలు గడుస్తున్నాయి.

ప్రతి ఒక్కరూ గదిలోకి వెళ్ళి వస్తున్నారు. వచ్చిన వారు అంతర్ముఖులై ఉండిపోతున్నారు.

నాలుగవుతుండగా అందరి వంతూ ముగి సింది. చివరగా దీపక్ ఒక్కడే మిగిలాడు. అందరూ అతనివైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

రఘురాం గంభీరంగా నిలబడి చేతులు సున్ని తంగా రబ్ చేసుకుంటూ "ఏంటి దీపక్?" అన్నాడు ప్రశ్నార్థకంగా.

"మీరు ప్రొసీడ్ అవ్వండి సార్" ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు దీపక్. కారణాలు అడగ లేదు రఘురాం.

అందరినీ ఉద్దేశించి తన ప్రసంగం మొదలు పెట్టాడు.

"మీలో ఏ ఒక్కరూ లోపల ఏం జరిగిందో చెప్పక్కర్లేదు. నిజానికి రివీల్ చేయకూడదు. ఇది నిబంధన. కానీ ఈ అనుభవం తర్వాత లంచ్ టైమ్ వరకూ మనం నేర్చుకున్న కన్‌క్లూజన్స్ నిఖార్సయినవో కావో అర్థం కాకపోతే మాత్రం వారు నాతో ప్రత్యేకంగా ఈ రోజు రాత్రికిగానీ రేపుగానీ ఫోన్‌లో మాట్లాడవచ్చు, వెల్‌కమ్" అని ఒక్కక్షణం ఆగాడు. అతని ఫోన్ నంబరు బోర్డు మీద కనిపించింది.

"సో వ్యక్తిత్వ నిర్మాణ ప్రాముఖ్యాన్ని ఈ అనుభవంతో ఎవరికివారే తిరిగి నిర్వచించుకోండి. ఇప్పుడు ఈ నాలుగు మాటలూ గుర్తుంచుకోండి. ఆత్మపరిశీలన, లోచూపు, పార్శ్వ సహానుభూతి, ముందుచూపు అనే అక్షరాలు బోర్డుకెక్కాయి.

"ఆలోచించండి. ఆలోచిస్తూ ఉండండి. ఆచ రించండి. ఆచరిస్తూ ఉండండి. అని అందరికీ బెస్టాఫ్‌లక్ చెప్పి సెషన్ ముగించేశాడు.

అతని దగ్గర సెలవు తీసుకుని అందరూ బైటకు నడిచారు.

"మీ నుంచి నాకో సమాధానం కావాలి" కద లకుండా కుర్చీలోనే కూర్చున్న దీపక్ దగ్గరికి వస్తూ అడిగాడు రఘురాం.

"అవునూ, మీరెందుకు రూమ్‌లోకి వెళ్ళలేదు?"

"ఆగదిలో మీరు ఏం ఉంచివుంటారా? అని ఆలోచించాను. అభ్యర్థులంతా వివిధ మతాలు, ఆచారాలకు చెందినవారు కాబట్టి దేవుడి విగ్ర హాలు, ఫోటోల వంటివి ఉండవు. ఒక జ్యోతిని పెట్టి ఉంటారని ఊహించాను. అందరూ ఆ జ్యోతికి ప్రణమిల్లి కన్‌ఫెషన్ కోరి ఉంటారు" మాటలు కూడదీసుకుంటూ సమాధానమిచ్చాడు దీపక్.

ఆశ్చర్యపోవడం ఇప్పుడు రఘురాం వంత యింది. కారణం నూటికి నూరుశాతం అదే వాస్తవం కనుక!

రఘురాం చూపుల్లో చూపు గుచ్చుతూ మళ్ళీ చెప్పసాగాడు దీపక్.

ఈ కన్‌ఫెషన్స్‌వల్ల ప్రయోజనం లేదుసార్. గుండెల్లో జ్యోతి వెలగాలి. అప్పుడే బుద్ధీ, మనసులో మార్పూ సాధ్యం. ఆ జ్యోతి నా గుండెలో శాశ్వతంగా నిలిచి ఉంది సార్. కానీ..కానీ.. దుఃఖంతో దీపక్ గొంతు పూడుకుపోయింది. మాట పెగలలేదు.

మౌనంలో కొన్ని నిమిషాలు గడిచాయి. నెమ్మ దిగా తల పైకెత్తి "నా జ్యోతి కథ చెబుతాను, వినండి సార్" అని చెప్పసాగాడు.

"ఆమె నా సహోద్యోగి. ఎంతో చురుకుదనం, ఉత్సాహంగా పనిచేసేది. అందరితో సరదాగా ఉండేది. మా ఇద్దరివీ పక్కపక్క సీట్లే. అల వాట్లూ అభిరుచుల దగ్గరనుంచీ అనేక విషయాలు చర్చించుకుంటూ ఉండేవాళ్ళం. పనిలో ఒకరికొ కరు సహకరించుకునే వాళ్ళం. ఆమె కలుపుగోలు తనం నాలో ఆశలు రేపింది. కోరికలు పెంచింది".

"ఆ విషయాన్నే అన్యాపదేశంగా మాటల మధ్య తెలియజేస్తూ వచ్చాను. నా ఉద్దేశం గమ నించనట్టు తెలివిగా మాట తప్పించి వేరే విష యాలలోకి మళ్ళించేది. అయినా క్రమేపీ ఆమె పట్ల నా ఆరాధన పెరిగిపోయింది. నా మన సులో ఆమెపట్ల దగ్గరితనం పెంచుకున్నాను. ఆమె ఒప్పుకుంటే పెళ్ళిచేసుకోవాలనే నా ఆలోచన."

"ఒకరోజు అనుకోకుండా కలిసివచ్చిన ఏకాం తంలో నా మనసులో విషయాన్ని తెలియజేశాను. అసలు సంగతిని కచ్చితంగా తేల్చుకోవాలన్నదే నా తపన."

ఆమె చాలా తేలిగ్గా తీసుకుంది. నవ్వుతూ



కొట్టిపారేసింది. అలాంటి ఆశ పెట్టుకోవద్దన్నది. మరి సూచనప్రాయంగా చెప్పిననాడే నీ నిర్ణయం ఎందుకు చెప్పలేదని నిలదీశాను. తీసిపారేస్తు న్నట్టుగానే సమాధానమిచ్చి, తాపీగా తనకు పెళ్ళి నిశ్చయమైందనీ, తన బావే పెళ్ళికొడుకనీ చెప్పింది. ఆమాట నాకు అశనిపాతమైంది. ఆ క్షణంలో నాలో ఉద్రేకం, ఆమెపై కసి..! నువ్వు లేకపోతే నాకు జీవితం లేదు. నువ్వు నాకుతప్ప వేరెవ్వరికి దక్కినా భరించలేనని ఉద్వేగంగా చెప్తుంటే, సున్నితంగా నన్ను మందలించింది.

వినే పరిస్థితుల్లో లేను. నాలో ఏదో పంతం. ఆవేశంలో ఆమె మీదకు విజృంభించాను. ఎదు రు తిరిగింది. తప్పనిసరి పరిస్థితి వల్ల అప్పటికి నాతో పెళ్ళికి ఒప్పుకుంటుందనిపించింది. విచ క్షణా జ్ఞానం నశించింది. బలవంతం చేయడం వల్ల సుఖపడలేమనే విషయం నేను అప్పుడు గ్రహించలేదు. నాలోని రాక్షసుడు విజృంభిం చాడు. ఆమె ఎదురు తిరిగినకొద్దీ నాలో కసి పెరిగింది. ఆమె బ్రతుకు చిదిమేశాను. అప్పటికి గానీ నాలో అహం తృప్తి చెందలేదు.

తెల్లవారింది. నాకళ్ళకు కమ్మినపొర వీడింది. తెలివి తెచ్చుకున్నాను. పరిస్థితి తీవ్ర పరిణా మాల్ని మిగిల్చిందని కొద్దిసేపటి తర్వాతగానీ తెలియలేదు.

"రాత్రి ఇంటికిచేరిన ఆమె ఆత్మహత్య చేసు కుంది. నా ప్రాణం అనుకున్న జ్యోతిని అలా బలితీసుకుంటాననుకోలేదు. తల్లడిల్లిపోయాను. నాకెంతో ఇష్టమైన నా జ్యోతి ఆరిపోయింది సార్... ఆరిపోయింది..." భావోద్వేగంతో నిశ్శబ్దమై పోయాడు. అతని కళ్ళు వర్షిస్తున్నాయి.

మళ్లీ తలెత్తాడు. "నా అసలు బాధ ఎవ్వరికీ తెలియదు సార్. జ్యోతి ఆత్మహత్యకు కారణం నేనేనని లోకానికి తెలియదు. ఇదే అసలైన విషాదం. అదే నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది."

ఉలికిపడ్డాడు రఘురాం. అతని మొహం వివర్ణమైంది. జేబులోంచి రుమాలు తీసుకుని మొహం తుడుచుకున్నాడు. గ్లాసుతో నీళ్ళు తీసు కుని గటగటా తాగేశాడు.

ఒక్కసారిగా వాతావరణం వేడెక్కినట్లని పించింది. పక్కకి తిరిగేసరికి బ్యాగ్ భుజాన తగిలించుకుని కళ్ళు తుడుచుకుంటూ బరువుగా బైటకు అడుగులేస్తున్నాడు దీపక్.

"నువ్వు ఆర్పేసింది నీ ఆశాజ్యోతిని దీపక్, నీ పశ్చాత్తాపం జీవితాంతం నిన్ను దహిస్తూనే ఉంటుంది. కానీ ఆ జ్యోతి నా జీవితానికి కాబోయే జ్యోతి. ఆ రాత్రి సిడ్నీలో ఉన్న నాకు జరిగిందంతా ఫోన్‌చేసి చెప్పింది. నీ పేరు కూడా చెప్పింది. కానీ ఆ సమయంలో నా కర్తవ్యమే మిటో, నిర్ణయం ఏమిటో చెప్పకముందే ఆమె తన జీవితాన్ని ముగించింది" తనలో తను గొణుక్కుంటున్నట్లుగా అనుకున్నాడు రఘురాం.

ఒంటరిగా నిలబడిపోయిన రఘురాంకి స్తంభిం చిన గాలి తోడైంది.

***సెల్: 98480 25600***

## FORM IV

(Rule 8)

UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867
STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS
ABOUT WEEKLY - NAVYA

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Hyderabad |
| 2. Periodicity of its Publication | : | WEEKLY |
| 3. Printer's name | : | VEMURI RADHA KRISHNA |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin] | : | - |
| Address | : | Plot No.204, Road No. 76, III Phase, Jubilee Hills, Hyderabad - 500033, Telangana |
| 4. Publisher's Name | : | VEMURI RADHA KRISHNA |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin] | : | - |
| Address | : | Plot No. 204, Road No. 76, III Phase, Jubilee Hills, Hyderabad - 500033, Telangana |
| 5. Editor's Name | : | A.N. JAGANNADHA SARMA |
| Nationality | : | INDIAN |
| 1(a) Whether a citizen of India | : | YES |
| (b) If a foreigner, the country of origin] | : | - |
| Address | : | Plot No.183, Flat No.502, Kakatiya Residency, Moti Nagar, Hyderabad - 500018 |
| 6. Name and addresses of individuals Who own the newspaper and partners Shareholders holding more than one percent of the total capital | : | (a) Aamoda Publication Pvt.Ltd Plot No.76, Road No.70, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500033 |
| | | (b) V.Radha Krishna Plot No. 204. Road No.76, III Phase, Jubilee Hills Hyderabad - 500033 |
| | | (c) K.Kanaka Durga Plot No. 204. Road No.76, III Phase, Jubilee Hills Hyderabad - 500033 |
| | | (d) M. Prabhakara Rao Flat No. 103, Ruby Apartments, Lumbini Rock Dale, Somajiguda, Hyderabad - 500082. |
| | | (e) D. Jai Ramesh Plot No. 173, Road No. 13, Jubilee Hills, Hyderabad - 500033. |
| | | (f) V. Aditya 8-3-293/82/J 111/211-1, Road No.76, Phase-III Jubilee Hills, Hyderabad-500 033 |
| | | (g) Ch. Shruthi Keerthi 8-3-293/82/J 111/211-1, Road No. 76, Phase-III Jubilee Hills, Hyderabad-500 033 |
| | | (h) Active Power Corporation Pvt. Ltd Plot No. 76, Road No. 70, Ashwini Layout, Huda Heights Jubileehills, Hyderabad-500 033 |
| | | (g) Vemuri Anusha 8-3-293/82/J 111/211-1, Road No. 76, Phase-III Jubilee Hills, Hyderabad-500 033 |

I, VEMURI RADHAKRISHNA, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/
VEMURI RADHAKRISHNA
Publisher

Date: 17.02.2017

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**తన కళ్ళను తనే నమ్మలేకపోతున్నట్టు నోరు తెరుచుకుని ఆశ్చర్యంగా చూశాడు వెట్టి.**

**'అలా చూస్తావేంటి అన్నయ్యా? ఇంతసేపూ మా నాయనతో మాట్లాడితివి కదా.. ఈపాటికి నీకు అన్నీ అర్థం అయిపోయి ఉండాలి కదా..' మొఖమంతా నోరు చేసుకుని నవ్వుతూ అన్నాడు బండోడు.**

**'అర్థం అయిపోయి ఉండటమా? అదేమిటి?' అప్పుడు కూడా తన మనసులో లైటు వెలగకపోవటంతో మరింత అయోమయంగా అడిగాడు వెట్టి.**

'ఏమీ తెలియనివాడిలా నోరు వెళ్ళబెట్టి నన్ను వెక్కిరించటం బాగోలేదు అన్నయ్యా. ఈశ్వరి వేరు అనే ఒక మూలిక ఉంటుంది. ఎటువంటి విషపు పురుగునైనా అది దూరంగా తరిమేస్తుంది. ఇప్పుడు మన నెత్తులమీద ఉన్న పిచ్చిపొద, దానికి అక్కో చెల్లెలో అవుతుందట. బాగా గుర్తు పెట్టుకోమని మా నాయన నాకు చెప్పాడు' తను విరిచి పట్టుకున్న మండల్ని అటూ ఇటూ ఊపుతూ అన్నాడు బండోడు.

అతని తండ్రి విషవైద్యంలో ఆరితేరినవాడని మరచిపోయినందుకు తనలో తను ఎంతగానో సిగ్గుపడ్డాడు వెట్టి.

అంతలోనే వచ్చింది అతనికి ఇంకొక అనుమానం. గోతి పైభాగంలోకి పోయి చుట్టూ చూస్తున్న బండోడికి రెండు క్షణాల తర్వాత తెలిసింది అది.

'ఏంటన్నయ్యా నీ అనుమానం?' చేతిని అందించి అతన్ని కూడా బయటికి లాగుతూ అడిగాడు.

'ఇది... ఈ పొద తమ విషానికి విరుగుడు అని తెలిసి కూడా ఈ పాములు ఇక్కడే కాపురం పెట్టుకోవటంలో ఏదైనా రహస్యం ఉండి ఉంటుందా?' అడిగాడు వెట్టి.

చేతుల్లో ఉన్న మండల్ని కిందపడేసి, మొఖానికి పట్టిన చెమటను తలపాగాతో తుడుచుకున్నాడు బండోడు.

'నువ్వు చెప్పేటంతవరకూ ఈ విషయాన్ని గురించి నేను ఆలోచించలేదు అన్నయ్యా! చాలా చోట్ల కనిపిస్తాయి ఈ పిచ్చిపొదలు. గమ్మత్తేమిటంటే సరిగ్గా పుట్టలున్న ప్రదేశంలోనే ఇవి ఏపుగా పెరిగి పెద్దవి అవుతూ ఉంటాయి. మరి ఈ పొదలకి, ఆ పాములకి కనెక్షన్ ఏమైనా ఉండి ఉంటుందేమో నాకు తెలియదు. నీవంటివాడు విడమరిచి చెప్పాల్సిందే' అన్నాడు.

చెప్పులు లేకుండా నడిచేటప్పుడు ఎదురుదెబ్బ ఏదైనా తాకితే ఏం చేయాలో తెలియని తను, అటువంటి విచిత్రమైన విశేషాలను విశ్లేషించటం ఏమిటో వెట్టికి తెలియలేదు.

అదే మాట నిస్సంకోచంగా బండోడికి చెప్పాడు అతను. 'ఇటువంటి వాటిని గురించి మాట్లాడాలంటే మీ నాయనలాంటోళ్ళు మాత్రమే మాట్లాడగలరు. నా వంటివాడు నోరు తెరిచి ఏమీ చెప్పలేడు' అంటూ పుట్టకు దూరంగా నడిచాడు.

చెవుల్ని ఓరగా పెట్టి తమ చుట్టూ ఉత్పన్నమవుతున్న శబ్దాలు ఆలకిస్తూ అతన్ని అనుసరించాడు బండోడు.

'కాళ్ళు పీక్కు వచ్చినట్టున్నయ్ అన్నయ్య ఆ పఠాన్‌తో పాటున్న జనానికి, వెనక్కి వెళ్ళిపోయారు. రెండు నిమిషాల తర్వాత ఎనౌన్స్ చేశాడు.

కింద ఉన్న ఎండుటాకుల్ని, చిన్నచిన్న కొమ్మల్ని, ఎండుకుపోయిన పొదల్ని కొంచెంగా కూడా డిస్టర్బ్ చేయకుండా, మళ్ళీ చందనం చెట్టున్న ప్రదేశం దగ్గరికి పోయారు వారిద్దరూ.

అంతకుముందు ఎక్కడ కూర్చుని ఉన్నాడో సరిగ్గా అక్కడే కాలుమీద కాలు వేసుకుని కనిపించాడు పఠాన్.

'ఎవడై ఉంటాడు వాడు? ఎందుకు వచ్చి ఉంటాడు ఇక్కడికి?' తలతిప్పి చుట్టూ చూస్తూ అడుగుతున్నాడు.

చిన్నచిన్న వంట గ్యాస్‌స్టవ్‌లను వెలిగించి గబగబా వంటలు చేస్తున్నారు అతనితో పాటున్న జనం.

'వాళ్ళు ఎవరో అనామకులై ఉంటారు పఠాన్‌బాబు. ఈ మధ్య ఈ అడివిలో కుందేళ్ళతో పాటు చిన్నచిన్న జింకపిల్లలు కనిపిస్తున్నాయని చింతలపల్లిలో చాలామంది అనుకోవటాన్ని నేను విన్నాను. వాటికోసం వచ్చి, గుంపుగా ఉన్న మనల్ని చూసి భయపడిపోయి ఉంటారు' సీరియస్‌గా తల వంచుకుని వంట చేస్తున్న మనిషి ఒకతను అంటున్నాడు.

'ఇట్టాంటివాళ్ళతోనే చిక్కులు వస్తాయిరా. ఎటు పోవాలో ఎలా పోవాలో తెలియక కంగారు కంగారుగా కలియతిరిగి, ఆఖర్లో ఆ ఫారెస్టోళ్ళ కళ్ళల్లో పడతారు. వాళ్ళకోసం వెతుకుతూ మనలాంటోళ్ళ మీదికి వచ్చిపడతారు ఈ ఫారెస్టోళ్ళు' విసుగు నిండిన కంఠంతో అన్నాడు పఠాన్.

'ఏం చేద్దాం అన్నయ్యా? నా లెక్కప్రకారం



ఇంకోగంట వరకూ వాళ్ళు గొడ్డళ్ళు పట్టుకోరు. ఇక్కడి నుంచి కదిలి అవతలికి పోరు' పొదలచాటున ఉన్న బండోడు వెట్టిని పలకరించాడు.

'మనం చేయవలసింది చేసేశాము. ఇకమీదట జరగాల్సింది అంతా నీ జతగాడి మీద ఆధారపడి ఉంది. అతనికి ఇక్కడి దారులన్నీ బాగా తెలుసా?' ఉన్నట్లుండి అన్నాడు వెట్టి.

'ఎవరు? మా వాడికా? మనిషి బయటికి కనిపించడుగాని, మంచి దిల్లున్నవాడు. ఈ పాటికి చింతలపల్లి వెళ్ళిపోయి ఉండచ్చు. లేదా దగ్గర్లోకి పోయి ఉండచ్చు' అన్నాడు బండోడు.

అతను ఆ మాటలు అన్నప్పుడు వచ్చింది మళ్ళీ ఒక అనుమానం వెట్టికి. 'పెద్దమొనగాడి మాదిరి నంబరు ఇచ్చి పంపించాను. పైసలు ఇవ్వలేదు. మర్చిపోయాను' తన జేబు తడుముకుంటూ అన్నాడు.

'ఇదంతా మా ఏరియా! ఇక్కడ మాకు పైసలు దేనికి అన్నయ్యా? చింతలపల్లి నిండా రవీంద్రన్నకి చుట్టాలున్నారు. అసలు గట్టిగా అడిగితే ఆళ్ళందరూ కట్టకట్టుకుని మనోడి ఎనకాల వచ్చేయమన్నా వచ్చేస్తారు' అన్నాడు బండోడు.

'బాజిరెడ్డికి సంబంధించిన వాళ్ళు కూడా ఉంటారు కదా.. వాళ్ళు పూనుకుంటే మన ఆలోచన దెబ్బతినిపోతుంది కదా' అన్నాడు వెట్టి.

'సగం మంది బాజిరెడ్డి జనమే ఉన్నారు అక్కడ. అయినా సరే మరేం పరవాలేదు. పని పూర్తి అవుతుంది. నువ్వు కంగారుపడాల్సిన అవసరం లేదు' భరోసా ఇచ్చాడు బండోడు.

గ్యాస్‌స్టవ్‌ల మీద ఉడుకుతున్న పదార్థాల వాసన గాలివాలున ఆ ప్రదేశాన్నంతా ఆవరించుకుని, అతనికి, వెట్టికి ఆకలిని అధికం చేయటం మొదలు పెట్టింది.

'లాభం లేదు అన్నయ్యా.... మనం కూడా ఏదో ఒకటి వెతుక్కోవాల్సిందే. కడుపులో పేగులు గడబిడ చేయటం మొదలుపెడుతున్నాయి' ఉన్నట్లుండి అన్నాడు అతను.

అంతకుముందు ఎలా వచ్చారో, అలాగే నిశ్శబ్దంగా వెనక్కి జరిగారు ఇద్దరూ. తినటానికి పనికివచ్చే పదార్థాలను వెతుక్కుంటూ మళ్ళీ అడవిలోకి బయలుదేరారు.

●●●

సబ్బిరెడ్డి పేరును మాత్రమే విని ఉన్నాడు రవీంద్ర బావమరిది. ప్రత్యక్షంగా ఎప్పుడూ చూడలేదు. వెట్టి తన చేతికి ఇచ్చిన ఎండుటాకు మధ్యకు విరిగి పోవటమో, తుంపులు తుంపులై దాని మీది నంబర్లు కనిపించకుండా పోవటమో జరగకుండా మునివేళ్ళతో పట్టుకుని, పరుగుపందెంలో పాల్గొంటున్నట్టు వేగంగా ప్రయాణం చేస్తున్నాడు.

అడవిలోనుంచి బయలుదేరిన తర్వాత అరగంటకు అతని కనుల ముందు ప్రత్యక్షం అయింది, అదేపనిగా జనం అటూ ఇటూ తిరగటం వల్ల మెత్తగా తయారైన అడవిదారి ఒకటి.

దాన్ని పట్టుకుని ఒక కిలోమీటర్ దూరం పోయిన తర్వాత కనిపించింది ఒక కంకర రోడ్డు. ఎగుసుకు వస్తున్న ఆయాసాన్ని అణుచుకోవటం కోసం, ఆ రోడ్డు పక్కనే కనిపించిన ఒక బండమీద కూర్చున్నాడు అతను.

'పది నిమిషాలు రెస్టు. పదకొండో నిమిషంలో మళ్ళీ రన్నింగ్ రేసు' అని తనలో తను అనుకుంటూ ఉండగా సడన్‌గా అతని వెనుక ప్రత్యక్షం అయ్యాడు ఒక మనిషి.

రోడ్డుమీది నించి రాలేదు అతను. రోడ్డును ఆనుకుని ఉన్న పొదల్లో నుంచి వచ్చాడు.

'ఎవరయ్యా నువ్వు? ఒంటరిగా ఈ అడవిలో ఏం చేస్తున్నావు?' గంభీరమైన కంఠంతో అడిగాడు.

మాట మామూలుగానే అనిపించింది రవీంద్ర బావమరిదికి. వాలకం మాత్రం ఇంకేదోలా కనిపించింది.

'అడవిలో లేను నేను. అడవిదారిలో ఉన్నాను. నువ్వు ఎవరివి? నువ్వేం చేస్తున్నావు ఒంటరిగా?' కనులు చిట్లిస్తూ ఎదురుప్రశ్న వేశాడు.

తెల్లటి పల్వరుస బయటికి కనిపించేలా నవ్వాడు ఆ మనిషి. 'అడవిలో లేవు. బాగానే ఉంది. మరి ఈ దారిలో ఏం చేస్తున్నావు?' అని అడిగాడు.

అతను అడుగుతూ ఉండగానే గణగణమని మోతలు చేసింది అతని పాంటుజేబులో ఉన్న ఫోను. బయటికి తీసి, ఒకసారి దానివంక చూసి, ఒక్క మాట కూడా మాట్లాడకుండానే పెట్టేశాడు. తిరిగి పాంటుజేబులోకి నెట్టుకుంటూ ప్రశ్నార్థకంగా కనుబొమలు ఎగురవేశాడు.

తనకు అప్పచెప్పిన పని పూర్తిచేయటానికి తను కాళ్ళు కొట్టుకుంటూ చింతలపల్లి దాకా వెళ్ళవలసిన

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో బసవప్పను, అతడి బృందాన్ని చావమోదుతాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించి, ఆ ఇంటి ఇల్లాలి తమ్ముడి ద్వారా ఒకప్పుడు బాజిరెడ్డికి సన్నిహితుడైన వ్యక్తిని కలుసుకుని, చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు వెట్టి. బసవప్ప మనుషులు వెట్టి కోసం బయలుదేరుతారు. డాక్టరు పిచ్చమ్మిని పరీక్షించి, మూడు మాత్రలిస్తాడు. డాక్టరుని పిలిపించిన విషయం తెలుసుకున్న బాజిరెడ్డి, వారిని తనదగ్గరకు రప్పించుకుని వివరాలడుగుతాడు. ఇక ఆత్మశిల గురించి తెలుసుకున్న వెట్టి, బండోడు, యువకుడితోపాటు అడ్డదారి గుండా కదిరి బయలుదేరతాడు. చింతలపల్లి దగ్గర ఉన్న అడవిలో పఠాన్ కనిపిస్తాడు. యువకుడిని చింతలపల్లి పోయి సబ్బిరెడ్డికి ఫోన్ చేయమని పంపిస్తాడు వెట్టి. తను అక్కడే ఉండి, పఠాన్‌ని ఓ కంట కనిపెడుతూ ఉంటాడు. **ఆ తర్వాత...**

**బుస్సుమని శబ్దం చేస్తూ పొదలోనుంచి బయటికి వచ్చింది పెద్దపాము. పడగను అంతెత్తున లేపి, పూత్కారాలు చేయటం మొదలుపెట్టింది. చెమటలు పట్టేశాయి వెట్టికి, బండోడికి. తాము దూరంగా వెళ్లినా, అదెందుకు అంతలా గొడవ చేస్తుందో అర్థం కాలేదు ఇద్దరికీ. మెల్లగా బండోడిని పక్కకు పంపించి, పొదలోకి తొంగిచూశాడు వెట్టి. ఒక్కసారిగా పాదాల్లోని శక్తి నశించిపోయినట్లుగా కూలబడిపోయాడు వెట్టి. ఇంతకీ అతడికి ఆ పొదలో ఏం కనిపించింది?**

అవసరం లేదని అనిపించింది రవీంద్ర బావమరిదికి. అనిపించిన వెంటనే బండమీది నుంచి లేచాడు.

'సారూ... అర్జంట్ పనిమీద చింతలపల్లి పోతున్నాను. బాగా కావాల్సిన మనిషికి ఫోనుచేసి ఒక మాట చెప్పాలి. నా దగ్గర ఫోనులేదు. మీరు వేరేగా అనుకోకపోతే, ఒక్క ఫోను చేసుకోవాలి' చేతిని జాస్తూ చాలా మర్యాదగా అడిగాడు.

ఆశ్చర్యం ప్రత్యక్షమయింది అవతలి మనిషి కనుల్లో. రెండు క్షణాలు తటపటాయించి తన ఫోన్ బయటికి తీశాడు.

'నువ్వే చేసుకుంటావా? నన్ను హెల్ప్ చేయమంటావా?' అడిగాడు.

తను ఎవరికి ఫోను చెయ్యబోతున్నాడో, ఎందుకు చెయ్యబోతున్నాడో అతనికి తెలియటం ఇష్టం లేకపోయింది రవీంద్ర బావమరిదికి.

'ఫోను చేయటం నాకు వచ్చు సారూ. నేను చేసుకోగలను' అంటూ ఫోను తీసుకున్నాడు. నాలుగు అడుగులు అవతలికి వేసి, తన దగ్గర ఉన్న నంబర్ని ప్రెస్ చేశాడు.

నడుము మీద చేతులు వేసుకుని, చిరునవ్వుతో చూస్తూ నిలబడి ఉన్న ఆ మనిషి ముఖంలోని ఆశ్చర్యం అధికం అయిపోయింది.

అడవి ఆకుల మీద నంబరు వేసుకువచ్చావా? చాలా విచిత్రంగా ఉంది. నువ్వు ఎవరివో నాకు చెప్పాల్సిందే బ్రదరూ...' అంటూ రవీంద్ర బావమరిది అంతకుముందు కూర్చున్న బండమీద తనూ సెటిల్ అయ్యాడు.

ఒకసారి ప్రెస్ చేశాడు నంబర్ని రవీంద్ర బావమరిది. ఎంగేజ్ వచ్చింది. రెండవసారి ట్రై చేశాడు. మళ్ళీ అదే పరిస్థితి. మూడవసారి కూడా రిజల్ట్ కనిపించకపోవడంతో విసుగ్గా తల విదిలించి ఆ మనిషి కేసి చూశాడు.

'అడవి మధ్యలో ఉన్నాము... ఒక్కోసారి సిగ్నల్స్ ప్రాబ్లమ్స్ వస్తాయి. ట్రై చేయి' అన్నాడు ఆ మనిషి.

పెదవులు బిగించి మరోసారి ప్రెస్ చేశాడు రవీంద్ర బావమరిది. ఉపయోగం లేకపోయింది.

'లాభం లేదు సారూ... పెద్దమనసుతో మీరు ఎంత ఖరీదయిన ఫోన్ని నాకు ఇచ్చినా ఉపయోగం కనిపించటం లేదు. కాళ్ళు కొట్టుకుంటూ చింతలపల్లికి పోయి అక్కడ ప్రయత్నం చేసుకోవాల్సిందే' అంటూ అతని ఫోన్ని అతనికి ఇవ్వటానికి ముందుకు జాచాడు.

'చెప్పాను కదా... అడవి మధ్యలో ఒక్కోసారి సిగ్నల్ ప్రాబ్లమ్స్ వస్తూ ఉంటాయని. ఇంతకీ ఏ నంబరు?' అంటూ ఫోన్ మీది నంబర్ని చూశాడు ఆ మనిషి.

చూసిన వెంటనే కరెంటు షాకు కొట్టినట్టు ఉలికిపడ్డాడు.

'నువ్వు ఇందాకటినుంచీ ఈ నంబర్కే డయల్ చేస్తున్నావా?' అని అడిగాడు ఆశ్చర్యంగా.

అవునని తల ఊపాడు రవీంద్ర బావమరిది.

'సిగ్నల్ ప్రాబ్లము కాదు, బిజీ సిగ్నల్ వచ్చింది. అవునా?' అడిగాడు అతను. దానికి కూడా తల ఊపాడు రవీంద్ర బావమరిది.

'వస్తుంది బ్రదరూ... రాక చస్తుందా? నువ్వు చేస్తోంది ఈ ఫోనుకే' అంటూ వేగంగా కదిలి, అతని దగ్గిర ఉన్న అడవి ఆకును తీసుకుని దాని మీది నంబర్ని చూసి బిగ్గరగా నవ్వాడు.

తెరుచుకుపోయింది రవీంద్ర బావమరిది నోరు. 'సారూ, మీరు ఎవరు? సబ్బిరెడ్డి సారంటే మీరేనా?' అస్పష్టంగా అడిగాడు.

'నేనే! నువ్వు ఎవరివి? నాతో నీకు పనేంటి? ఈ నంబరును నీకు ఎవరు ఇచ్చారు?' ఉన్నట్లుండి మారిపోయింది ఆ మనిషి పద్ధతి. మాటలు మహా కరుకుగా బయటికి వచ్చాయి.

తనెవరో చెప్పాడు ఇతను. ఎటువంటి పరిస్థితిలో ఆ నంబరు తనకు ఇవ్వబడిందో చెప్పాడు. ఎవరి ద్వారా ఇవ్వబడిందో చెప్పడం మొదలుపెట్టేసరికి విపరీతమైన సంతోషంతో వెడల్పు అయ్యాయి ఆ మనిషి కళ్ళు.

'శభాష్... శభాషయిన పని చేశారు మీరు. మూడు నెలల్నించి మేము నానా తంటాలు పడుతున్నాము. అంతా అయిపోయిన తర్వాత వెళ్ళి, చేతులు ఊపుకుంటూ వెనక్కి రావటమే గాని, స్పాట్లో ఉండగా పెద్దతలల్ని మాత్రం పట్టుకోలేక పోతున్నాము. వెరీ గుడ్ బ్రదర్.. వెరీవెరీ గుడ్..' అంటూ ఫోన్లో ఉన్న ఇతర నంబర్స్ని ప్రెస్ చేశాడు గబగబా.

అరగంట... ఖచ్చితంగా ఒక అరగంట తరువాత జట్లు జట్లుగా పొదలచాటు నుంచి రోడ్డుమీదికి వచ్చారు పాతికమంది ఫారెస్టు గార్డులు.

'మన అంచనా నిజం అయింది. పదండి అందరూ' అంటూ వారికి చెప్పి రవీంద్ర బావమరిది వైపు చూశాడు.

'ఈ ఏరియాలో బతకాల్సినవాడివి. నువ్వు మమ్మల్ని ఎలర్ట్ చేసినట్లు బయటికి పొక్కితే లేనిపోని తలనొప్పులు వస్తాయి. దగ్గరిదాకా దారి చూపించి, నువ్వు సైడయిపోవాలి' అన్నాడు.

'అక్కడ మా బండోడు, వెట్టి అన్నయ్య ఇద్దరూ ఉన్నారు' అన్నాడు ఇతను.

'ఫరవాలేదు. వాళ్ళు కూడా పక్కకు తప్పుకునే వరకూ ఎటాక్ చెయ్యము. పద పద' అంటూ తొందరపెట్టాడు ఆ మనిషి.

ఆకలితో కళ్ళు బైర్లు కమ్ముతున్న సంగతి బయటపెట్టలేదు రవీంద్ర బావమరిది. తల ఊపి తనువచ్చిన దారిలో వెనక్కి బయలుదేరాడు.

తమతమ ఆయుధాలను సిద్ధంగా పట్టుకుని, ఒకరి వెనుక ఒకరుగా అతన్ని అనుసరించారు ఫారెస్టు గార్డులు.

●●●

రేగిపళ్ళ మాదిరి పచ్చగా, నిగనిగలాడుతున్న కాయలతో నిండి ఉన్న ఒక పెద్ద పొద దగ్గర

## ఆ రోజులు మిస్ అవుతోందట!

ఈ మాటలు అన్నది బాలీవుడ్ భామ జాక్వెలిన్ ఫెర్నాండెజ్. ఇందులో అపార్థం చేసుకోవలసింది ఏమీ లేదు ఎందుకంటే జాక్వెలిన్ సినిమాల్లోకి రాకముందు మీడియాలో పనిచేసింది. రిపోర్టర్గా తను చేసిన రోజులు మరిచిపోలేనివని అంటోంది. రిపోర్టర్గా పనిచేయడం ఓ మధురానుభూతి అని దాన్ని ఇప్పుడు మిస్ అవుతున్నానని చెప్పుకొచ్చింది. తన కెరీర్ ఇప్పుడిప్పుడే ఊపందుకుంటోందనీ, రాబోయే రోజుల్లో మరిన్ని మంచి సినిమాలు వచ్చే అవకాశం ఉందని ఆశాభావం వ్యక్తం చేసింది.

ఆగాడు బండోడు.

'చూడటానికి మాత్రం మహారుచికరంగా ఉన్నట్టు కనిపిస్తాయి అన్నయ్యా. చిరుచేదుగా ఉంటాయి. కాని ఆకలి తీరుతుంది. ఆరోగ్యం కూడా!' అంటూ నాలుగు కాయలు తెంపి వెట్టికి అందించాడు.

మునిపళ్ళతో ఒక కాయ కొరికి కనులు చిట్లించాడు వెట్టి. 'ఇంతకంటే మంచివి మనకి దొరికే ఛాన్సు లేదంటారా?' అడిగాడు.

'ఇప్పటికి వీటితో సరిపెట్టుకోవడమే బాగుంటుంది అన్నయ్యా. తిండిగోలలో పడి మనం దూరంగా వెళ్ళిపోవటం బాగోదు కదా' తను కూడా ఆరగించటం మొదలుపెడుతూ అన్నాడు బండోడు.

అతని మాటల్లో యదార్థాన్ని వెంటనే గమనించి, మరొక్క కామెంటు కూడా చెయ్యకుండా ఆ పొద దగ్గరే చతికిలపడ్డాడు వెట్టి.

రెండుకాయల వరకూ కొంచెం తేలికగానే తినగలిగాడు. మూడవ కాయను మాత్రం నోటిలో పెట్టుకోవడం చేతకాలేదు అతనికి.

'ఆకలిని భరించటమే తేలిక అనిపిస్తోంది బ్రదరూ! వాటిని తినటం మనవల్ల అయ్యే పనికాదు' చేతిలో ఉన్న వాటిని అవతలకు విసురుతూ అన్నాడు.

గులకరాళ్ళ మాదిరి పోయి పది అడుగుల దూరంలో ఉన్న ఒక పెద్ద పొదమీద పడ్డాయి ఆ రెండు కాయలు. పడిన వెంటనే బుస్సుమని శబ్దం చేస్తూ తల బయటపెట్టింది ఒక మహాసర్పం.

వట్టిగా బయట పెట్టడంతో ఆగలేదు అది. కోరలు కనపడేలా నోటిని తెరచి, వేగంగా మూడు అడుగులు ముందుకు వచ్చేసింది.

తను ఆరగిస్తున్న కాయల్ని కిందికి వదిలేసి, గబుక్కున వెట్టి చేతిని పట్టుకున్నాడు బండోడు. పడిపోయిన అడవి పొదను ఈడ్చినట్టు వేగంగా ఈడ్చుకుంటూ పది అడుగుల దూరం తీసుకుపోయాడు.

మరో రెండు అడుగుల మేర ముందుకు పాకి, నేలకు నాలుగు అడుగుల ఎత్తున పడగను పైకి లేపి, పూత్కారం చేయటం మొదలుపెట్టిందా పాము.

చెమటలు ప్రత్యక్షం అయ్యాయి వెట్టి ముఖం మీద. విపరీతమైన దాహం వేస్తున్నట్టు ఎండుకుపోయింది గొంతు.

'ఇప్పుడు మనం ఏం చేశామని అది అలా రెచ్చిపోతోంది?' తడబడుతున్న కంఠంతో బండోడిని అడిగాడు.

'అదే నాకు కూడా అర్థం కావడం లేదు అన్నయ్యా. ఇట్టాంటి పాముని ఈ మధ్యకాలంలో నేను చూడలేదు. మహా పొగరు మీద ఉంది' చిన్న కంఠంతో చెప్పాడు బండోడు.

'మనం అవతలికి వెళ్ళిపోదాము' అంటూ చుట్టూ చూశాడు వెట్టి.

'ఏంటి చూస్తున్నావు?' అడిగాడు బండోడు.

'ఇందాక నువ్వు చూపించి చెప్పిన పొదలు...' అంటూ మాటను ఆపాడు వెట్టి.

నాలుగు అడుగుల ఎత్తుకు లేచి ఉన్న ఆ పాము తల మరో అడుగు ఎత్తుకు చేరుకుంది. దాని పూత్కారాలు కూడా అధికం అయిపోతున్నాయి.

'పుట్ట ఏదీ కనిపించటం లేదన్నయ్యా. ఇదేదో వేటకు బయలుదేరి ఇటుగా వచ్చి ఉంటుంది. మనం తనకి పోటీ అవుతున్నామని రెచ్చిపోతోంది' కనులు చిట్లించి చూస్తూ అన్నాడు బండోడు.

'ఇంకా కొంచెం అవతలికి పోదాము. దీనిగోల ఆ పఠాన్‌గాడి జనానికి వినబడితే మన పని అవుటయిపోతుంది' అంటూ మరో పది అడుగులు అవతలికి వేశాడు వెట్టి.

దూరదూరంగా వెళ్ళిపోతున్న సంగతి డెఫినెట్‌గా ఆ విషోరగానికి కనిపిస్తూనే ఉంది. కోపాన్ని తగ్గించుకుని అది తనదారిన తను వెళ్ళిపోవాలి అతని అంచనా ప్రకారం. కాని అలా జరగటం లేదు అక్కడ. వాళ్ళకీ తనకీ దూరం అధికం అవుతున్నకొద్దీ ఇంకా ఇంకా రెచ్చిపోవటం మొదలుపెట్టింది అది. పడగను ఆల్‌మోస్ట్ ఐదు అడుగులు ఎత్తుకులేపి పరమ భయంకరంగా చూడటం స్టార్ట్ చేసింది.

'ఎటువంటి పాము అయినా మనం ఇవతలికి వచ్చేస్తే, తనదారిన తను వెళ్ళిపోతుందని అంటారు. ఇదేంటి బ్రదర్? మరో పది అడుగులు అవతలికి వేసిన తర్వాత అడిగాడు వెట్టి.

తలపాగా ఊడదీసి ముఖం తుడుచుకున్నాడు బండోడు. 'నాకు కూడా ఏమీ అర్థం కావటం లేదన్నయ్యా. దాని వరస చూస్తుంటే, మనల్ని వదిలిపెట్టేటట్టు కనిపించడం లేదు' అంటూ ఒక్కక్షణం ఆలోచించి, 'నువ్వు ఇక్కడే ఉండు, నేను పోయి ఇందాక నీకు చూపించిన పొదను విరిచి తీసుకువస్తాను' అంటూ దూరంగా పరుగు తీశాడు.

అతను అవతలికి పోయిన మరుక్షణం చిత్రంగా తన గడబిడను ఆపేసింది ఆ పాము. పైకెత్తిన పడగను దించి, నెమ్మది నెమ్మదిగా ఏ పొదలో నుంచి బయటికి వచ్చిందో, తిరిగి అదే పొదలోకి వెళ్ళిపోయింది.

మతిపోతున్నదని అనిపించింది వెట్టికి. ఆ విచిత్రమైన డెవలప్‌మెంట్‌ని ఎలా అర్థం చేసుకోవాలో అతనికి తెలియలేదు.

ఎందుకైనా మంచిదని ఇంకో పది అడుగుల దూరం పోయి, అక్కడ ఉన్న ఒక బండరాయి మీద కూర్చోబోతుండగా తగిలింది అతనికి ఇంకో షాక్.

బండోడు అవతలికి పోగానే, తను చేస్తున్న గొడవను వెంటనే ఆపి, వెనక్కి వెళ్ళిపోయింది అది. ఇప్పుడు ఉన్నట్లుండి మళ్ళీ తలను బయటపెట్టి అతనివైపే చూస్తోంది.

'నేను నీ జోలికి రావటం లేదు. నీ దారికి అడ్డుపడే ఆలోచన నాకు లేదు. నేను వచ్చింది వేరే పనిమీద. నీకు నాకు ఎటువంటి విరోధం లేదు" వద్దు వద్దని అనుకుంటూనే చిన్నకంఠంతో దానికి చెప్పాడు అతను.

ఆ మాటల్ని చాలా శ్రద్ధగా వింటున్నట్లు తలను అటూ ఇటూ కదిలించింది అది. బుస్సుమని ఇంకో సారి చిన్నశబ్దం చేసి తలను పొదలోకి లాక్కుంది.

పావుగంట తరువాత వచ్చాడు బండోడు. తను విరుచుకు వచ్చిన మండల్లో రెండింటిని వెట్టికి అందించాడు.

'ఏది అన్నయ్యా? వెళ్ళిపోయిందా?' చుట్టూ చూస్తూ అడిగాడు.

అతను అడుగుతూ ఉండగానే ప్రత్యక్షం అయింది అది. అంతకుముందు మాదిరి అమాంతంగా తలను

# భయపడుతున్న రెజీనా!

దక్షిణాదిన రెజీనా మంచి నటి. అందులో ఎవరికీ ఎలాంటి సందేహాలు లేవు. అయినా స్టార్ హీరోయిన్ స్టేటస్ ఆమెకు ఆమడ దూరంలోనే ఉండిపోయింది. తన వెనుక వచ్చినవారందరూ స్టార్ హీరోయిన్లు అయిపోతుంటే చూస్తూ ఉండడం తప్ప రెజీనా ఏమీ చేయలేకపోయింది. అలాంటి సమయంలో బాలీవుడ్ నుంచి పిలుపు వచ్చింది, అదీ అమితాబ్ సినిమాలో. ఇంకేముంది తన దశ తిరిగిందనుకుని ఆనందంగా బాలీవుడ్‌లో అడుగుపెట్టింది. అక్కడ అడుగు పెట్టడంతోనే అక్కడి పద్ధతులు ఒంటపట్టించుకుని అందాల ప్రదర్శన మొదలుపెట్టేసింది. సినిమా కూడా అనుకున్నట్టుగానే బాగానే వస్తోందట! అంతా బాగానే ఉంది కానీ, ఓ విషయంలో మాత్రం రెజీనా తెగ భయపడుతోందట! తాప్సీ బాలీవుడ్‌కి వచ్చిన మూడు నాలుగు సంవత్సరాల తరువాత గుర్తింపు తెచ్చుకోగలిగింది. ఇక తనకు ఎన్ని సంవత్సరాలలో గుర్తింపు వస్తుందో అన్న టెన్షన్ పట్టుకుందట! అన్నీ ఉన్నా అదృష్టం లేకపోతే బాలీవుడ్‌లో నిలదొక్కుకోవడం కష్టం కనుక తనకు ఆ అదృష్టం ఉందో లేదో అని తెగ భయపడుతోందట! మొత్తానికి అవకాశాలు రానప్పుడు ఒక టెన్షన్. వచ్చిన తరువాత మరో టెన్షన్ రెజీనాను కలవరపెడుతున్నాయి.

పైకెత్తి మళ్ళీ గొడవ స్టార్ట్ చేసింది.

తను విరుచుకు వచ్చిన పిచ్చిపొద మండల్ని గాలిలో ఊపుతూ దాని వైపు అడుగులు వేయ బోతున్న బండోడి భుజం మీద చెయ్యివేసి ఆపే శాడు వెట్టి.

'నువ్వు ఒక పనిచెయ్యి... వెళ్ళి ఆ పఠాన్‌గాడిని గమనించుకుంటూ ఉండు. నేను దాని వ్యవహారం ఏమిటో తేల్చుకు వస్తాను' అన్నాడు.

'డేంజర్ అన్నయ్యా... ఇదేదో చాలా తెలివైన సర్పంలా కనిపిస్తోంది. నేను అవతలికిపోతే నీకు ప్రాబ్లం అవుతుంది' అన్నాడు బండోడు.

తల అడ్డం తిప్పాడు వెట్టి. 'అది నిన్ను చూసిన తర్వాతనే గొడవ చేస్తోంది. నువ్వు అవతలికి పోయిన వెంటనే వెనక్కి వెళ్ళిపోతోంది. ఇదేమిటో తేల్చుకోవాలి' అంటూ అతన్ని చందనం చెట్లున్న దిశలోకి తిప్పాడు.

'జాగ్రత్త అన్నయ్యా! ఇట్టాంటిది జరుగుతుం దని తెలిస్తే నాయన్ని అడిగి ఏదో ఒక మందు తెచ్చుకునేవాళ్ళం..' అంటూ తన దగ్గర ఉన్న మండల్ని కూడా అతనికే ఇచ్చి అటుకేసి నడిచాడు బండోడు.




అతను కనిపించకుండా పోవటం, పొద ముందుకు వచ్చి డాన్స్ కొడుతున్న పాము తిరిగి పొదలోకి పోవటం ఒకేసారి జరిగింది.

ముఖం మీద ప్రత్యక్షమయి ఉన్న చెమటను షర్టు భుజానికి అద్దుకుంటున్న సమయంలో సడన్‌గా వెట్టి మనసులోకి ఎంటర్ అయింది ఆ విషయం.

ఏదో రహస్యాన్ని గార్డ్ చేస్తోంది అది. బండో డికి తెలిస్తే మంచిదికాదని ఆవేశపడిపోతున్నది.

కంటికి కనిపించనంత వేగంతో వచ్చి తన మీద పడితే తట్టుకోవటం కష్టమైపోతుందని తెలు స్తూనే ఉన్నా, తెగించి ముందుకు అడుగు వేశాడు. బండోడు తెచ్చిన మండల్ని ముందుకు జాచి పట్టుకుని, మెల్లిమెల్లిగా ఆ పొదకు దగ్గరగా పోయాడు.

ఉన్నట్లుండి తలను బయటికి పెట్టింది అది. కుంకుడు గింజల మాదిరి మిలమిలా మెరిసి పోతున్న కనుగుడ్లతో సూటిగా చూసింది అతనివంక.

పట్టుకున్న మండల్ని మరికొంచెం ముందుకు జాచాడు వెట్టి. 'నీకు అపకారం చేయటం నా అభి మతం కాదు. నీ ప్రవర్తన నాకు విచిత్రంగా కనిపి స్తోంది. పొదలో ఉన్న సీక్రెట్ ఏమిటో నాకు తెలి యాలి. దారి ఇవ్వు' అంటూ ఇంకో అడుగు వేశాడు.

చివ్వున తలను ఇంకాస్త పైకి ఎత్తింది అది. పూత్కారం మాత్రం చేయలేదు. అతని ముఖం మీదినుంచి చూపుల్ని తిప్పలేదు.

'తప్పుకో తల్లీ... నన్ను ముందుకు రానీ..' అంటూ ఇంకో అడుగు వేశాడు వెట్టి.

మరో మూరెడు ఎత్తుకు లేచింది ఆ పాము పడగ. ఆటోమేటిక్‌గా తెరుచుకుంది నోరు. కోరలు కొట్టవచ్చినట్టు కనిపించసాగాయి.

'నువ్వు ఎంత బెదిరించినా నేను భయపడను. బండోడి తండ్రికి విషవైద్యం బాగా తెలుసని నాకు నమ్మకం కుదిరింది. అతను తన కొడుక్కి చెప్పిన ఈ పిచ్చిమండలు నా దగ్గర ఉండగా నువ్వు నన్ను ఏమీ చెయ్యలేవు. తప్పుకో' అంటూ ఇంకో అడుగు వేశాడు అతను.

ఇంకా ఇంకా పైకి లేచింది పడగ. ఆల్‌మోస్ట్ వెట్టి ముఖానికి ఎట్ట ఎదురుగా నిలబడింది. తలను విసరటం జరిగితే, కాటు సరిగ్గా నోటిమీదనో, నుదుటిమీదనో పడుతుంది. చిటికెలో గాలిలో కలిసి పోతాయి ప్రాణవాయువులు.

చెమటలతో నిండిపోయాయి వెట్టి అరిచేతులు. గొంతు పూర్తిగా ఎండుకుపోయి, గుటకపడటం కష్టం అనిపించసాగింది.

'పక్కకు జరుగు... కొంచెం పక్కకు జరుగు.... ప్లీజ్. ఒక్కసారి' ఎండుకుపోయినట్లు తయారైన పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ అస్పష్టంగా అన్నాడు. అంటూనే దాని వెనుకభాగంలోకి చూశాడు.

చూసిన మరుక్షణం పాదాల్లోని శక్తి నశించి పోయినట్లు అయింది. చేతుల్లోని మండల్ని వది లేసి, నేలమీద చతికిలబడాలన్న కోరిక కలిగింది.

పాము చుట్టలు చుట్టుకుని ఉన్న ప్రదేశానికి జానెడు దూరంలో అడ్డదిడ్డంగా పడి ఉంది ఒక నునుపైన కొండరాయి.

శివలింగం పైభాగంలోని రాయి మాదిరి కోలగా కన్పించింది.

●●●

ముందుకు జాచి పట్టుకున్న పిచ్చిమొక్క మండల్ని తనకు తెలియకుండానే కిందికి వదిలేశాడు అతను. ఖాళీచేతుల్ని జోడించి ముందుగా ఆ శిలకు నమ స్కారం చేశాడు. తర్వాత నిశ్చలంగా నిలబడి ఉన్న ఆ పాముకి తలవంచి నమస్కరించాడు.

'ఆ తల్లి ఆత్మశిల. అనాథ మాదిరి పడివుంటే, అతి జాగ్రత్తగా కాపలా కాస్తున్నావు నువ్వు. బండో డిని పరాయి మనిషిగా భావించి పూత్కారాలతో బెదరగొట్టి తరిమేశావు. సంతోషం తల్లీ! ఏదో ఒక విధంగా ఈ శిలను ఆలయం దగ్గరకి చేర్చే ప్రయత్నం చేస్తాను. నువ్వు ఆవేశాన్ని తగ్గించుకో!' నిశ్చలంగా చూస్తున్న ఆ పాముతో చెప్పాడు.

అడ్డదిడ్డంగా పడి ఉన్న ఆ శిల అతని కంట పడిన వెంటనే తన కర్తవ్యం ముగిసిపోయిందని అనుకున్నదో, అతనివల్ల ఆ శిలకు గాని, తనకు గాని ఎటువంటి ప్రమాదం లేదని భావించిందో తెలియదుగానీ, పడగ కిందికి దించేసింది ఆ పాము. మెలికలు తిరుగుతూ పొద వెనుకభాగం లోకి పోయి చటుక్కున అదృశ్యం అయింది.

ఎగిరి ముందుకు దూకి, అడ్డదిడ్డంగా పడి ఉన్న శిలను చేతుల్లోకి తీసుకోవాలని ఎంతగానో అని పించింది వెట్టికి.

పవిత్రమైన వస్తువులను ఎప్పుడు ఎటువంటి సమయాల్లో పట్టుకోవాలో ఏ విధంగా హ్యాండిల్ చేయాలో తెలియక పోవటం వల్ల ఆగిపోయాడు.

'పఠాన్‌గాడి వ్యవహారం ముందుగా పూర్తి అయి పోవాలి. ఆ తరువాతే ఈ శిల గురించి ఆలోచించాలి' తనలో తను అనుకుంటూ వెనక్కి వచ్చేశాడు.

●●●

'నరకండిరా... గట్టిగా రెండు దెబ్బలు వేయండి. ఒక్క చెట్టును పడగొట్టటానికి రెండు పూటలు పట్టేటట్లయితే ఎలా?' కచ్చనిండిన కంఠంతో తన జనాన్ని హెచ్చరించాడు పఠాన్.

వంటలు పూర్తిచేసుకుని, ఆదరాబాదరాగా ఆర గించి, మళ్ళీ కిందపెట్టిన గొడ్డళ్ళు అందుకున్నారు వాళ్ళు.

అంతకుముందు ఎంచి పెట్టుకున్న చెట్టు చుట్టూ చేరి, ఒకరి తర్వాత ఒకరుగా గొడ్డళ్ళు ప్రయోగిం చటం మొదలుపెట్టారు.

ఉసూరుమన్నది పొదలచాటునుంచి ఆ దృశ్యం చూస్తున్న బండోడి హృదయం. ఆ చుట్టుపట్ల ఉన్న వృక్షాలన్నిటిలోకి మోస్ట్ సీనియర్ చెట్టు మాదిరి కనిపిస్తోంది అది.

తనకేమీ పట్టనట్టు నాలుగు నిమిషాల పాటు కళ్ళు మూసుకుంటే పూర్తి అయిపోతుంది పని. ధ్వజస్తంభం మాదిరి నిట్టనిలువుగా ఉన్న ఆ మహా వృక్షం వికృత శబ్దాలు చేస్తూ నేలకూలిపోతుంది.

చెట్టు కొంచెంగా పక్కకు ఒరిగిన వెంటనే పూర్తిగా డిస్టర్బ్ అయిపోతుంది పై భాగంలో ఉన్న తేనెపట్టు. విపరీతమైన కోపంతో కిందికి వచ్చే స్తాయి పట్టులోని ఈగలు.

పొలోమంటూ దూరంగా పరుగులు తీస్తారు అక్కడి జనం. దారుణంగా దెబ్బతిని పోతుంది తమ పథకం.

'ఇరకాటంలో పెట్టేశావు కదా అన్నయ్యా... సర యిన సమయంలో నువ్వు దగ్గర లేకుండా తప్పించు కున్నావు. ఏం చేయాలో నాకు అర్థం కావటం లేదు. తనలో తను అనుకుంటూ, తన వెనుక అలి కిడి అవటంతో అదిరిపడి వెనక్కి చూశాడు బండోడు.

పిల్లిమాదిరి వచ్చేశాడు వెట్టి. అతని వెనకే నిలబడి కనులు చిట్లిస్తూ ముందుకు చూశాడు.

'అన్నయ్యా.. నీ ముఖం నక్షత్రంలా వెలిగి పోతోంది. ఏంటి సంగతి?' అతని ముఖంలోకే సూటిగా చూస్తూ అడిగాడు బండోడు.

**(ఇంకా వుంది)**

# కీళ్ళ నొప్పులతో జాగ్రత్త...! ముందుగా గుర్తిస్తే ముప్పు తక్కువ

మన శరీరంలో కీళ్ళకు ప్రత్యేకత ఉంటుంది. మన కీళ్ళు మనకు తెలియకుండానే అవసరానికి తగినట్లు వంగిపోతూ మన దైనందిన జీవితంలో కీలకపాత్ర పోషిస్తుంటాయి. ఏదైనా కారణాలతో కీళ్ళు నొప్పితోనో, వాపుతోనో ఉంటేగాని కీళ్ళకు వచ్చిన సమస్య మనకు తెలియదు. అప్పటివరకు మన కీళ్ళ ప్రాధాన్యత మనకు అర్థం కాదు. అందుకే కీళ్ళు చిన్నవైనా... పెద్దవైనా వాటి ప్రత్యేకత వాటిదే. మన శరీరంలో ఎముకలు కలవడంతో ఏర్పడిన కీళ్ళు శరీర భాగాల్లో కావాల్సిన కదలికలకు తోడ్పడతాయి. ఎముకల మధ్య కార్టిలేజ్ అనే మృదువైన కుషన్‌లాంటి పదార్థం ఉంటుంది. అది అరిగిపోయినా, పూర్తిగా దెబ్బతిన్నా ఎముకలు ఒకదానికి ఒకటి తగిలి నొప్పి ఏర్పడుతుంది. ఆ ప్రాంతంలో వాపు కూడా వచ్చి కీళ్ళనొప్పులు ఏర్పడతాయి. ఇలా కీళ్ళనొప్పులు రావడాన్నే అర్థరైటిస్ అంటారు. ఈ సమస్యకు సకాలంలో సరైన చికిత్స తీసుకుంటే మెరుగైన ఫలితాలు పొందవచ్చు.



## అర్థ రైటిస్‌లో రకాలు :

అర్థరైటిస్‌లో సుమారు 150 రకాలు ఉంటాయి. అందులో ఆస్టియో అర్థరైటిస్, రుమటాయిడ్ అర్థరైటిస్, గైటీ అర్థరైటిస్ ప్రధానమైనవి. వివిధ రకాల అర్థరైటిస్‌కు వేర్వేరు లక్షణాలు ఉంటాయి. వ్యాధిని బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది.

## ఆస్టియో అర్థ రైటిస్ :

ఇది సర్వసాధారణంగా కనిపించే సమస్య. కీళ్ళలో కార్టిలేజ్ అరుగుదల కారణంగా ఈ సమస్య తలెత్తుతుంది. వయసుపైబడిన కొద్దీ క్రమంగా కీళ్ళలోని కార్టిలేజ్ అరిగిపోయి ఆస్టియో అర్థరైటిస్ వస్తుంటుంది. వృత్తిపరంగా కీళ్ళను ఎక్కువగా ఉపయోగించేవారిలో కార్టిలేజ్ అరుగుదల ఎక్కువగా ఉంటుంది. దాంతోపాటు కీళ్ళపై బలమైన దెబ్బలు తగిలి కార్టిలేజ్ దెబ్బతింటే ఈ సమస్య వచ్చే అవకాశం ఉంటుంది. ఒకసారి అరుగుదల ప్రారంభమైతే అది కొనసాగుతూనే ఉంటుంది. కాబట్టి కీళ్ళనొప్పులు మొదలైతే వెంటనే వైద్యులను సంప్రదించి వ్యాధిని నిర్ధారించుకుని సరైన చికిత్స తీసుకోవాలి.

## లక్షణాలు :

- కీళ్ళలో వాపు రావడం
- కీళ్ళు బిగుసుకుపోవడం
- కండరాలు బలహీన పడడం
- కీళ్ళను కదిలించాలంటే తీవ్రమైన నొప్పి వస్తుండడం
- కీళ్ళ చుట్టూ ఎర్రగా కమిలిపోయినట్లు కనిపించడం



## నిర్ధారణ పరీక్షలు :

ఎక్స్‌రే, రక్త పరీక్షలతో ఆస్టియో అర్థరైటిస్‌ను గుర్తిస్తారు.

## చికిత్స...?

ఆస్టియో అర్థరైటిస్‌కు వ్యాధి దశను బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది. ఈ సమస్యకు మెరుగైన చికిత్సా విధానాలు, ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా వ్యాధి యొక్క తీవ్రతను తగ్గించే మందులు అందుబాటులోకి వచ్చాయి. వ్యాధి ప్రాథమిక దశలో ఉంటే మందులతోపాటు వైద్యులు సూచించిన వ్యాయామాలు చేయవలసి ఉంటుంది. కీళ్ళనొప్పులు ఎక్కువై కూర్చోలేకపోవడం, నడవలేకపోవడం వంటి సమస్యలతో దినచర్యలో ఇబ్బందిపడే పరిస్థితి తలెత్తితే శస్త్ర చికిత్స అవసరమవుతుంది. శస్త్ర చికిత్సలో కార్టిలేజ్ దెబ్బతిన్న భాగాన్ని సరిచేసి నొప్పుల నుంచి ఉపశమనం కలిగించడంతోపాటు ఎలాంటి ఇబ్బంది లేకుండా సాధారణ జీవితం గడిపేలా చేస్తారు.




## వెన్నలాంటి ఆరోగ్యం



వెన్న తింటే కొవ్వు పెరుగుతుందనీ, బరువు పెరుగుతారన్న అభిప్రాయం చాలామందిలో ఉంది. కానీ ఇది తప్పంటున్నారు నిపుణులు. దీనిలోని ఎ విటమిన్ గుండెను ఆరోగ్యంగా ఉంచడానికి సహాయపడుతుందని వారు చెబుతున్నారు. దీనిలోని యాంటీఆక్సిడెంట్లు గుండెను దృఢంగా ఉంచుతాయి. అంతేకాకుండా వెన్నను ఆహారం ద్వారా తీసుకోవడం వలన త్వరగా కడుపు నిండినట్లు ఉండడంతో పాటు ఎక్కువసేపు ఆకలి వేయకుండా ఉంటుంది. దీని వలన అధికబరువు సమస్య తలెత్తదు. మంచి కొలెస్ట్రాల్ ఉన్న ఈ వెన్నను చిన్న పిల్లలకు ఇవ్వడం వలన వారి మెదడూ, నాడీ వ్యవస్థ ఎదుగుదలా చక్కగా ఉంటుందని వారు వివరిస్తున్నారు. చిన్నతనం నుంచి పిల్లలకు తగు మోతాదులో వెన్నను తినడం అలవాటు చేయడం మంచిదని వారు సూచిస్తున్నారు.

## లేటు వయస్సులో విడాకులతో ఆరోగ్యం

లేటు వయస్సులో విడాకులు తీసుకోవడం మనదేశంలో చాలా తక్కువ. అదే విదేశాల్లో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి. మలి వయస్సులో విడాకులు తీసుకున్న స్త్రీల ఆరోగ్యం భేషుగ్గా ఉన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. ఆ వయస్సులో విడాకులు తీసుకున్న స్త్రీలు మానసికంగా కుంగిపోతారు కానీ, ఆరోగ్యంగా ఎలా ఉంటారన్న అనుమానానికి కూడా సమాధానం ఇస్తున్నారు. విడాకుల అనంతరం కొంత మానసిక సంఘర్షణకు గురైనా, తమ ఆరోగ్యంమీద స్త్రీలకు మరింత శ్రద్ధ పెరుగుతుందన్న విషయం వీరి అధ్యయనంలో తేలింది. ఈ కారణంగానే మిగతా స్త్రీలతో పోల్చుకుంటే వీరి ఆరోగ్యం భేషుగ్గా ఉండి ఉండొచ్చని అధ్యయనవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఒంటరిగా ఉండడం, ఎంత ఆహారం తీసుకుంటున్నామన్న విషయం మీద ఓ కన్నేసి ఉంచడం తదితర కారణాల వలన వీరిలో అధికబరువు సమస్య కనిపించకపోగా, మునుపటి కన్నా చురుకుగా పనులు చేయడాన్ని వారు గమనించారు. ఇదంతా విడాకుల వలనే సాధ్యపడిందా? దీనికి మరేదైనా కారణం ఉందా? అనే విషయం మీద వీరు ఇంకా విస్తృతంగా అధ్యయనం నిర్వహించనున్నారు.



## ఒక్క గ్లాసైనా ప్రమాదమే!



ప్రతి రోజూ ఒక్కగ్లాసు వైన్ తీసుకుంటే ఆరోగ్యంగా ఉంటారన్నది కేవలం భ్రమ మాత్రమే అంటున్నారు నిపుణులు. ఒక్క గ్లాసు వైన్ తీసుకున్నా గుండె లయలో మార్పు వచ్చే అవకాశం ఎనిమిది శాతం ఉంటుందని వారు హెచ్చరిస్తున్నారు. ఎప్పుడన్నా ఒకసారి వైన్ తీసుకున్నా ఈ ముప్పు తప్పదని వారు అంటున్నారు. ఇలా తరచూ వైన్ తీసుకునే వారిలో ప్రతి వంద మందిలో ఏడుగురు గుండెలయకు సంబంధించిన సమస్యతో బాధపడుతున్నారన్న విషయం ఓ అధ్యయనంలో వెల్లడైంది. ఈ సమస్య ముఖ్యంగా 65 సంవత్సరాలు పైబడిన తరువాతే బయటపడుతుందని వారు చెబుతున్నారు. వైన్‌కి ఎంత దూరంగా ఉంటే గుండె అంత ఆరోగ్యంగా ఉంటుందని వారు స్పష్టం చేస్తున్నారు.

## చదువుకుంటే గుండెపోటు రాదట!

చదువుకీ, గుండెపోటుకీ సంబంధం ఏమిటి? అన్న అనుమానం రావచ్చు. కానీ ఇది నిజం అంటున్నారు ఆస్ట్రేలియా పరిశోధకులు. సుమారు రెండు లక్షల మంది మీద వీరు దీర్ఘకాలం అధ్యయనం చేశారు. వీరందరూ 40 నుంచి 60 సంవత్సరాల లోపు వయస్సు వారు! వీరిలో కొందరు డిగ్రీ, అంతకు మించి ఉన్నత చదువులు చదివినవారు ఉన్నారు. మరికొందరు పన్నెండవ తరగతితో ఆపేశారు. చదువు మధ్యలోనే ఆపేసిన వారిలో గుండెజబ్బు 40 శాతం ఎక్కువగా కనిపించగా, చదువుకున్న వారిలో ఐదు నుంచి పదిశాతం మాత్రమే కనిపించింది. దీనికి కారణం చదువుకున్నవారు ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించడమేననీ అధ్యయనకారులు అంటున్నారు. బాగా చదువుకుని మంచి ఉద్యోగం, స్థిరమైన ఆదాయం కలవారిలో ఒత్తిడీ, ఆందోళనా తగ్గి, గుండెజబ్బు వచ్చే ముప్పు కూడా గణనీయంగా తగ్గిందని వీరు అభిప్రాయపడుతు



## పొట్లకాయతో ప్రయోజనాలు!

పొట్లకాయ పేరు చెప్పగానే చాలా మంది వికారంగా మొహం పెడతారు గానీ, అందులో బోలెడన్ని ఆరోగ్య ప్రయోజనాలు ఉన్నాయంటున్నారు నిపుణులు. దీనిలో నీటితో పాటు, పీచు ఎక్కువ, కేలరీలు తక్కువగా ఉంటాయి. బరువు తగ్గాలనుకునేవారు ఆహారంలో తరచు పొట్లకాయ తీసుకుంటే సన్నగా తయారవుతారని చెబుతున్నారు. వీటిని వేసవిలో తీసుకోవడం వలన శరీరం చల్లగా ఉంటుంది. దీనిలోని పోషకాలు గుండెకు మంచి టానిక్‌గా పనిచేస్తాయట! ఇంకా కొన్ని రోగాలను దూరంగా తరిమేసే శక్తి దీనికి ఉందంటున్నారు నిపుణులు.



-అవినాష్

## హెర్పిస్, గనేరియాలకు సరైన వైద్యం

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఇటువంటి వ్యాధిని హెర్పిస్ అని అంటారు. లైంగిక కలయిక ద్వారా వచ్చే ఈ వ్యాధి పదే పదే వస్తూ బాధిస్తుంది. రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపిస్తుంది. కొన్నిసార్లు ఒకటి రెండు సంవత్సరాల తరువాత బయటపడవచ్చు. ఈ వ్యాధి ఉన్నా ప్రాణహాని మాత్రం ఉండదు. స్త్రీలలో యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**గనేరియా :** యుక్తవయస్సు వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. జననాంగాలు, నోరు, ఆనస్ వరకు వ్యాప్తి చెందుతుంది. భాగస్వామిలో ఒకరికి ఈ వ్యాధి ఉన్నా మరొకరికి సంక్రమిస్తుంది. గర్భిణిగా ఉన్నప్పుడు గనేరియా ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. మూత్రంలో మంట, ద్రవం కారడం, దుర్వాసన వంటి లక్షణాలు కనిపిస్తాయి. స్త్రీలలో నెలసరి మధ్యలో రక్తస్రావం, మూత్రనాళంలో మంట, గర్భకోశ వ్యాప్తి ద్వారా సంతానలేమి, అండాశయ వాపు, గర్భకోశ వాపు, ట్యూబులు మూసుకోవడం జరుగుతుంది.

### హోమియో చికిత్స

హోమియో చికిత్స మానసిక, శారీరక లక్షణాలపై ఆధారపడి పనిచేస్తుంది. రోగనిరోధక వ్యవస్థను శక్తి వంతం చేసి మూల కారణాన్ని గుర్తించి సమూలంగా నిర్మూలిస్తుంది. అనుభవజ్ఞులైన వైద్యుని పర్యవేక్షణలో మందులు వాడితే లైంగిక సమస్యలు సులభంగా పోతాయి.

## కాలేయ జబ్బుకు కచ్చితమైన చికిత్స

**ఒకరోజు** సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**చికిత్స తరువాత :** హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## హెచ్ఐవిని వాళ్లు జయించారు

**ఎన్నో** ఆశలతో పెళ్లి చేసుకుని దాంపత్య జీవితంలోకి అడుగుపెట్టిన వారికి ఆరు నెలల తిరగకముందే ఊహించని విషయం బయటపడింది. ఆత్మహత్య చేసుకుందామనుకున్న ఆ దంపతులకు హోమియోతో కొత్త జీవితం మొదలయింది. ఆ కేస్‌స్టడీ వివరాలు.

హిందూపురంకు చెందిన ఆదికి శిరీషతో వివాహం అయింది. ఎంతో ముచ్చటైన జంట. ఇద్దరి మధ్య ఎటువంటి అమరికలు లేవు. పెళ్లయిన ఆరు నెలల తరువాత శిరీష గర్భవతి అయింది. హాస్పిటల్‌కు వెళితే పరీక్షలన్నీ చేశారు. అప్పుడే ఒక నిజం బయటపడింది. శిరీషకు హెచ్ఐవి పాజిటివ్ అని. ఒక్కసారిగా ఆ దంపతుల కలలన్నీ కల్లలయి పోయినట్టుగా అనిపించాయి. అబార్షన్ చేయించుకోవాలా? చేయించుకుంటే అందరికీ ఏం సమాధానం చెప్పాలి? తాము మాత్రం బతికి సాధించేదేంటి? ఇలాంటి ఆలోచనలెన్నో వాళ్ల మదిలో తొలిచేసేవి. చివరకు ఆత్మహత్య చేసుకోవడం ఒక్కటే మార్గమని నిర్ణయానికి వచ్చారు. ఆ పరిస్థితిలో వాళ్ల తల్లిదండ్రులు వారిని మా క్లినిక్‌కు తీసుకువచ్చారు.

హెచ్ఐవి పేరు వింటనే తెలియని భయం కలగడం సహజమే. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులున్నాయి. హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేస్తుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో ద్వారా అందరిలా సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. ఇదే విషయాన్ని వారికి వివరించి చికిత్సను అందించా. ఇప్పుడా దంపతులకు ఒక పాప. వాళ్లు ఏ సమస్య లేకుండా హాయిగా ఉన్నారు.

## ఆరు నెలల్లో వెరికోస్ వీన్స్ మాయం

**మిర్యాలగూడ** నుంచి 55 ఏళ్ల వ్యక్తి ఒకరు ఒకరోజు మా క్లినిక్‌కు వచ్చాడు. సమస్య ఏంటని అడిగితే కాళ్లు చూపించాడు. కాళ్లు పిక్కల భాగంలో నరాలు ఉబ్బిపోయి నీలం రంగులో కనిపిస్తున్నాయి. ఏం పనిచేస్తారని అడిగితే వ్యవసాయం అని చెప్పాడు. ఎప్పటి నుంచి ఇలా ఉంది అని అడిగితే చాలా ఏళ్లుగా ఉందని, ఈ మధ్యకాలంలో ఎక్కువయిందని చెప్పుకొచ్చాడు. దానివల్ల ఎటువంటి ఇబ్బంది లేకపోవడంతో పట్టించుకోలేదు అని అన్నాడు. ఇప్పుడు కాళ్లు బాగా లాగుతున్నాయిని, దురద ఉంటోందని అన్నాడు. భయపడాల్సిన పనిలేదని, ఈ సమస్యను వెరికోస్ వీన్స్ అంటారని చెప్పాను. కొంతకాలం మందులు వాడితే తగ్గిపోతుందని చెప్పాను. కాలి పిక్కల భాగంలో ఉండే నరాల (సిరలు) మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. సాధారణంగా రక్తం ఉపరితల సిరల నుంచి డీప్ వెయిన్స్‌కు, అక్కడ నుంచి గుండెకు సరఫరా అవుతుంది. అయితే ఈ ప్రక్రియ విఫలమైనప్పుడు రక్తం ఉపరితల సిరల్లోనే నిలిచిపోతుంది. ఫలితంగా సిరలు ఉబ్బిపోతాయి.

### హోమియో చికిత్స తరువాత

ముందుగా ఒక నెలరోజులకు మందులు ఇచ్చి వాడమని చెప్పాను. సరిగ్గా చెప్పినట్టుగా ఆరునెలల పాటు మందులు వాడాడు. దాదాపు 90 శాతం వరకు సమస్య తగ్గిపోయింది. కాళ్లు లాగడం, దురద వంటివి తగ్గిపోయాయి. చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని వైద్యుల దగ్గరకు వెళ్లకుండా ఉండిపోతారు. కానీ హోమియో వైద్యంతో వెరికోస్ వీన్స్ సమూలంగా తొలగిపోతుంది. హోమియోలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు.




**కొన్నాళ్ళకు కుమారుడు విష్వక్సేనునికి పట్టాభిషేకం చేసి, ఇద్దరుమంత్రులు, భార్యసహా అరణ్యవాసానికి బయల్దేరాడు బ్రహ్మదత్తుడు. ఆ సమయంలో అతని భార్య అన్నదిలా. ప్రభూ! నీకు సమస్త ప్రాణుల భాషలూ తెలుసునన్న సంగతి నాకు తెలుసు. కాని నువ్వు పూర్వజన్మ విజ్ఞానం విస్మరించి, భోగలాలసుడివి అయ్యావు. నిన్ను మార్చాలి, నిన్ను మార్చేందుకే నేనలా ప్రవర్తించాను. ఫలితంగా మనందరికీ శుభమే జరిగింది. సిద్ధపదవిలోనికి ప్రవేశిస్తున్నాం.**

అవునవునన్నట్టుగా తలూపాడు విష్వక్సేనుడు. కాస్సేపటికి కండరీకుడు ఓ దగ్గర నిలబడి, వేద రాశికి క్రమం ఏర్పరిచి, క్రమేపి సిద్ధమార్గంలో కృతార్థుడయ్యాడు. బాభ్రవ్యుడు వేదాలు అన్నిటికీ శిక్ష రచించి, ఉత్తమపదవి పొందాడు.

# తారాశశాంకం:రజిరాజు చరిత్ర

**వృష్ణి వంశ వృత్తాంతాన్ని జనమేజయునికి వివరించిన వైశంపాయనుడు ఆ వంశానికి మూలమైన చంద్రవంశ క్రమాన్ని కూడా వివరించసాగాడు. అత్రిమహాముని వల్ల జన్మించిన చంద్రుణ్ణి మెచ్చిన బ్రహ్మ అతన్ని అధిపతిని చేశాడు. బ్రహ్మ ఇచ్చిన దివ్య రథంపై తిరుగుతూ 21 సార్లు భూమండలాన్ని జయించాడు చంద్రుడు. మదోన్మత్తుడైన చంద్రుడు ఇంకా ఏం చేశాడు? చంద్రసుతుని జనన రహస్యం ఏమిటి?**

సనత్కుమారుడు చెప్పగా ఇదంతా భవిష్యత్ గాథగా మార్కండేయుడు గ్రహించాడు. దానంతటినీ తర్వాత ఆయన స్వయంగా చూశాడు. అలా చూసినదంతా నాకు చెప్పాడాయన. చెప్పి అన్నాడిలా.

భీష్మా! ఈ కథ విన్న నువ్వు ఎంతో ధన్యుడివి! దీనిని మననం చేయడం వల్ల నీకు శుభం చేకూరుతుంది. ఈ కథను హృదయంలో పదిలపరుచుకున్న వారెవరైనాసరే! చిరకాలం సుఖాలతో జీవిస్తారు.

ధన్యుణ్ణి అన్నాను నేను. మార్కండేయమహాముని తపోవనానికి వెళ్ళిపోయాడప్పుడు అని ముగించాడు భీష్ముడు. కృతజ్ఞతగా చేతులు జోడించి అతనికి నమస్కరించాడు ధర్మరాజు.

**(పూర్వభాగం:ద్వితీయఖండం సమాప్తం)**

తాను చెబుతున్నది శ్రద్ధగా వింటున్న జనమేజయునితో వైశంపాయనుడు అన్నాడిలా.

వృష్ణివంశాన్ని వివరిస్తూ నీకు ఈ కథలన్నీ చెప్పాను. ఇప్పుడు ఆ వృష్ణివంశానికి మూలమైన చంద్రవంశక్రమం వివరిస్తాను, జాగ్రత్తగా విను.

పరమేష్ఠి మానసపుత్రుడు అత్రిమహాముని లోకక్షేమంకోసం ధర్మనిష్ఠుడై చిరకాలం ఘోరతపస్సు ఆచరించాడు. మూడువేల దివ్యసంవత్సరాలు చేశాడలా. తపస్సు చేసినంతకాలం కనీసం కనురెప్పలు కూడా కదల్చలేదతను. రేతస్సును ఊర్ధ్వముఖంగా ప్రసరింపజేసి, అచంచలుడై నిలిచాడు. అప్పుడు అతని కళ్ళలోంచి కన్నీరు వెలువడింది. అది జాజ్వల్యమానకాంతితో ప్రకాశించింది. అదే జాబిల్లి అనే చిన్నారి గర్భపిండమైంది.

దానిని పదిదిక్కులు కొంతకాలం భరించాయి. తర్వాత ఇక భరించలేక దానిని నేలపై జారవిడిచాయి.

బ్రహ్మదేవుడు అది గమనించాడు. వెంటనే ఆ పిండాన్ని వేయి తెల్లగుర్రాలు పూన్చిన రథంపై ప్రతిష్ఠించాడు. దేవతలంతా ఆ తేజోరాశిని చూసి 'సోముడు' అన్నారు. భృగువు, అంగిరసుడు ఆదిగా బ్రహ్మదేవుని పుత్రులు సోముణ్ణి ఋగ్యజుస్సామ సూక్తాలతో ప్రస్తుతించారు. అతని చల్లని వెలుగు వల్లనే లోకాలన్నీ ఆనందవారాశిలో ఓలలాడసాగాయి. సోముడు నేలపై పడినప్పుడు నలువైపులా చెల్లాచెదురైన కాంతిశకలాలే ఓషధులై వర్ధిల్లాయి.

అలా జన్మించిన చంద్రుడు తొంభైవేల పద్మాల సంవత్సరాలు దారుణమైన తపస్సు ఆచరించాడు. ఆ తపస్సు చూసి దేవతలు విస్తుపోయారు. బ్రహ్మ ముచ్చటపడి, అతనిని ఉదకాలకు, ఓషధులకు, విప్రులకు అధిపతిని చేసి, పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

రాజైన చంద్రుడు, బ్రహ్మదేవుడు ఇచ్చిన రథంపై తిరుగుతూ ఇరవై ఒక్కసార్లు ఈ భూమండలాన్ని జయించాడు. సమస్త సంపదలను సాధించాడు. ఆ మహైశ్వర్యాన్ని గమనించి, దక్షప్రజాపతి తన కుమార్తెలు ఇరవై ఏడుగురును అతనికిచ్చి వివాహం చేశాడు. చంద్రుడు అప్పుడు రాజసూయయాగం చేశాడు. ఆ యాగానికి అత్రి హోతయ్యాడు. భృగువు ఆధ్వర్యుడయ్యాడు. నారదుడు ఉద్గాత అయ్యాడు. బ్రహ్మ బ్రహ్మ అయ్యాడు. నారాయణదేవుడు, సనత్కుమారుడు మొదలైన వారంతా సదస్యులయ్యారు. ఆ సమయంలో ద్యుతి, తుష్టి, పుష్టి, ధృతి, ప్రభ, వసువు, కీర్తి పేరుగల మహిళలు అతన్ని చేపట్టి, సార్థకనామధేయులయ్యారు.

మహైశ్వర్యంతో మదోన్మత్తుడైన చంద్రుడు, దేవగురువు బృహస్పతిని అవమానించి, అతని భార్య తారను అపహరించాడు. మునీశ్వరులు తప్పు తప్పు అని హెచ్చరించినా వినిపించుకోలేదు. బృహస్పతి తండ్రి అంగిరసుని శిష్యుడు శుక్రాచార్యుడు. ఆ కారణంగా అతను కూడా బృహస్పతి పక్షమే వహించాడు. శుక్రుని కారణంగా శివుడు కూడా అజగవం అన్న చాపాన్ని చేపట్టి, బృహస్పతి పక్షం వహించి, అన్ని రకాలుగా అతన్ని ఆదుకున్నాడు. దేవతలు అంతా చంద్రుని పక్షం వహించడంతో శివుడు ఆగ్రహించి, బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని వారిపై ప్రయోగించాడు. దాంతో దేవతల చిరకాలకీర్తి నశించింది. అందువల్ల వారంతా తేజోవిహీనులై దుర్బలులయ్యారు.

దానిని అవకాశంగా తీసుకుని, దేవతల మీద దండెత్తారు దానవులు. ఘోరసంగ్రామం జరిగిందప్పుడు. ఆ సమరాన్ని 'తారకామయం' అని పేర్కొన్నారు. దైత్యుల చేతిలో అదితికుమారులు అనేకులు మరణించారు. మిగిలినవారు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పరుగుదీశారు. బ్రహ్మను ఆశ్రయించి, శరణువేడారు. అభయాన్నిచ్చాడు బ్రహ్మదేవుడు. శివునికి కోపోపశాంతి కలిగించాడు. ఇరువైపులా నచ్చజెప్పాడు. చంద్రుని ఒప్పించి, తారను బృహస్పతికి ఇప్పించాడు. అప్పటికే తార గర్భవతి. అది గమనించాడు బృహస్పతి. అన్నాడిలా.

ఈ గర్భానికి నేను కారణం కాదు.

గత్యంతరం లేక ముళ్ళగడ్డిగుబురుల్లో తన గర్భంలో ఉన్న కుమారుణ్ణి విడిచిపెట్టింది తార. అలా పుట్టిన ఆ పిల్లాడు అగ్నిదేవునివలె జాజ్వల్యమానస్వరూపుడై ప్రజ్వలించాడు. వేలుపులను మించిన మహాసౌందర్యంతో వెలిగిపోయాడు. దేవతలు అతని అతిలోక తేజోరాశికి ఆశ్చర్యపోయారు. విషయం తెలుసుకునేందుకు తారను సమీపించారు. అడిగారిలా.

ఈ పాపడు చంద్ర బృహస్పతుల్లో ఎవరికి చెందుతాడు?

చెప్పడానికి సిగ్గుపడి తలవంచుకున్నది తార. ఆమె మౌనాన్ని భరించలేకపోయాడు కొడుకు.

నిజం చెప్పకపోతే నిన్ను ఇప్పుడే నా దారుణ శాపాగ్నికి గురి చేస్తాను అన్నాడు. అతన్ని శాంతింపజేశాడు బ్రహ్మ. తారను బ్రతిమలాడుకున్నాడిలా.

అమ్మా! తప్పదిక! నువ్వు ఈ పిల్లాడి తండ్రి ఎవరో చెప్పి తీరాలి.

దాచి ప్రయోజనం లేదనుకున్నది తార. ఆఖరికి చెప్పిందిలా.

ఈ పిల్లాడి తండ్రి చంద్రుడే!

ఎప్పుడైతే ఆ పిల్లాడు తన కొడుకు అని తెలుసుకున్నాడో అప్పుడు చంద్రుడు, ఆ పిల్లాణ్ణి దగ్గరగా తీసుకుని, అతని శిరస్సును మూర్కొన్నాడు. అమ

రుల ఆశీర్వాదంతో అతనికి 'బుధుడు' అని నామకరణం చేశాడు. గురుపత్నిని అపహరించిన పాతిత్యం కారణంగా కొన్నాళ్ళకు చంద్రునికి క్షయ రోగం సంప్రాప్తించింది. దానిని భరించలేకపోయాడు చంద్రుడు. తండ్రిని శరణువేడి, అతని అనుగ్రహంతో ఆ రోగాన్ని పోగొట్టుకున్నాడు.

కొంతకాలానికి బుధునికి మహాసౌందర్యమూర్తి పురూరవుడు జన్మించాడు. దేవతల్లో కూడా కనిపించని అతని సుగుణసంపత్తికి ఎంతో ముచ్చటపడి, తనని పరిణయమాడాల్సిందిగా ఊర్వశి వేడుకుంది. ఆ వేడుకోలును కాదనలేదు పురూరవుడు. పెళ్ళి చేసుకున్నాడామెను. గంగానది ఉత్తర ఒడ్డున గల ప్రతిష్ఠానపురాన్ని రాజధానిగా చేసుకుని, ప్రజలను పాలించాడతను.

ఊర్వశి, పురూరవులకు ఆయువు, అమావసువు, దృఢాయువు, వనాయువు, శతాయువు అని ఐదుగురు కొడుకులు జన్మించారు. వారిలో పెద్దవాడైన ఆయువుకి నహుషుడు, క్షత్రవృద్ధుడు, రంభుడు, రజి, ననుసేనుడు అని అయిదుగురు జన్మించారు. వారిలో రజికి అయిదువందలమంది కొడుకులు జన్మించారు. వారే రాజేయులని లోకప్రసిద్ధులయ్యారు. అప్పుడే దేవాసురుల యుద్ధం ప్రారంభమైంది. విజయం ఎవరిని వరిస్తుందన్నది తెలియజేయాల్సిందిగా బ్రహ్మదేవుణ్ణి వేడుకున్నారంతా. భయంకర ఆయుధాలతో రజి ఎవరివైపు ఉండి యుద్ధం చేస్తాడో వారిదే గెలుపు అన్నాడు బ్రహ్మ. అంతేకాదు, రజి ఉన్నచోటే ధైర్యం ఉంటుందనీ, ధైర్యం ఉన్నచోటే సిరి ఉంటుందనీ, ధృతీ, సిరీ కలసిన చోటే విజయం ఉంటుందనీ అన్నాడు బ్రహ్మ.

రజి రాహువు మనుమడు. తమ జనని వంశీయుడు అన్న అభిమానంతో యుద్ధభూమిలో రజి తోడ్పాటును అర్థించారు రాక్షసులు. రజి అప్పుడు అన్నాడిలా.

దేవతలను జయించిన తర్వాత వారిసహా మిమ్మల్ని కూడా నేనే పాలిస్తాను. అందుకు మీరు ఒప్పుకుంటారా?

ఒప్పుకోమన్నారు రాక్షసులు.

మా రాజు ప్రహ్లాదుడు. మా ఆవేశకావేశాలన్నీ అతనికోసమే! నువ్వు దేవతలను పాలించుకో, మాకు అభ్యంతరం లేదు. మమ్మల్ని పాలిస్తామంటే మేము అందుకు అంగీకరించం అన్నారు. అది అవకాశంగా తీసుకుని, దేవతలు రజిపాలనకు ఒప్పుకున్నారు. ఇంద్రపదవి చేపట్టి పాలించడంలో తమకు ఎలాంటి అభ్యంతరం లేదన్నారు. దాంతో రజి చిచ్చరపిడుగులా విజృంభించి, వేలాది దానవులను నిర్మూలించాడు. స్వర్లోకరాజ్యలక్ష్మిని మహేంద్ర భవనంలో ప్రతిష్ఠించాడు.

చేసుకున్న ఒప్పందం ప్రకారం దేవేంద్రుడు అప్పుడు రజిని సమీపించి చెప్పాడిలా.

రాజా! మన ఒడంబడిక ప్రకారం నువ్వు ఇంద్రుడివి అయినావు. నేను నీకు పుత్రప్రాయుణ్ణి. నీ వైభవానికి ఉత్తరాధికారిని.

అందుకు అంగీకరించాడు రజి. స్వర్లోకంలో నివసించసాగాడు. రజిపుత్రులు కూడా స్వర్గానికి చేరుకుని, దేవేంద్రుని సామాన్యునిలా చూస్తూ, యథేచ్ఛగా భోగాలనుభవించసాగారు. కొద్దికాలం గడిచింది అలా. ఇక వారి ధోరణి భరించలేకపోయాడు ఇంద్రుడు. బృహస్పతి సన్నిధికి చేరుకున్నాడు. అతని పాదాల మీద పడి వేడుకున్నాడిలా.

అనుకున్నట్టుగానే నా స్వర్గరాజ్యాధిపత్యం రజికి అప్పగించాను. అతని పుత్రులు కూడా స్వర్గానికి చేరుకున్నారు. నన్ను సామాన్యునిలా జమకట్టి, సమస్త భోగాలూ వారే అనుభవిస్తున్నారు. నాకు అక్కడ నిలువనీడ కూడా లేదు. కరుణించి ఈ సమస్యను పరిష్కరించు. నాకు ఓ దారి చూపించు.

నాకంతా తెలుసు. నువ్వేమాత్రం ఆందోళన చెందకు. నీకు అంతా మంచే జరుగుతుంది అన్నాడు బృహస్పతి. దేవేంద్రుని తేజస్సును పెంపొందించేందుకు, శత్రువులపై అతను విజయం సాధించేందుకు యజ్ఞం ఒకటి తలపెట్టి, హోమాదికం నిర్వర్తించాడు. దాని ప్రభావంతో రజి కుమారులు కామక్రోధరోషవివశులై, ధర్మహీనులై సాధువులైన బ్రాహ్మణాదులను అనేక విధాల హింసించసాగారు. ఆ హింసల కారణంగా వారి తేజోబలాలు అణగారిపోయాయి. సమయం అనుకూలించడంతో దేవేంద్రుడు తన వజ్రాయుధంతో రజికుమారులపై విరుచుకుపడి, వారినందరినీ సంహరించాడు. కొడుకులంతా చనిపోయారని తెలిసి, ఏమీ చేయలేని స్థితిలో రజి, స్వర్గాన్ని విడచి, భూలోకానికి చేరుకున్నాడు. దేవేంద్రుడు స్వర్గాన్ని చేజిక్కించుకున్నాడలా.

ఆయువు పెద్దకొడుకు నహుషునికి యయాతి, సంయాతి, ప్రయాతి అని ముగ్గురు కుమారులు జన్మించారు. వారిలో యయాతికీ, శుక్రుని కుమార్తె దేవయానికీ యదు, అతుర్వసులు అని ఇద్దరు కుమారులు జన్మించారు. వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠకీ, యయాతికీ ద్రుహ్యావు, అనువు, పూరువు అని ముగ్గురు కుమారులు జన్మించారు. యయాతి స్వర్లోకపతి దేవేంద్రుని మించి ప్రజాపాలనం చేశాడు. దేవేంద్రుడు అందుకు సంతోషించి, అతనికి దివ్యరథం బహూకరించాడు. దానిని అధిరోహించి, అప్రతిహత శాసనుడై ఆరు రోజులపాటు లోకాలన్నిటినీ ఏకచ్ఛత్రాధిపత్యంతో పాలించాడు యయాతి. పూరుడు మొదలైన అతని కుమారులు కూడా ఆ దివ్యరథ ప్రభావంతో సమస్తలోకాలనూ పాలించారు. కొన్ని తరాలు గడిచాయి అలా. తర్వాత పరీక్షిత్తుమారుడైన జనమేజయుడు, గర్గుని కొడుకుని ప్రమాదవశాత్తూ సంహరించడంతో బ్రహ్మహత్యాపాతిత్యం అతన్ని చుట్టుకుంది. ఫలితంగా అతని శరీరం దుర్గంధపూరితం అయింది. దానిని భరించలేకపోయేవారెవరూ. అతని దగ్గరగా ఎవరూ నిలబడేవారు కాదు. ఆ రకంగా ప్రజలందరిచేతా పరిత్యక్తుడైన జనమేజయుడు, శౌనకమునిని ఆశ్రయించి, ఆశ్వమేధం చేశాడు. ఘోరపాపాన్ని తొలగించుకున్నాడు. జనమేజయుణ్ణి బ్రహ్మహత్యాపాతిత్యం చుట్టుకున్నప్పుడు, దేవేంద్రుడు వారికి బహూకరించిన దివ్యరథం అదృశ్యమైపోయింది. స్వర్లోకానికి తరలిపోయింది. అప్పుడు దానిని దేవేంద్రుడు ఉపరిచర వసువుకి బహూకరించాడు. అతడు దానిని మగధాధిపతి బృహద్రథునికి అందజేశాడు. అలా ఆ రథం అతని కుమారుడు జరాసంధుని సొంతం అయింది. జరాసంధుని సంహరించి, భీముడు ఆ రథాన్ని కృష్ణునికి బహూకరించాడు అని ఆగాడు వైశంపాయనుడు.

-అరణి

# టీనేజ్ ట్యూన్స్ 9

రిథమ్ ఆఫ్ లైఫ్



**ఒకరిని చూస్తే ఒకరికి ఏదో తెలియని ఆకర్షణ**
**నిన్న మొన్న కొట్లాడుకున్న వారే అంతలో ఫ్రెండ్స్ అయిపోతారు**
**స్నేహబంధాన్ని ప్రేమబంధంగా మలుచుకుంటారు కొంతమంది**
**మరికొందరు స్నేహమో, ప్రేమో తెలియని డైలమాలో మునిగిపోతుంటారు**
**మరి అసలు ప్రేమ తాలూకూ మధుర భావాలు ఎలా ఉంటాయంటే...**

సహజసిద్ధంగా అబ్బాయి అమ్మాయి మధ్య ఒకరిపట్ల ఒకరికి ఏర్పడే ప్రేమ ఎప్పుడూ మెచ్చుకోలుతో ప్రారంభమవుతుంది. అంతకు ముందు వరకు యావరేజ్‌గా కనిపించిన అమ్మాయే ఓ శుభముహూర్తాన అద్భుతమైన వ్యక్తిగా కనిపిస్తుంది. అలా కనిపించడం మొదలు పెట్టాక వేరేవాళ్లు తన గురించి కామెంట్ చేసినా అవేవీ అబ్బాయి తలకెక్కవు. అబ్బాయి సంగతి అలా ఉంటే ఇక అమ్మాయి సంగతేమో అతను పొట్టిగా ఉన్నా, బక్కగా ఉన్నా, ఏ ఒక్క 'హీరోచిత' లక్షణమూ లేకున్నా సరే అతను హీరోలా, మన్మథుడిలా కనిపిస్తాడు. ఇలా ఒకరి పట్ల ఒకరికి ఎడ్మిరేషన్ లేక మెచ్చుకోలు భావన కలగడానికి కారణం ఆ వయసులో సహజసిద్ధంగా ఉండే ఆదర్శ మనస్తత్వంతప్ప మరొకటి కాదు. అలా క్రమక్రమంగా వారి మెచ్చుకోలే క్రమంగా రొమాంటిక్ ప్రేమగా మారడానికి అంకురార్పణ అవుతుందనుకో వచ్చు.

### లవ్‌దోమ కుట్టేసింది

రొమాంటిక్ ప్రేమలో మెచ్చుకోలు ఒక దశకు వచ్చాక తర్వాతి దశలో అబ్బాయి లేదా అమ్మాయికి ప్రేమజ్వరం ఆవహిస్తుంది. ఈ ప్రేమజ్వరంలో వాళ్లకు ఆకలి మందగిస్తుంది. అన్నం సహించదు. నిద్ర పట్టదు. శారీరకంగా బరువుతగ్గి బక్కగా తయారవుతుంటారు. అమ్మాయిలూ, అబ్బాయిలూ కూడా అలాగే ఉంటారు. ఏమీ తినట్లేదని తల్లిదండ్రులు బెంగ పడుతుంటారు. అయితే ఇలా ప్రేమికులకు ఆకలి మందగించడానికి మానసిక సంబంధమైన కారణం ఒక్కటేకాదు, శారీరక కారణం కూడా ఉంది. అదేమిటంటే కోపం, ఈర్ష్య, భయంలాగే ప్రేమ అనేది కూడా ఒక బలీయమైన ఉద్వేగం. మనిషి ఇలాంటి బలమైన ఉద్వేగాలలో ఉన్నప్పుడు జీర్ణకోశంలో జీర్ణ ద్రవాలు సరిగా ఉత్పత్తికాక జీర్ణశక్తి దెబ్బతింటుంది. జీర్ణశక్తి దెబ్బతినడంతో ఆకలి పుట్టదు. అన్నం తినాలనిపించదు. బలవంతాన తిన్నా జీర్ణం కాదు. అప్పుడప్పుడూ కాస్త జ్వరం వస్తుంది. తీవ్రమైన ప్రేమలో అంటే ప్రేమ జ్వరం ఉన్నప్పుడూ లేక ఆ ప్రేమ విఫలమైనప్పుడూ వారిలో కలిగే ఉద్వేగాలవల్ల కలిగే శారీరక మార్పులే ఇవన్నీ.

# కలవరమాయె మదిలో...



### మౌనరాగాల సరాగం

ఇలా ప్రేమ బాధలో ఉన్నవారిలో కొన్ని కొన్ని మార్పులు వస్తాయి. అలా ప్రేమ జ్వరంలో కొట్టుమిట్టాడుతూనే కొన్నాళ్లకు ఏదో ఒక ఆలంబన ద్వారా ఒకరికొకరు చేరువవుతారు. ఆ తర్వాత ముచ్చట్లు ఊసులు మొదలవుతాయి. పెద్దవాళ్లు తిడతారనే భయం ఉంటే వారికి తెలియకుండా చాటుగా మాట్లాడుకోవడం, లేకుంటే చాటుగా కలుసుకోవడం ప్రారంభిస్తారు. అలాంటి భయమేదీ లేకపోతే బాహాటంగానే కలుసుకుంటూవుంటారు. కలిసినప్పుడల్లా ఒకరి గురించి మరొకరు తీపి కబుర్లు చెప్పుకుంటారు, ఊసులాడుకుంటారు. సాహిత్యం మొదలు సినిమాల వరకు, ఫ్యామిలీ విషయాలు మొదలు పర్సనల్ విషయాల వరకూ అన్నీ ఆ ఊసులలో ఉంటాయి. తమ భవిష్యత్తు కలల్ని షేర్ చేసుకుంటారు. తాము ఒకవేళ నిజంగానే భార్యాభర్తలైతే ఎలా ఉండాలి? ఏమి కావాలని కోరుకుంటున్నదీ ఒకరి

# సహజీవనానికి రెడీ!

నేటికాలం ప్రేమబంధాలు బలంగా మారుతున్నాయా? బలహీనమైపోతున్నాయా? ఈ ప్రశ్నకు విభిన్న సమాధానాలు వస్తాయి. ఆ వాదనల సంగతి ఎలా ఉన్నా నేటి ప్రేమికులు తమ కెరీర్‌తో పాటు లవర్స్‌గా కూడా జీవితాన్ని ఒకే ఇంట్లో గడిపేందుకు రెడీ అయిపోతున్నారు.

నేటికాలం లవర్స్ ట్రెండ్ ఎలా ఉంది? అనే అంశంపై చేసిన తాజా సర్వే పలు విషయాలు బహిర్గతం చేసింది. టీనేజర్లు లవర్‌ను పెద్దలకు పరిచయం చేసేందుకు భయపడడం లేదు. నచ్చితే చాలు, కొందరు పెళ్ళికి ముందే సహజీవనానికి రెడీ అయిపోతున్నారు. కొందరు యువతీ యువకులైతే మరో అడుగు ముందుకేసి సహజీవనంలో ఏవైనా అలజడులు, అసంతృప్తులు తలెత్తితే వ్యవహారం పెళ్ళివరకు రానీయకుండా అక్కడే ఫుల్‌స్టాప్ పెట్టేస్తున్నారు. మరొకరితో లవ్ అఫైర్ కొనసాగిస్తున్నారు.



కొకరు చెప్పుకుంటారు. అంతవరకు ఎవరికీ చెప్పని రహస్యాలు సైతం ప్రేమికులిద్దరూ మనసువిప్పి చెప్పుకుంటారు. ఒక్కోసారి అలా మాట్లాడుకుంటూనే ఇద్దరూ కామ్ అయిపోతారు. మాటలు కరవవుతాయి. ఆసమయంలో ఒకరినొకరు తాకుతూ కూర్చుని ఆ స్పర్శను ఆనందిస్తూ గంటలు క్షణాల్లా గడిపేస్తారు. పౌరజీవనంలో లవర్స్ గడిపేందుకు కనిపించే ప్రకృతి సుందర ప్రదేశాలు, ఏకాంత ప్రదేశాలన్నీ వారికి వేదికలుగా మారిపోతాయి. లేకపోతే ఉద్యానవనాల్లో కళ్ళతో మాట్లాడుకుంటూ మౌనరాగాలు ఆలపిస్తారు. మౌనం కూడా ఒక అందమైన భాషలా వారిమధ్య మనోభావాల్ని కమ్యునికేట్ చేస్తూ ఉంటుంది. అలా నచ్చిన వారితో గంటలు గంటలు కాలం గడిపేందుకు ఇష్టపడతారు.

### ప్యార్ మే పడిపోయా

ప్రేమలో పడకముందు, అబ్బాయిలూ, అమ్మాయిలూ ఒకరినొకరు లెక్కచేయనివాళ్ళు కాస్తా ప్రేమలో పడ్డాక ఒకరి అభిప్రాయాలను ఒకరు గమనిస్తూ అవతలివాళ్ళ తమ గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకునే ప్రయత్నం చేస్తారు. వారి భావనలకు అనుగుణంగా తమని తాము మలచుకోవాలని చూస్తుంటారు. ఒకరికోసం ఒకరు ఇష్టంలేని పనులు కూడా చేయడానికి సిద్ధపడతారు. స్నేహం, ఆరాధన, లాలిత్యం, అవతలి వాళ్ళకు అండగా నిలవాలనే తత్వం, సెక్సుపరమైన ఆకర్షణ, అభిమానం, మెచ్చుకోలుతనం వంటివన్నీ వారి మధ్య ప్రేమలో గాఢంగా అల్లుకుపోయి ఉంటాయి. అబ్బాయి అమ్మాయిని మెచ్చుకుంటాడు, ఆమెను కాపాడాలనుకుంటాడు, ఆమె కోసం ప్రాణాలైనా ఇవ్వాలనుకుంటాడు, అమ్మాయి కూడా అతనిపట్ల ఆరాధన పెంచుకుంటుంది. ఈ ప్రేమలో ఇద్దరూ తమని తాము మర్చిపోతారు. వారి గురించే కాక పుట్టబోయే పిల్లల గురించీ ఆలోచిస్తుంటారు.

ప్రకృతి ధర్మం పిల్లల్ని కనటమే కాబట్టి సహజసిద్ధంగానే ఈ ప్రేమలో సెక్సు ఆకర్షణ తప్పకుండా ఉంటుంది. పిల్లల పోషణ, పెంపకం, వారి ఉనికి, సంరక్షణ వంటివి కూడా ప్రకృతి ధర్మమే కాబట్టి అందుకు అనువైన రీతిలో వివాహం కోసం వెంపర్లాట ఉంటుంది.

ప్రేమపర్వంలో సెక్స్‌లో పాల్గొనకపోవడం వారి నిగ్రహానికి, నైతిక వర్తనకు చిహ్నంగా ఉంటుంది.

వివాహమయ్యాక స్త్రీపురుషులిరువురూ సెక్స్ ధర్మాలు పాటిస్తుంటే అది వాళ్ళ మధ్య ప్రేమ బంధంగా, ప్రేమకు చిహ్నంగా నిలుస్తుంది. ఆ ప్రేమ ఎంత శారీరకమైనదో అంత లౌకికాతీతమైనది కూడా. కుటుంబమూ, కుటుంబ వ్యవస్థా పటిష్టంగా ఉండటానికి దోహదపడుతుంది.

మరి టీనేజర్లలో కలిగే ఈ విపరీత భావాలు ఎలా ఉంటాయి? ప్రేమంటే పక్కాగా రొమాన్స్ కోసమే తహతహలాడతారా? లేక వారిలో రొమాన్స్, సెక్స్ పట్ల ఎలాంటి ఆలోచనలు ఉంటాయి? దానికి ఏవిధంగా అడ్డుకట్ట వేయవచ్చు? అనే విషయాలు ముందుముందు చూద్దాం!

- లతాకమలం
lathakamalam.me@gmail.com

## అందంగా ఉంటే క్షమిస్తారు!

అమ్మాయిలను అంత తొందరగా అర్థం చేసుకోవడం కష్టమే. పొరబాటున అబ్బాయిలు తప్పుచేస్తే అమ్మాయిలు వారికి చుక్కలు చూపించడం ఖాయం. ఎంత బతిమాలినా ఒక పట్టాన క్షమించరు. అయితే ఒకవేళ అమ్మాయిలు క్షమించాల్సివస్తే అబ్బాయిల అందచందాలను బట్టి రియాక్ట్ అవుతారట. కర్మకాలి అబ్బాయి అందంగా లేకుంటే చేయి చేసుకోవడానికైనా వెనుకాడరు. ఈ విషయం అమెరికాలోని ఈస్టర్న్ కెంటకీ యూనివర్సిటీ సర్వేలో వెల్లడైంది. ఆ సర్వే నివేదిక ప్రకారం అబ్బాయిలకు సంబంధించి అమ్మాయిలు, చాలా సెలెక్టివ్‌గా ఉంటారు.

అమ్మాయిలు క్షమించాలంటే అబ్బాయి అమాయకంగా కనిపించినంతమాత్రాన సరిపోదు, అందంగా కూడా ఉండాలి. అతని డ్రెస్ సెన్స్, స్టైల్, మాట్లాడే విధానం అన్నీ గమనించిన తర్వాతే, 'ఇట్స్ ఓకే' అని చెబుతారు.



అందంగావున్న అబ్బాయిల్ని అమ్మాయిలు వెంటనే క్షమిస్తారని, ఓ మోస్తరుగా ఉన్న వాళ్ళను క్షమించేందుకు కొంచెం టైం తీసుకుంటారని తేలింది. ఈ పరిశోధన కోసం 170 కాలేజీలకు చెందిన అందమైన అమ్మాయిలను, అబ్బాయిలను పరిశీలించి, కొన్ని ఘటనలు సృష్టించి వాటి ద్వారా అమ్మాయిల రియాక్షన్స్ గమనించి నివేదికలు తయారు చేశారు.



**తూర్పువాకిలి తెరచి, చీకటి తెరలు చీల్చుకుంటూ లోకంలోకి ప్రవేశిస్తున్నాయి వెలుగు రేఖలు.**

**తేజ, లత రోజూలాగే ప్రాతఃకాల వ్యాహ్యాళికి సిద్ధమయ్యారు. తగిన దుస్తులు ధరించారు. కాళ్లకు తెల్లనిబూట్లు వేసుకుని రోడ్డుమీదకు వచ్చారు ఇద్దరూ.**

# అమ్మఒడి

డా॥వాసా ప్రభావతి

వీచే చల్లగాలికి ఇద్దరి శరీరాలు పులకించాయి. వాహనాలు ఇంకా తిరగనందున దుమ్ము, ధూళితో కలుషితం కాలేదు ఆ చల్లగాలి. కిలకిల రావాలతో సందడిచేస్తున్న పక్షులు ఆకాశంలో గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి. దూరంగా కుక్కల అరుపులు కర్ణకఠోరంగా వినబడుతున్నాయి.

తేజ, లతలకు 25 సంవత్సరాలు పైబడి ఉండవచ్చు. ఇద్దరూ ఇంకా వివాహాలు చేసుకోలేదు. 'అమ్మఒడి' పేరుతో పిల్లలకు ఆశ్రమం స్థాపించి నడిపిస్తోంది తేజ. అంతేకాకుండా ఐదవ తరగతివరకు పాఠశాల నెలకొల్పి నడిపిస్తోంది. తేజకు తోడుగా లతకూడా వాటిలోనే పనిచేస్తోంది. ఇద్దరూ బాల్యంనుంచీ స్నేహితులు. "ఈ వారం మన ఆశ్రమానికి ఇద్దరు కొత్తపిల్లలు వచ్చారు. 'అమ్మఒడి'లో బాగానే అలవాటు పడ్డారటగా"

"అవును తేజా! ఇద్దరూ రోజుల పిల్లలే! ఏ తల్లులు కనిపడేశారో; జాలి, దయలేని బండ తల్లులు. తల్లి జాతికే కళంకం తెచ్చారు. వారివి గుండెలుకాదు! బండరాళ్ళు" తేజ మాటలకు సమాధానమిచ్చింది లత.

"నిజం లతా! నువ్వన్నది ముమ్మాటికి నిజం" అంది తేజ.

ఇద్దరూ దగ్గరలో పార్కువైపు వేగంగా నడుస్తున్నారు.

అంతలో పసిగుడ్డు ఏడుపు వినబడింది వారికి.

"లతా! ఆగు! ఆగు! ఎక్కడో పసిగుడ్డు ఏడుపు వినబడుతోంది" అంది తేజ.

లత ఆగింది.

"అవును తేజా! అది పసిగుడ్డు ఏడుపే!" అంది లత.

ఇద్దరు అటూఇటూ పరిశీలనగా చూశారు.

"అదిగో లతా! అటు చూడు, చెత్తకుండీ! అందులోంచి ఏడుపు వినబడుతోంది!"

**తూరుపు తెలవారింది. తేజ, లత మార్నింగ్ వాక్‌కి బయలుదేరారు. పార్క్‌లో నడుస్తున్నారు. అంతలోనే పసిగుడ్డు ఏడుపు వినిపించింది. చుట్టూ పరికించారు. అటూఇటూ వెతికారు. కొంచెం దూరంలో చెత్తకుండీ. వడివడిగా అటువెళ్ళారు. అంతలో ఎవరో ఇద్దరు పరుగెత్తి వెళ్ళిపోవడం గమనించారిద్దరూ. లత వారిద్దరినీ వెంబడించి అడ్డుకుంది. అప్పుడు వాళ్ళేంచేశారు? లతకు హాని తలపెట్టారా? ఇంతకీ వాళ్ళెవరు?**

"అవును తేజా".

ఇద్దరు అటుగా పరుగెత్తారు. పసిగుడ్డు ఏడుపు మరింత దగ్గరైంది.

"లతా! అటుచూడు, ఎవరో ఇద్దరు పరుగెత్తి వెళ్ళిపోతున్నారు. నువ్వు వెళ్ళి ముందు వాళ్ళని ఆపు! పారిపోకుండా చూడు! నేను ఈ పసిగుడ్డు సంగతి చూస్తా!" అంది తేజ.

లత వారివైపు పరుగెత్తింది. తేజ చెత్తకుండీ సమీపించి తొట్టిలోంచి రెండుచేతులతో పసిగుడ్డును లేవతీసి భుజంమీద వాల్చుకుంది. పసిగుడ్డు గుక్కపట్టి ఏడుస్తూనే ఉంది.

"ఆకలి వేస్తోందేమో పాపం! పాలు కావాలి? ఆ ఇద్దరిలో ఒకరు ఈ పసిగుడ్డు తల్లి కావాలి?" అనుకుంది.

పరుగెత్తి పారిపోతున్న ఆ ఇద్దరినీ అడ్డగించింది లత.

"మీరేనా ఆ పసిగుడ్డును వదిలి పారిపోతున్నది? ఆగండి! కదిలారో, పోలీసుల్ని పిలిపిస్తా" అంది.

ఆమె మాటలకి వాళ్ళు ఆగిపోయారు. వెక్కి వెక్కి ఏడ్చారు.

"అంతాచేసి ఇప్పుడు ఏడవడం దేనికి? ముందు ఆ చెత్తకుండీ వరకు నాతో రండి" లత కంఠం తీవ్రంగా ఉంది.

వాళ్ళిద్దరూ లతతోపాటు అక్కడకు చేరుకున్నారు. ఎదురుగా తేజ చేతిలో గుక్కపట్టి ఏడుస్తున్న పసిగుడ్డు.

అప్పటికి వెలుగు బాగా వచ్చింది. ఎదురుగా నిలబడిన ఇద్దరు ఆడవాళ్ళ ముఖాలు స్పష్టంగా కనబడుతున్నాయి.

"ఈ పసిగుడ్డు నీ బిడ్డేనా? చెత్తకుండీలో పడెయ్యడానికి చేతులెలా వచ్చాయి? ఏ కుక్కలో పీక్కుతినేస్తే వీడి బతుకేమయ్యేది? ముందు పసివాడికి పాలియ్యి. లేకపోతే వాడిప్రాణం అడుగంటిపోతుంది?" కుమిలి కుమిలి ఏడుస్తున్న ఆ తల్లికి పసిగుడ్డును అందించింది తేజ.

మారు మాట్లాడకుండా అందుకుంది ఆమె. నేల మీద చతికిలపడి పసిగుడ్డుకు పాలివ్వడం మొదలు పెట్టింది. పక్కనున్నామె కుమిలి కుమిలి ఏడుస్తూనే ఉంది.

"ముందు ఏడుపు ఆపు. ఈమె నీ కూతురేనా? కన్న కూతురుచేత దగ్గరుండి ఇటువంటి మహాపాపం చేయిస్తావా? ఆడదానివేనా?" అంది కాస్త కోపంగా తేజ.

"అవునమ్మా! నా కూతురే. పసిగుడ్డుమీదే మా ప్రాణాలున్నాయి. కానీ ఏం చెయ్యడానికీ దారిలేక బతుకుమీద ఆశతో ఈపని చేశాం! మమ్మల్ని కొట్టినా పాపం లేదమ్మా!" తల్లి భోరున ఏడుస్తూ అంది.

ముందు మారంచేసిన ఆ పసిగుడ్డు తరువాత గుటకలేస్తూ తల్లిదగ్గర పాలు తాగడం మొదలుపెట్టాడు. వాడు చనుబాలు తాగుతుంటే ఆ తల్లి శరీరం పులకరించింది. బిడ్డ ఆకలి తీరినట్టుంది. పాలు తాగడం ఆపి నిద్రలోకి జారుకున్నాడు. వాణ్ణి భుజాన వేసుకుని లేచి నిలబడింది తల్లి. ఇప్పుడా తల్లి ప్రేమ ఆమె శరీరమంతా తొణికిసలాడింది. "ఏడుపులు ఆపండి! జనం చూస్తే చుట్టూ మూగుతారు. ముందు మీరు మాతో మా ఇంటికిరండి. అక్కడ మాట్లాడుకుందాం" అంది తేజ.

తేజ ఇంటివైపు అడుగులేసింది. ఆమె వెంటే ఆ ఇద్దరు ఆడవాళ్ళు పసిగుడ్డుతో నడిచారు. వారివెనుకే లత నడిచింది.

తేజ తలుపులు తోసుకుని ఇంట్లోకి నడిచింది. ఆమె వెంటే అందరూ ఇంట్లో అడుగుపెట్టారు.

అక్కడున్న ఆయాను పిలిచి, తల్లి భుజాన అంటి పెట్టుకున్న పసిగుడ్డుని అందుకుని ఆయాకి అందించింది తేజ.

పసిగుడ్డును వదలలేక ఆ తల్లిప్రాణం గిజగిజలాడింది. భోరున ఏడుస్తూ పిల్లాణ్ణి ఆయా చేతికి అందించింది కన్నతల్లి.

"ఏడవకు, పిల్లవాణ్ణి నీకంటే బాగా చూసుకుంటారు! ఇప్పుడు బెంగపడి లాభంలేదు" అంటూ ఆయావైపు తిరిగి "ఆయా పిల్లాణ్ణి 'అమ్మఒడి' ఆశ్రమంలో అప్పజెప్పు" అంది తేజ.

"సరేనమ్మా!" అంటూ నిద్రిస్తున్న పిల్లాణ్ణి ఒడిలోకి తీసుకుని ఆశ్రమానికి బయలుదేరింది ఆయా. బిడ్డను ఆశ్రమంలో చేర్పించే పనులు పూర్తి చెయ్యడానికి ఆమె వెంటే లత బయలుదేరింది.

ఆ ఇద్దరు ఆడవాళ్ళూ ఎవరో తెలియక తేజా తల్లి ఆశ్చర్యంగా చూసింది.

"ముఖం కడుక్కున్నారా? లేదా?" తేజ ఆ ఇద్దర్నీ అడిగింది.

"కడుక్కున్నామమ్మా" పెద్దామె సమాధానమిచ్చింది.

"అమ్మా! ముందువాళ్ళకి టీ పంపించు" తేజ మాట పూర్తి కాకుండానే ఆ తల్లి వంటింట్లోకి వెళ్ళి, ఆ ఇద్దరికి టీలు పంపించింది.

తేజాకి ఆ తల్లే స్వయంగా కాఫీకప్పు అందించింది.

"నువ్వు ఇలాంటి పనులు చెయ్యొద్దంటే మానవమ్మా! వెళ్ళి విశ్రాంతి తీసుకో" అంది తేజ.

ఆమె తల్లి లోపలికి వెళ్ళిపోయింది.

"ముందు ఇద్దరూ కుర్చీలో కూర్చుని టీలు తాగండి!" అంది తేజ.

వాళ్ళిద్దరూ కుర్చీల్లో కూర్చోలేదు. నేలమీద కూర్చుని టీ తాగడం పూర్తి చేశారు.

"తెలివితక్కువగా మగాడిచేతిలో మోసపోయి బిడ్డను కనడం, ఇలా పారెయ్యడం మహా



## తేడాగా ప్రియాంక ప్రేమ వ్యవహారం!

బాలీవుడ్ బ్యూటీ ప్రియాంక, డిజైనర్ మనీష్ మల్హోత్రాలు ప్రేమించుకుంటున్నారన్న విషయంలో మొన్నటి వరకూ క్లారిటీ రాలేదు. కానీ, ఇటీవల మాత్రం ఓ క్లారిటీ వచ్చేసిందట! ప్రియాంక కోసం మల్హోత్రా అమెరికా వెళ్ళాడట! అతగాడు కష్టపడి తన కోసం వచ్చినందుకు ప్రియాంక ఓ పార్టీ ఏర్పాటు చేసింది. దానికి అక్కడే ఉన్న బాలీవుడ్ స్టార్స్‌ని పిలిచింది. తనకోసం ప్రత్యేకంగా వచ్చిన వ్యక్తికి ప్రత్యేకమైన పార్టీ ఇవ్వకుండా దానికి అందర్నీ పిలవడం ఏమిటి? అన్నదే పార్టీకి వచ్చిన వారికి అర్థం కాలేదట! తామిద్దరూ ప్రేమలో ఉన్నామని చెబుతోందా? లేక కేవలం స్నేహం మాత్రమే ఉందని చెప్పడానికా ఈ పార్టీ అన్నది చాలా మందికి అర్థం కాలేదు. స్నేహం కోసం ఎవరూ అంత దూరం వెళ్లరు. ప్రియాంక ఎటూ ఇండియా వస్తూ పోతూనే ఉంది. ఇక్కడే ఆమెను కలుసుకోవచ్చు కదా! ప్రత్యేకించి మల్హోత్రా అమెరికా ఎందుకు వెళ్లినట్టు? అన్నది బాలీవుడ్‌లో చాలా మందికి వస్తున్న అనుమానం. వీరిద్దరి మధ్య ఉన్నది స్నేహం కాదు, ప్రేమేనని కొందరు బాలీవుడ్ జనాలు కన్‌ఫర్మ్ చేసేశారు.

పాపం కాదా! కనేముందు జ్ఞానం లేదా! ఇప్పుడు ఏడవడం దేనికి?" కాస్త గట్టిగానే అడిగింది తేజ.

"ఈమె నా కూతురే, కూలిపని చేసుకుంటూ ఇంటర్ వరకు చదివించా! ఓ కంపెనీలో పని చేస్తోంది. నా పెంపకంలో లోటులేదమ్మా! మా వీధిచివర గిరి అనే వ్యక్తితో పరిచయమైంది. మోసపోయింది. వాడు ఓ ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నాడు. పదివేలు తెచ్చుకుంటున్నాడు. పెళ్ళి చేసుకుంటానని నమ్మించి నెల తప్పిందని తెలియగానే కనపడకుండా పోయాడు. కనుక్కుందా మంటే వాడెక్కడ పని చేస్తున్నాడో కూడా తెలియదు. అంతా వెతికాం ఎక్కడా వాడిజాడ లేదు. అప్పటికే ఆలస్యమయింది. డాక్టరమ్మకు చూపించా! మూడవనెల దాటింది. గర్భం తియ్యడానికి వీలు లేదు. తల్లి ప్రాణానికి ముప్పు. పైగా చట్టరీత్యా నేరం. నీరసంగా ఉంది. మందులు వాడండి" అంటూ పంపించేసింది. అందుకే ఏటినాగారం ప్రాంతం వదిలేసి ఇక్కడకువచ్చి ఓ గది అద్దెకు తీసుకుని ఉంటున్నాం. నెలలు నిండగానే చార్మినార్ రోడ్‌లోవున్న జడ్జిఖానా ఆసుపత్రిలో చేర్పించా! పురుడు పోసి మూడవరోజు పంపించేశారు. గుండెలు బాదుకుని పిల్లాణ్ణి ఒళ్ళో పెట్టుకుని ఏడ్చాం! వాణ్ణి వదల్లేం, పెంచిపెద్ద చెయ్యలేం! పెళ్ళికాని పిల్ల కదా! జీవితంమీద ఆశతో గుండె రాయి చేసుకుని ఈ పని చేశాం, నువ్వే కాపాడాలి తల్లీ! అంటూ ఆ తల్లీకూతురూ తేజ కాళ్లమీద పడ్డారు. వాళ్ళని లేవదీసింది. ఆ కన్నీటిగాథ విని తేజ కళ్ళు వర్షించాయి.

"మీరిద్దరూ రెండురోజులు ఇక్కడే ఉండండి. పిల్లాడు 'అమ్మఒడి' ఆశ్రమంలో అలవాటుపడతాడు. అప్పుడు మీ ఇద్దర్నీ ఆ ఆశ్రమానికి ఆయాలుగా పంపిస్తా! మీ పిల్లాణ్ణి మీరే పెంచుకుంటూ ఉండచ్చు!" అంది తేజ.

"ఎంత గొప్పమనసు తల్లీ నీది! ఎంత గొప్ప ఆలోచన తల్లీ నీది! మేమింత తప్పు చేసినా మమ్మల్ని కాపాడావు తల్లీ! స్త్రీజాతికి నువ్వు గర్వ కారణం తల్లీ!" అంటూ ఇద్దరూ తేజ పాదాల మీద పడి భోరున ఏడ్చారు.

"ముందులేచి స్నానాలు చెయ్యండి, ఫలహారాలు తిందురుగాని" అంటూ ఆయమ్మను పిలిచి, "వీళ్ళు పెరటిగదిలో ఉండటానికి ఏర్పాట్లు చూడు, స్నానాల గది చూపించు" అని చెప్పింది.

తర్వాత 'అమ్మా' అంటూ పిలిచింది.

తల్లి రాగానే "అమ్మా! ఈ తల్లీకూతుళ్ళు 'అమ్మఒడి' ఆశ్రమం పనిమీద వచ్చారు. రెండు రోజులు మనింట్లోనే ఉంటారు. తరువాత 'అమ్మఒడి' ఆశ్రమానికి ఆయాలుగా పంపించేస్తా!" తల్లికి చెప్పి ఆమె సమాధానం చెప్పకముందే తేజ అక్కడనుంచి లేచింది.

ఆ తల్లీకూతుళ్ళ ఆనందానికి అంతులేదు. తమ జీవితాలు తిరిగి చిగురించడమేకాదు, చావు ఒడికి చేరిన పిల్లాడు తమఒడికి చేరుతున్నాడని మురిసిపోయారు.

ఆశ్రమం చేరిన పిల్లాణ్ణి ఆయాలు స్నానం చేయించి బట్టలువేసి నుదుట నల్లబొట్టుపెట్టారు. బుగ్గన చుక్కపెట్టి 'అమ్మఒడి' ఉయ్యాలలో పడుకోబెట్టారు. తల్లి పాలు చవిచూసిన ఆ పసిగుడ్డు సీసాపాలు తాగడానికి మారాం చేశాడు. ఆకలికి తాళలేక చివరకు సీసా పాలకే అలవాటుపడ్డాడు. తల్లి సుందరమ్మ, కూతురు శకుంతల ఆయాలుగా 'అమ్మఒడి' ఆశ్రమ గుమ్మంలో అడుగుపెట్టారు. పిల్లాణ్ణిచూసి రెండురోజులు గడిచింది. తల్లిప్రేమతో శకుంతల తల్లడిల్లిపోయింది. కొడుకును చూడాలన్న ఆత్రుతలో తల్లి శకుంతల కాళ్లు తడబడ్డాయి. మనవడిమీద ప్రేమతో అమ్మమ్మ మనసు పులకరించింది. అక్కడందరూ పిల్లలే. కొందరు ఉయ్యాలఒడిలో నిద్రపోతున్నారు. కొందరు బొమ్మలతో ఆడుకుంటున్నారు. మరికొంతమందిని ఆయాలు ఆడిస్తున్నారు. వారినిచూసి ఆ తల్లీ కూతుళ్ళు ఆశ్చర్యపోయారు.




ముందుగా తమ పసిగుడ్డుకోసం వెతుకుతున్నారు. ఒక ఉయ్యాల్లో పరుపుమీద పడుకుని పక్కన పాలసీసాతో నిద్రపోతున్న బిడ్డను చూసిన వాళ్ళ సంతోషానికి అంతులేదు. చక్కని బట్టలతో ఒంటినిండా పౌడరుతో బుగ్గన చుక్కతో చంద్రబింబంలావున్న పిల్లాణ్ణి చూసి మురిసిపోయారు. లాంఛనాలన్నీ పూర్తి చేసుకుని అక్కడ ఆయాలుగా చేరారు.

అప్పటినుంచి ఆ తల్లీకూతుళ్ళు ఆ పిల్లలందరినీ తమ పిల్లాడితో సమానంగా చూసుకుంటున్నారు.

"కొందరిని 'తారంగం! తారంగం తాండవ కృష్ణా తారంగం' అంటూ ఆడిస్తున్నారు. "చందమామ రావె జాబిల్లి రావె" అంటూ పాడుతూ అన్నాలు తినిపిస్తున్నారు.

"అమ్మముద్ద, నాన్నముద్ద, అక్కముద్ద.." అంటూ బువ్వ తినిపిస్తున్నారు. 'పప్పెట్టి/ బువ్వెట్టి/.... అత్తారింటి దారేదీ' అంటూ ఆడిస్తూ మురిసిపోతున్నారు. ఎవరూ చూడకుండా శకుంతల తనబిడ్డకు పాలిస్తోంది. మరికొంతమంది పసిగుడ్డులకూ పాలిస్తోంది.

'నిజంగా అది 'అమ్మఒడే' అని ఆ తల్లీ కూతుళ్ళు మురిసిపోతున్నారు.

ఒకరోజు 'పిల్లాడికి విపరీతమైన జ్వరం. మూసిన కన్ను తెరవకుండా మూలగడం మొదలుపెట్టాడు. డాక్టరమ్మ బిడ్డనుచూసి మందులిచ్చింది. ఆ తల్లీ కూతుళ్ళు కంటిమీద కునుకులేకుండా పిల్లాణ్ణి కాపాడుకున్నారు. క్రమంగా జ్వరంతగ్గి మామూలు స్థితికి వచ్చాడు బిడ్డ.

శకుంతలబిడ్డకు 'అమ్మఒడి' యాజమాన్యం ఆరోజు నామకరణోత్సవం జరిపించింది. 'సంతోష్' అని పేరుపెట్టారు. ఆ తల్లీకూతుళ్ళ ఆనందానికి అంతులేదు.

శకుంతల పిల్లల్ని పెంచడమేకాదు, ఆశ్రమ పరిసరాలు పరిశుభ్రంగా ఉంచుతోంది. పొద్దుటే వాకిలి చిమ్మి ముగ్గులుపెడుతోంది. సంక్రాంతి పండక్కి ఆశ్రమం ముందు శకుంతల పెట్టిన రంగురంగుల ముగ్గులు అందరినీ ఆకర్షించాయి. ఆగస్టు 15న స్వాతంత్ర్య దినోత్సవంనాడు ఆమె రంగులతో వేసిన రథం, జాతీయజెండా, గాంధీజీ బొమ్మల ముగ్గు అందరినీ ఎంతగానో ఆకట్టుకున్నాయి.

'అత్త, తాత, అమ్మ..' అంటూ పలుకుతుంటే పిల్లాడికి మాటలు నేర్పారు ఆ తల్లీకూతుళ్ళు. ఆరవ నెలలో అన్నప్రాసన చేశారు. వాడు పుస్తకం తీశాడు. బాగా చదువుకుంటాడని మురిసిపోయారు. అడుగులేస్తుంటే నడకలు నేర్పారు.

"నగరంలో ఎన్నో పిల్లల ఆశ్రమాలున్నాయి. కాని ఇలా పిల్లల్ని 'తల్లిఒడికి' చేర్చే ఆశ్రమాలు లేవు. ఇదంతా ఈ తేజమ్మ చలువే, ఆమె రుణం తీర్చుకోలేం' అనుకున్నారు తల్లీకూతుళ్ళు.

ఒకరోజు లతమ్మ వెంట సుందరమ్మ సరుకులు తేవడానికి వెళ్ళింది. అక్కడ హఠాత్తుగా కూతుర్ని మోసం చేసిన గిరిని చూసి ఆశ్చర్యపోయింది. సుందరమ్మను చూసి పరుగెత్తుకు వచ్చాడు గిరి.

"అత్తమ్మా! మీకోసం ఎంతో వెతికా! నేనెంతో తల్లడిల్లి పోయాను. బస్సు ప్రమాదంలో ఆరు నెలలు మంచమెక్కిననేను తిరిగి మనింటికి వచ్చా! మీరు లేరు. ఇదిగో ఇప్పుడిలా కలుసుకున్నాం" అని ఆమె రెండు చేతులూ పట్టుకుని ఏడ్చాడు.

"సుందరమ్మతోపాటు, అతని మాటలు నమ్మింది లత. అతన్ని ఇంటికి తీసుకువెళ్ళి తేజ ముందు నిలబెట్టారు. తేజ కూడా అతని మాటలు నమ్మింది.

శకుంతలను, కొడుకుని చూపించారు అతనికి. జరిగినదంతా వివరించారు.

చచ్చిపోవాల్సిన బిడ్డ బతికినందుకు గిరి సంతోషించాడు. శకుంతల, గిరి పెళ్ళి దగ్గరుండి జరిపించింది తేజ. పిల్లాణ్ణి వదిలి ఉండలేమని శకుంతల, గిరి దంపతులు దత్తత చేసుకున్నారు.

"ఈ అమ్మఒడే మన పిల్లాడిని తమఒడికి చేర్చిందని" మురిసిపోతూ తేజాకు నమస్కరించారు.

*సెల్: 98491 78196*

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'స్పాండిలోసిస్'కు సమర్థవంతమైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత మానవుని జీవన విధానంలోని పలు మార్పుల కారణంగా ఎక్కువ సమయం కంప్యూటర్ల ముందు కూర్చొని పని చేయడం, ఎక్కువ దూరం వాహనాలపై ప్రయాణించడం మొ॥ అనేక అంశాల కారణంగా వెన్నెముకపై ఒత్తిడి పెరిగి – చాలా రకాల వెన్నెముక సమస్యలు తలెత్తుతున్నాయి. వాటిలో 'స్పాండిలోసిస్'ను మనం ఎక్కువ మందిలో గమనించవచ్చు. మానవ శరీరంలో అత్యంత కీలకపాత్ర పోషించే 'వెన్నెముక' నిర్మాణం ఎంతో సంక్లిష్టమైనది. ఈ 'వెన్నెముక' – మెదడు నుండి వెలువడే వెన్నుపాము (Spinal Cord)ను నిరంతరం కాపాడుతూ, శరీర కదలికలన్నింటికీ సహకరిస్తూ, మొత్తం శరీరానికే ఒక మూలస్థంభంగా నిలుస్తుంది.



స్పాండిలోసిస్ అనగా: వెన్నెముకలోని డిస్కులు మరియు ఫేసెట్ జాయింట్లలోని మృదులాస్థి క్షీణతకు గురి కావడాన్ని వైద్యపరిభాషలో స్పాండిలోసిస్ అని అంటారు. దీనినే స్పైనల్ ఆర్థరైటిస్ అని కూడా అంటారు. 40 ఏళ్ళు పైబడిన వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. కానీ ప్రస్తుత జీవనశైలిలో అనేక మార్పులు చోటు చేసుకోవడం, వాటి ప్రభావం వెన్నెముకపై ఎక్కువగా ఉండటం కారణంగా ఈ సమస్య చిన్న వయస్సు వారిలో కూడా ఎక్కువగా కనిపిస్తోంది.

సాధారణంగా వెన్నెముకలోని రెండు పూసల మధ్య డిస్కులు ఉంటాయి, మరియు వాటి వెనుక భాగంలో ఫేసెట్ అనే జాయింట్లు ఉంటాయి. వీటిలోని మృదులాస్థి, వెన్నెముకకు సంబంధించిన అన్ని కదలికలకు సహకరిస్తూ, ఇవి ఒత్తిడిని తట్టుకునే షాక్ అబ్‌సార్బర్‌లుగా పని చేస్తాయి. వీటి చుట్టూ ఉండే కండరాలు, లిగమెంట్లు మరియు టెండాన్లు జాయింట్లను దృఢంగా ఉంచుతాయి. వెన్నుపూసలలోని నాళాన్ని స్పైనల్ కెనాల్ అంటారు. దీని నుండి వెన్నుపాము ప్రయాణిస్తూ నిర్దిష్ట ప్రాంతాలకు నరాలను పంపుతుంది.

ఏ కారణం చేతనైనా ఈ డిస్కులు లేదా ఫేసెట్ జాయింట్లు క్షీణతకు గురి అయినప్పుడు – వెన్నెముకలో అనేక మార్పులు ఏర్పడటంతో, నొప్పి కలగటం మరియు కదలికలు కష్టతరంగా మారడం వంటి సమస్యలు తలెత్తుతాయి. వాటి ప్రభావం వలన అక్కడ నుండి వెలువడే నరాలపై ఒత్తిడి పడితే ఆయా అవయవాల పనితీరు దెబ్బతిని తీవ్రమైన నొప్పి సంభవిస్తుంది. సాధారణంగా వెన్నెముకలోని మెడ భాగాన్ని – సర్వైకల్ స్పైన్, వీపు భాగాన్ని – తొరాసిక్ స్పైన్, నడుము భాగాన్ని – లుంబార్ స్పైన్ మరియు క్రింది భాగాలను – సాక్రం, కాకిక్స్ అని అంటారు. క్షీణతకు గురి అయిన ప్రాంతాన్ని బట్టి ఈ సమస్యను సర్వైకల్ స్పాండిలోసిస్, తొరాసిక్ స్పాండిలోసిస్, లుంబార్, సాక్రల్ స్పాండిలోసిస్ అని పిలవటం జరుగుతుంది. వీటిలో సర్వైకల్ స్పాండిలోసిస్ మరియు లుంబార్ స్పాండిలోసిస్ సమస్యలను మనం ఎక్కువగా గమనించవచ్చు.

**కారణాలు:** వయస్సు పైబడటం • వెన్నెముకకు దెబ్బ తగలటం • ఎక్కువగా బరువులు మోయడం • ఒకే పొజిషన్‌లో ఎక్కువ సమయం కూర్చోవడం • ద్విచక్ర వాహనాలపై ఎక్కువగా ప్రయాణించడం • కంప్యూటర్ల పైన రోజంతా పని చేయడం • ఎత్తయిన దిండ్లు వాడటం మరియు మాట్లాడేటప్పుడు మెడను సాగదీసి ఒక ప్రక్కకు వంచడం వలన మెడనొప్పి కలుగుతుంది.

**లక్షణాలు:** 'స్పాండిలోసిస్' సంబంధిత లక్షణాలు, శరీరంలో అది ప్రభావితం చేసిన భాగాన్ని బట్టి కనిపిస్తాయి.

సర్వైకల్ స్పాండిలోసిస్:

- మెడనొప్పి సాధారణం నుండి తీవ్రస్థాయికి చేరటం.
- నొప్పి – భుజాలతో పాటు చేతులకు మరియు వ్రేళ్ళ వరకు కూడా వ్యాపించడం.
- మెడ బిగుసుకుపోవడం లేదా కదలికలు తగ్గిపోవడం.
- మెడ నరాలపై ఒత్తిడి పడటం వలన చేతులు బలహీనపడటం, పట్టు కోల్పోవడం, తిమ్మిర్లు, మొద్దుబారటం వంటి లక్షణాలను గమనించవచ్చు.
- కొన్ని సార్లు తలనొప్పి, కళ్ళు తిరగడం, వికారం, వాంతులు కావడం వంటి లక్షణాలు గమనించవచ్చు.

లుంబార్ స్పాండిలోసిస్:

- నడుము నొప్పి, ఉదయాన్నే నడుము బిగుసుకుపోవడం.
- నొప్పి నడుము నుండి పిరుదులకు మరియు కాళ్ళ వరకు వ్యాపించడం.
- నడుము భాగంలోని నరాలపై ఒత్తిడి పడటం వలన కాళ్ళలో తిమ్మిర్లు, మొద్దుబారటం, నడకలో బ్యాలెన్స్ తప్పడం, మలమూత్రాల విసర్జనపై నియంత్రణ కోల్పోవడం.
- సయాటికా వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు.
- వెన్నెముకలోని ఏ భాగంలోనైనా దీర్ఘకాలిక నొప్పి కారణంగా జ్వరం, ఆకలి మందగించడం, బరువు తగ్గడం వంటి లక్షణాలు కనిపిస్తే వాటిని నిర్లక్ష్యం చేయకూడదు. అవి క్యాన్సర్ లేదా క్షయ లక్షణాలు కావచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఎక్స్‌రే, సి.టి. స్కాన్, ఎమ్.ఆర్.ఐ. స్కాన్, హెచ్.ఎల్.ఏ.బి.27 • చేతులు, కాళ్ళ కదలికలను మరియు రిఫ్లెక్సస్‌ను పరీక్షించడం వంటి పరీక్షలు చేయడం ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా రోగి మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని చికిత్స అందించడం ద్వారా వెన్నెముకను దృఢంగా చేసి, తద్వారా స్పాండిలోసిస్ సమస్య తిరగబెట్టకుండా వ్యాధిని సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in



# శశికళకు తొందర ఎక్కువ!

**జయలలిత ఇంటి వ్యవహారాలు చూసే శశికళ తమిళనాడు ముఖ్యమంత్రి పదవిని ఆశించడం చిన్న విషయమేమీ కాదు. ఆమె ఇంతవరకూ ఏ రాజ్యాంగ పదవినీ నిర్వహించలేదు. ఎటువంటి ప్రభుత్వ, పార్టీ బాధ్యతలూ నిర్వహించలేదు.**

పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చె...అన్నట్టుగా శశికళ, పన్నీర్ సెల్వంల పోరును సుప్రీంకోర్టు తీర్చింది. ముఖ్యమంత్రి కావాలన్న శశికళ ఆశకు సుప్రీం కోర్టు తెరదించింది. జయలలిత సాహచర్యంలో శశికళ మొదటి నుంచీ కబ్జాలు, దురాక్రమణలతోనే జీవితం గడిపినట్టు తమిళనాడు ప్రజలు చెప్పుకుంటుంటారు. ఈ స్థలాలు, ఇళ్లు, భూముల కబ్జాను చాలా కాలంగా జయలలిత కూడా భరిస్తూ వచ్చారు. అనేక పర్యాయాలు జయలలితకు సైతం విసుగొచ్చి ఆమెను ఇంటి నుంచి బహిష్కరించారు. శశికళ తానే కాదు, తన బంధువులకు సైతం ఈ విషయంలో కావాల్సినంత స్వేచ్ఛ ఇచ్చారు. భూములు, ఇళ్లతో తృప్తి పడని శశికళ పదవులపై కూడా కన్నేశారు. జయలలిత సన్నిహితులు, బంధువులు చెప్పిందాని ప్రకారం, జయలలిత అనారోగ్యానికి గురై ఆస్పత్రి పాలయిన దగ్గర నుంచీ ఆమె జయలలిత పదవిని కబ్జా చేయడానికి కూడా చాటు మాటున ప్రయత్నిస్తున్నారు. జయలలిత మరణానంతరం జయ అధికార నివాసమైన పొయెస్ గార్డెన్‌ను కూడా శశికళ కబ్జా చేశారు. చివరికి జయ నిర్వహించిన పార్టీ పదవి, ముఖ్యమంత్రి పదవి మీద కూడా ఆమె కన్ను పడింది. పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని చేజిక్కించుకున్న తరువాత ఇక ముఖ్యమంత్రి పదవే మిగిలి ఉందని ఆమె భావించారు.

జయలలిత ఇంటి వ్యవహారాలు చూసే శశికళ తమిళనాడు ముఖ్యమంత్రి పదవిని ఆశించడం చిన్న విషయమేమీ కాదు. ఆమె ఇంతవరకూ ఏ రాజ్యాంగ పదవినీ నిర్వహించలేదు. ఎటువంటి ప్రభుత్వ, పార్టీ బాధ్యతలూ నిర్వహించలేదు. ఆమె జయలలితకు ముప్పయ్యేళ్ల పాటు సహాయకురాలు మాత్రమే. ఆమెకు ఎటువంటి రాజకీయ అనుభవమూ లేదు. దేశంలో రెండవ అతిపెద్ద ఆర్థిక వ్యవస్థగా పేరున్న తమిళనాడుకు ముఖ్యమంత్రి కావడమంటే మాటలు కాదు. ఆమె పెద్దగా చదువుకోలేదు. ప్రజా సంబంధాలు కూడా తక్కువే. జయలలిత ఇంటిమనిషికి ముఖ్యమంత్రి పదవిని కట్టిబెట్టడం సమంజసంగా లేదనీ, ప్రజలు ఇటువంటి మార్పు కోసం అన్నా డీఎంకెకు ఓటు వేయలేదనీ డీఎంకె నేత ఎం.కె. స్టాలిన్ ఇప్పటికే వ్యాఖ్యానించారు. శశికళ పట్ల వ్యతిరేకత రాను రానూ పెరిగిపోతోంది. చివరికి సోషల్ మీడియాలో కూడా శశికళకు వ్యతిరేకంగా వ్యాఖ్యానాలు వెల్లువెత్తాయి.

నిజానికి అన్నాడీఎంకెకు గానీ, శశికళకు గానీ ప్రత్యామ్నాయం లేదు. జీవించి ఉండగా జయలలిత అటు పార్టీలోగానీ, ఇటు ప్రభుత్వంలో గానీ ద్వితీయ శ్రేణి నాయకులు లేకుండా చేశారు. తన వారసులెవరో కూడా ఆమె ఏనాడూ బయటికి చెప్పలేదు. అటు పార్టీ పదవినీ, ఇటు ముఖ్యమంత్రి పదవినీ అతి వేగంగా భర్తీ చేయాల్సిన పరిస్థితి జయ మరణంతో ఏర్పడింది. జయలలితకు దాదాపు మూడు దశాబ్దాలుగా స్నేహితురాలిగా ఉన్న శశికళ ఆ పదవులను వెంటనే తన తోనే భర్తీ చేయాలనుకున్నారు. తాను స్వయంగా ఈ రెండు పదవుల్లోనూ ఆసీనురాలు కావడం పార్టీ భవితవ్యం రీత్యా అనివార్యమని ఆమె భావించారు. కానీ, ఇంత త్వరగా ఈ రెండు సీట్లకూ పోటీపడి, తాపత్రయపడి ఆమె పొరపాటు చేశారు. పార్టీ పగ్గాలు చేపట్టిన తరువాతయినా ఆమె కొంతకాలం నిరీక్షించాల్సింది. అసలు ఆమె పార్టీని నడిపించగలరా లేదా అన్నదే తేలని స్థితిలో ఆమె ముఖ్యమంత్రి పదవి ఆశించారు. ముందుగా ఆమె పార్టీ శ్రేణులకు సన్నిహితం కావాలి. పార్టీ నాడి తెలుసుకోవాలి. అన్నిటికంటే ముఖ్యం ప్రజలకు సన్నిహితం కావాల్సి ఉంది. ఇప్పుడిక వీటన్నిటికీ నాలుగేళ్ల కాలం పడుతుంది. ఆమె నాలుగేళ్లు జైలులో కటకటాలు లెక్కపెట్టడం తప్ప మార్గం లేదు.

### అత్యాశకు మారుపేరు

ప్రస్తుతం అనిశ్చితి ఆమె ముందు నిలిచి ఉంది. జయలలిత మాదిరిగా తమిళనాడును పాలించడం తమాషా కాదు. ప్రజల ఆమోదం లభించాల్సి ఉంది. దేశంలో తమిళనాడు అతి ముఖ్యమైన రాష్ట్రం. విదేశీ పెట్టుబడుల్లోనూ, మానవ వనరుల్లోనూ అగ్రస్థానంలో ఉన్న తమిళనాడు మరింత ముందుకు పోవాలంటే జయలలితను మించిన శక్తిసామర్థ్యాలు శశికళకు కూడా ఉండాలి. ఇక డీఎంకె వంటి ప్రతిపక్షాలను డీకొనాలంటే, ఎంతో రాజకీయ చతురత, వ్యూహ, ప్రతివ్యూహాలు అవసరం. అవన్నీ శశికళకు ఉన్నాయా లేదా అన్నది ఎవరికీ అంతుబట్టని

విషయం. డీఎంకే అధినేత కరుణానిధి వంటి అపర చాణక్యుణ్ణి ఎదుర్కోవడం ఊహించలేం. అందుకు కొన్నేళ్లు పడుతుంది. పార్టీని ఒక్క తాటి మీద నడిపించడం కూడా రాజకీయ అనుభవం లేని శశికళకు కష్టమే. ఈ కారణాల వల్ల ఆమె ముఖ్యమంత్రి పదవి చేపట్టడానికి మరీ తొందర పడ్డారనుకోవాలి. అయితే, ఆమె భయాలు ఆమెకు ఉన్నాయి. జయలలిత మృతితో పార్టీ షాక్‌లో ఉంది. ఆ షాక్ నుంచి కోలుకుందంటే పార్టీ పరిస్థితి ఏమిటో ఊహించలేం. పార్టీ ఎవరిని కోరుకుంటుందో చెప్పలేం. ఈ సంగతి శశికళకు బాగా తెలుసు. ఇక ఆమె మీద ఉన్న కేసులు ఏ మలుపులు తిరుగుతాయో చెప్పలేం. ముఖ్యంగా ఆదాయాన్ని మించిన ఆస్తుల కేసు తన మెడకు చిక్కుకుంటుందని ఆమెకు తెలుసు. ఈ కేసు నిరూపణ అయింది కనుక ఆమె ముఖ్యమంత్రి పదవికి అనర్హురాలైపోయారు. అయితే, రాష్ట్ర యంత్రాంగం తన చేతిలో ఉంటే ఈ కేసులు ఎదుర్కోవడం తనకు అంత కష్టం కాకపోవచ్చని ఆమె భావించి ఉంటారు. అందుకే తొందర పడ్డారు.

నిజానికి అటు పార్టీలోనూ, ఇటు ప్రభుత్వంలోనూ శశికళను అభిమానించేవారి సంఖ్య అత్యల్పం. జయలలిత జీవించి ఉండగా, ఆమె రాజ్యాంగ అతీత శక్తిగా వ్యవహరించేవారని, మంత్రుల్ని, శాసన సభ్యుల్ని, అధికారుల్ని, పార్టీ నాయకుల్ని చాలా చిన్న కారణాల మీద కూడా బెదిరించడం, అదిలించడం వంటివి చేసేవారని పార్టీ నాయకులు చెబుతుంటారు. విచిత్రమేమిటంటే, ఆ సంగతి జయలలితకూ తెలుసు. శశికళ తన అండ చూసుకుని బయట అధికారం చెలాయిస్తున్నారని, అక్రమాలకు పాల్పడుతున్నారని, శశికళ అండ చూసుకుని అమె బంధువులు కూడా అక్రమాలకు పాల్పడుతున్నారని జయలలితకు అర్థమైపోయింది. ఈ విషయాలు ఆమె దృష్టికి రావడంతో మూడు నాలుగు సార్లు ఆమె శశికళను తన నివాసం నుంచి బయటికి పంపేశారు. మందలించారు. పార్టీకి దూరంగా ఉంచేందుకు 'విశ్వ'ప్రయత్నం చేశారు. అయినా శశికళ ఆగడాలు ఆగలేదు. శశికళను చూపెట్టుకుని. తమిళనాడులోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చి చెన్నైలోనే తిష్ఠ వేసిన బంధువులది ఆడిందల్లా ఆట, పాడిందల్లా పాట అయిపోయింది.

అయినా ఆమెను జయలలిత ఎందుకు ఉపేక్షించారు? శశికళను, ఆమె బంధువులను ఉపేక్షించడమే ఇప్పటి రాజకీయ సంక్షోభానికి కారణమయింది. అసలు శశికళ అరాచకాల కారణంగానే జయలలిత కూడా కోర్టుల చుట్టూ తిరగాల్సి వచ్చిందని కూడా పార్టీ నాయకులు చెబుతుంటారు. జయలలిత పాలనా సామర్థ్యం గొప్పదే కావచ్చు. ఆమె తమిళనాడులో చాలామంది ప్రజలకు, పార్టీ కార్యకర్తలకు ఆరాధ్యదైవమే కావచ్చు. కానీ మనం ఇక్కడ కొన్ని కఠిన సత్యాలు కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ఆమె తన చుట్టూ చేరిన వందిమాగధులను ప్రోత్సహించారే తప్ప ఏనాడూ వారి పుట్టుపూర్వోత్తరాల జోలికి పోలేదు. తన చుట్టూ చేరి అక్రమాలకు, అన్యాయాలకు పాల్పడుతున్న భజనపరులు ఎవరన్నది చివరి వరకూ రహస్యంగానే ఉండిపోయింది. ఇప్పుడు అటువంటి వారి కారణంగానే రాష్ట్ర రాజకీయాలు అల్లకల్లోలంగా మారిపోయాయి.

### అంత సాహసమా?

జయలలిత జీవించి ఉండగా ఒక్కరంటే ఒక్కరు కూడా ఆమె వైపు వేలెత్తి చూపించడానికి సాహసించలేదు. ఆమె కనుమూసిన మరుక్షణం నుంచి ఆమె మీద ఉన్న ఆగ్రహాన్ని, ఆమె సన్నిహితురాలు శశికళ మీదున్న ఆగ్రహాన్ని శశికళ మీదే వెళ్లగక్కుతున్నారు. జయలలిత మరణం గురించి అడగడం తమ రాజ్యాంగ హక్కు అన్నట్టుగా సీనియర్ అన్నాడీఎంకే నాయకులు ప్రకటనలు గుప్పిస్తున్నారు. ఆమె మరణం గురించి ప్రశ్నించడం తమ బాధ్యత అని వారు భావిస్తున్నారు. జయలలిత బతికి ఉన్నప్పుడు వారు ఆమె అనారోగ్యం గురించి, ఆమెకు అందుతున్న చికిత్స గురించి, ఆమెకు సేవ చేయడంలో శశికళ పోషిస్తున్న పాత్ర గురించి ఒక్కరంటే ఒక్కరు కూడా చివరికి శశికళను కూడా ప్రశ్నించే సాహసం చేయలేదు! విచిత్రంగా, ముఖ్యమంత్రి పదవిలో ఉన్న పన్నీరు సెల్వం కూడా అందుకు సాహసించలేదు.

**ముప్పైయేళ్లపాటు జయలలిత ఇంటి వ్యవహారాలు చక్కబెట్టిన శశికళ రాజ్యాంగ అతీతశక్తిగా వ్యవహరించారు. మంత్రుల్ని, ప్రజాప్రతినిధుల్ని బెదిరించేవారు. ఇవన్నీ భరించలేక మూడునాలుగుసార్లు జయలలిత ఆమెను ఇంటినుంచి బైటకు పంపేశారు కూడా. ఇప్పటివరకు శశికళ ఏ రాజ్యాంగ పదవీ నిర్వహించలేదు. మరి ఆమె ఏకంగా జయలలిత సీటు భర్తీచేసే సాహసం చేశారెందుకు?**



జయలలిత మరణించిన రెండు నెలలకు, శశికళ మీద రాళ్లు పడడం ప్రారంభమైన తరువాత ఒక్కొక్క నాయకుడూ నోరు తెరిచి శశికళను తప్పుపట్టడం ప్రారంభించారు. వారంతా సుప్రీం కోర్టు తీర్పు కోసం కూడా వెయ్యి కళ్లతో ఎదురు చూశారు. సుప్రీం కోర్టు తీర్పు శశికళకు వ్యతిరేకంగా వస్తే మరింతగా విజృంభించి ఆమెను విమర్శించవచ్చని వారంతా నిరీక్షించారు. కోర్టు తీర్పు ఆమెకు ప్రతికూలంగా వచ్చింది కనుక ఇక ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చుప్!... ఒకవేళ గవర్నర్ గనుక శాసనసభలో బల నిరూపణకు అవకాశమిచ్చే పక్షంలో పరిస్థితిలో మార్పు రావచ్చు. ప్రజాప్రతినిధులు గాలివాటాన్ని బట్టి ఓటు వేసి, మద్దతు ప్రకటించి, విషమ పరిస్థితి నుంచి బయటపడే ప్రయత్నం చేసే అవకాశం ఉంది. జయలలిత పాలన తీరును సుమారు మూడు దశాబ్దాలుగా సన్నిహితంగా గమనిస్తున్న శశికళ ఒకవేళ అధికారం చేపడితే సాధారణంగా జయలలిత మాదిరిగానే పాలించే అవకాశం ఉంది.

పార్టీ ప్రధాన కార్యదర్శి పదవి చేపట్టిన శశికళ ముఖ్యమంత్రి పదవికి అప్పుడే ఆశపడకుండా ఉండాల్సింది. సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చేవరకూ ఆగి ఉంటే ఇంతటి రాజకీయ సంక్షోభానికి ఆస్కారముండేది కాదు. కోర్టు తీర్పు తనకు అనుకూలంగా ఉంటే తనే ముఖ్యమంత్రి కావచ్చు. తనకు వ్యతిరేకంగా ఉన్నా కూడా పన్నీరు సెల్వంనే ముఖ్యమంత్రిగా కొనసాగిస్తూ, తాను జయలలిత మాదిరిగానే తెరవెనుక నుంచి నడిపించవచ్చు. పార్టీ ప్రధాన కార్యదర్శి పదవి, ముఖ్యమంత్రి పదవి ఒకరి దగ్గరే ఉండాలన్న అన్నాడీఎంకే సూత్రం జయలలితకు నప్పి ఉండొచ్చు. కానీ మారిన రాజకీయ పరిస్థితుల్లో ఈ సూత్రం శశికళకు నప్పదు. ఈ సూత్రం ప్రాముఖ్యం కోల్పోయి ఉండొచ్చనే వాస్తవాన్ని శశికళ అర్థం చేసుకుని ఉంటే బాగుండేది. పార్టీ ప్రధాన కార్యదర్శి పదవితో ఆమె ముఖ్యమంత్రిని కూడా అదుపాజ్ఞల్లో ఉంచగలిగి ఉండేవారు. సుప్రీం కోర్టు ఇచ్చే ప్రతికూల తీర్పుతో ముఖ్యమంత్రి పదవైనా పోవచ్చు కానీ, ప్రధాన కార్యదర్శి పదవి పోదు కదా! అతిగా ఆశపడ్డందుకు ఆమె ఇప్పుడు అన్నీ కోల్పోయి, రాజకీయంగా దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. ఒకవేళ ఆమెకు సంబంధించిన వ్యక్తి ముఖ్యమంత్రి పదవిని అధిష్ఠించినా, ప్రజల సానుభూతి మాత్రం పన్నీర్ సెల్వంకు మాత్రమే ఉంటుందనడంలో సందేహం లేదు.

21

# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**నంది పొదల మధ్య దూరుతూ వెళ్తున్నాడు. దారిని సమీపించేకొద్దీ ఏవో శబ్దాలు లీలగా వినవస్తున్నాయి. సన్నగా గంటల చప్పుడు! నంది మరికొంచెం ముందుకు వెళ్ళి, చెవులు రిక్కించాడు. అడ్డుగా ఉన్న పొదను తప్పిస్తూ, పొదచాటున దాక్కుంటూ కాలిబాట వైపు చూస్తూ ఉండిపోయాడు. ఇప్పుడు మాటలు లీలగా వినిపిస్తున్నాయి.**

కొన్ని క్షణాలలో స్త్రీ పురుషుల కంఠాలు వినిపించసాగాయి. ఆ మాటల వెంటే ఒక పురుషుడూ, ఒక స్త్రీ అతని దృష్టి కోణంలోకి వచ్చారు. పురుషుడి చేతిలో ఒక తాడు ఉంది. దానిని భుజం మీదుగా వేసుకుని, లాగుతూ నడుస్తున్నాడతను. స్త్రీ మెడలోంచి ఒక చిన్న డోలు వేళ్ళాడుతోంది. గంటల సవ్వడి వాళ్ళిద్దర్నీ వెంటాడుతోంది.

“అర్థం చేసుకో... ఈ ముసలెద్దును లాక్కుంటూ ఊరూరా తిరగడం ఇక నా వల్ల కాదు! ఆ!” పురుషుడు అంటున్నాడు. “ఆడీ ఆడీ అలిసిపోయింది. ఇంకొక ఆర్నెల్లో, ఏడాదో అంతే! అమ్మిపారేసి, వేరే వృత్తి చూసుకుందామే!”

“ఏంటో నీ వరస... ఎద్దుని ఆడించలేనోడివి.. ఏం పని జేస్తావ్?” స్త్రీ అంది.

నంది వాళ్ళతో పాటు పొదల మాటున చప్పుడు చేయకుండా కదుల్తున్నాడు. ఇప్పుడు నెమరు వేసుకుంటూ వాళ్ళ వెంట నడుస్తోన్న ఎద్దు నందికి కనిపిస్తోంది. మెడలో గంటలు మ్రోగుతున్నాయి. దాని కొమ్ములకు కింది నుండి మొనల దాకా రంగురంగుల గుడ్డలు చుట్టి ఉన్నాయి. మూపురం మీద నుండీ తోక దాకా రంగురంగుల గుడ్డలూ, బొంతలూ కప్పి ఉన్నాయి. ఎత్తుగా ఉన్న గంగిరెద్దు! మూపురం కొద్దిగా పక్కకు వాలి ఉంది. ఉన్నట్టుండి గంగిరెద్దు తల నంది వైపు తిరిగింది. తన ఉనికిని అది పసిగట్టిందా?

గంగిరెద్దు ముఖం మీదా, కొమ్ముల మధ్య భాగంలో కుంకుమ, పసుపు దట్టించి ఉన్నాయి. కుంకుమ కింద త్రికోణాకారంలో అల్లిన తెల్లటి చిన్న చిన్న గవ్వలు మెరుస్తున్నాయి.

“గంగిరెద్దు రాముణ్ణి మా అయ్య నీకు కట్నంగా ఇచ్చాడు గద! కట్నాన్ని అమ్ముకుంటావా?” స్త్రీ ప్రశ్నించింది.

“ఈ ఎద్దును ఆడించలేక నేనూ, ఆ డోలు వాయించలేక నువ్వూ ఎంత కష్టపడిపోతున్నామో చూడు! ఎండనకా, వాననకా, తిరగాలా! చెట్టు కాడా, పుట్ట కాడా కూడు వండుకోవాలా? నా ఇల్లాలు కష్టపడిపోతూంటే నా కడుపు తరుక్కుపోతోందే మల్లీ! పైగా నువ్వు వట్టి మనిషివి కూడా కావు...”

నంది మస్తిష్కంలో ఏవో ఆలోచనలు చెరువులో చేప పిల్లల గెంతులు వేస్తున్నాయి. గంగిరెద్దు దంపతుల మాటలూ, గంగిరెద్దు మెడ గంటల చప్పుడూ అతని చెవులకి ఆనడం లేదు. ఆ దంపతులలో భర్త మాటలు నందిలో కొత్త ఆలోచనలు రేపుతున్నాయి. వాళ్ళిద్దరి స్థానాలలో తనూ, లాలసా ఉంటే? వాళ్ళిద్దరి వేషాలతో పాత్ర పోషణ చేస్తే? వంద మంది కళింగరత్నలూ, వెయ్యిమంది ఉలూకులూ తమను పట్టుకోలేరు! ఔను! వేషాలు మార్చాలి. సరికొత్త పాత్రలు ధరించి, సమర్థవంతంగా పోషించాలి.

ఇది తాను ఊహించని సన్నివేశం. ఎదురు చూడని మలుపు. ఆశించని అవకాశం. కేవలం యాదృచ్ఛికంగా అంది వచ్చిన అవకాశం. అంది వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకోవడంలోనే వెల్లడవుతుంది మనిషి విజ్ఞత! సందేహం లేదు; తన ఆలోచనల్లో ఆవిష్కరించబడుతున్న వేషాలు లాలసకూ తనకూ దుర్భేద్యమైన రక్షాకవచాలు! ఆ కవచాలను ఇద్దరూ ధరించాలి.

నందిలో మొలకెత్తిన ఆలోచన నిర్ణయంగా



ఎదిగింది. నిర్ణయం అతన్ని ఆచరణవైపు నడిపించింది. నంది పొదల మధ్య వేగంగా నడుస్తూ ముందుకు వెళ్ళసాగాడు. తన నడక చప్పుడు చేస్తుందన్న బెదురు ఇప్పుడు నందిలో లేదు. దారిలో నడుస్తున్న గంగిరెద్దు దంపతులను దాటి, దారి పక్కనున్న పొదల్లోనే ముందుకు వెళ్ళాడతను. వెంటనే పొదలచాటు నుండి అవతలికి చేరుకుని, గంగిరెద్దు దంపతులకు అభిముఖంగా దారిలో నిలుచున్నాడు.

"ఏనాడు నా మాట విన్నావు? మాట చెవిన పెట్టి ఉంటే బతుకులు ఎప్పుడో బాగుపడేవి" స్త్రీ దెప్పుతూ అంటోంది. "నీ ఇష్టం మామా! నాక్కావాల్సింది ఇంత తిండీ, గుడ్డా. ఎలాగా ఇల్లు అనేది..." దారిలో నిలుచున్న నంది కంటపడగానే ఆమె మాటలు పూర్తి చేయకుండా మింగేసింది.

గంగిరెద్దు పురుషుడు నంది వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ, నడకలో వేగం తగ్గించాడు. అతని చూపులు నంది చేతులను చూస్తున్నాయి, సాయుధుడా? నిరాయుధుడా? నిర్ధారించుకోవడానికి.

నంది అతన్నే చూస్తున్నాడు. తెల్లటి చుక్కలున్న ఎర్రటి తలపాగా, కనుబొమల మధ్య గీతలాగా అవుపిస్తున్న సన్నటి ఎర్రటి నామం, కోర మీసాలు, తాంబూల చర్వణంతో ఎర్రగా మెరుస్తున్న పెదవులు... మనిషి పొడవుగా, దృఢంగా ఉన్నాడు. రెండు పొడుగాటి ఉత్తరీయాలు ఒకదాని మీద ఒకటి మెడమీద నుంచీ కిందకి, కంఠానికి రెండు వైపులా వేళ్ళాడుతున్నాయి.

అతని భార్య మల్లి పెద్ద పెద్ద కళ్ళతో తననే చూస్తున్నట్టు నంది గమనించాడు. గుండ్రటి ముఖం పూర్తిగా పసుపురాసి ఉంది. వెడల్పాటి బొట్టు.. బొద్దుగా ఉందామె. చురుకుగా తగుల్తున్న సూర్య రశ్మి ఆమె ముఖాన్ని చెమట పూసలతో అలంకరించింది. నంది ఇద్దరినీ చిరునవ్వుతో చూశాడు. "నమస్కారం గంగిరెద్దన్నా!"

గంగిరెద్దు వ్యక్తి అప్రయత్నంగా నమస్కారం చేశాడు. ఎదురుగా నిలుచున్న యువకుడు దారి దోపిడీగాడు కాదని అనిపిస్తోందతనికి.

"నా పేరు శరభయ్య" అన్నాడతను. తనను 'ఎద్దన్నా' అంటున్న నందిని తదేకంగా చూస్తూ.

"ఏ ఊరు మనది?" నంది అడిగాడు.

"నీది ఏ ఊరు?" శరభయ్య ఎదురు ప్రశ్న వేశాడు.

"ఆనందసాగరం పొలిమేరలో ఉన్న చిన్న పల్లెటూరు.."

"పేరు?"

"శివనందుడు" నంది కొత్త పేరు చెప్పాడు.

"ఇక్కడేం చేస్తున్నావు?" దగ్గరగా ఆగుతూ అడిగాడు శరభన్న.

"నాదీ నీ వృత్తే శరభన్నా. నా గంగిరెద్దు బాగా ముసలిది. పోయిన వారం పోయింది. కడుపు నిండాలంటే మరొక ఎద్దు కొనాలిగా! అందుకని పల్లెటూళ్ళలో గాలిస్తూ బయలుదేరాను.."

"అట్టాగేం?"

"అవునన్నా. అలసటగా ఉంటే కాసేపు ఆ చెట్టు నీడలో నడుం వాల్చాను. ఇంతలో నీ మాటలు వినిపించాయి, వెతుకుతున్న ఎద్దు ఎదురుగా వస్తోందనుకుంటూ లేచి వచ్చాను! ఎద్దును అమ్ముతావా?" గంగిరెద్దును పరిశీలనగా చూస్తూ అడిగాడు నంది.

"సరైన ధర వస్తే అమ్మేయడమే!" శరభన్న తెలివిగా అన్నాడు.

### జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగ రత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. ఆమెను కాపాడతానని మాటిస్తాడు నంది. కళింగరాజ్యం నుంచి నిష్క్రమిస్తారు నంది, లాలస. మార్గంలో ఎదురవుతున్న ఆపదలు తప్పించుకుంటూ, సారంగ రాజ్యంలోకి ప్రవేశిస్తారు. ఆతిథ్య సుంకం చెల్లించి నగరంలోకి ప్రవేశిస్తారు. సుంకరి సుధాముడు వీళ్ళ విషయాన్ని రాజు సారంగసేనుడికి తెలియజేస్తాడు. వాళ్ళను బంధించటానికి మత్తు మందు ప్రయోగించమని అన్నసత్రంలో చెప్పి వస్తాడు సుధాముడు. చాటునుంచి వారిమాటలు విన్న నంది, లాలససహా అక్కడినుంచి మెల్లగా నిష్క్రమించి, మళ్ళీ అడవిదారి పడతాడు. ఆ తర్వాత....

నంది మాట్లాడకుండా రొంటిన ఉన్న చిన్న సంచీ తీశాడు. అందులో ఉన్న వరహాల్ని అరచేతిలో పోసుకున్నాడు. నాణేల గలగలను ఆసక్తిగా వింటూ శరభయ్య కళ్ళు పెకిలించుకుని చూస్తున్నాడు. నంది ఒక్కొక్క నాణేన్ని సంచిలోకి జారవిడుస్తూ లెక్కిస్తున్నాడు. లెక్కపెట్టడం ముగించి శరభయ్య వైపు చూశాడు.

"నీ గంగిరెద్దు విలువ నాకు తెలీదు. నువ్వు చెప్పే వెల ఎంతో నాకు తెలీదు, అవసరం లేదు. నా వద్ద పది వరహాలున్నాయి. పదీ ఇచ్చేస్తా!"

"పది వరహాలా?" శరభయ్య ఆశ్చర్యంగా అన్నాడు. అతని ముఖం, అతని కళ్ళూ, వ్యక్తం చేస్తున్న ఆశ్చర్యంలో 'అంత తక్కువా?' అన్న భావం లేదు. 'అంత ఎక్కువా?" అన్న భావం ఉంది.

ఆ ఆశ్చర్యభావం నందికి అర్థమైంది. అతను గంగిరెద్దు దంపతులను కలియజూశాడు. భార్య ముఖంలో అసంతృప్తి లీలగా కనిపిస్తోంది. గంగిరెద్దును విక్రయించడం ఆమెకి ఇష్టం లేదుగా!

"ఔను. పది వరహాలు ఇచ్చేస్తాను. అయితే ఒక నిబంధన. మీ గంగిరెద్దు రాముడు ఎలా ఉన్నాడో అలాగే ఇచ్చివేయాలి. దాని మీద ఉన్న గుడ్డలూ, బొంతలూ అన్నీ. అలాగే నువ్వు కట్టుకున్న వస్త్రాల్లాంటి వస్త్రాలూ, తలపాగా అన్నీ కావాలి నాకు."

"ఎందుకూ?"

"భలేవాడివే శరభన్నా! తిరుగు ప్రయాణంలో తగిలే ఊళ్ళల్లో ఎద్దును ఆడించుకుంటూ, సంపాదించుకుంటూ సొమ్ము చేసుకోవాలిగా!"

శరభయ్య కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "ఎద్దు మీద ఉన్న అసిమి కూడా ఇచ్చేయాలా?"

"అసిమి అంటే ఏంటి?" నంది అడిగాడు.

"అది తెలీదా? ఎద్దు వీపు మీదుగా రెండు వైపులా వేళ్ళాడే సంచి. అమ్మలక్కలు ఇచ్చే ధాన్యం అందులోనేగా వేసుకుంటాం?" శరభయ్య అన్నాడు.

"ఓ...ఆ అసిమా! కావాలిగా? కావాలంటే అందులో ఉన్న ధాన్యం తీసుకో! అది నీ కష్టార్జితమే కదా!" నంది తేలిగ్గా అన్నాడు.

శరభయ్య ప్రశ్నార్థకంగా భార్య వైపు చూశాడు. ఆమె పెదవి విప్పలేదు. నవ్వలేదు. తల ఆడించ లేదు. నంది ఆ దంపతుల దగ్గరగా నడిచాడు. పిడికిలి బిగించిన కుడిచేతిని తెరిచాడు. అరచేతిలో ఉన్న బంగారు నాణెం ఎండలో తళుక్కుమంది.

"ఈ వరహా నీకు పుట్టబోయే బిడ్డకు! తీసుకుని, దాచుకోమ్మా!" అంటూ నాణేన్ని మల్లి వైపు చాచాడు.

తీసుకోనా? అన్నట్టు మల్లి, శరభయ్య వైపు వాలుగా చూసింది.

"తీసుకోమ్మా! నీ కొడుకు పుట్టకముందే కష్టం లేకుండా సంపాదిస్తున్నాడు! అదృష్టవంతుడవుతాడు! తీసుకో!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"తీసుకో మల్లీ...అంత ఇదిగా ఇస్తున్నాడు పాపం!" శరభయ్య సంతోషంగా హెచ్చరించాడు. ఆమె తీసుకుంటే విక్రయాన్ని అంగీకరించినట్టే! ముందు ముందు దెప్పులూ, అవీ ఉండవు!

మల్లి చేతిని చాచి, అరచేతిని తెరిచింది. నంది వరహాను ఆమె చేతిలో పెట్టాడు. శరభయ్య వైపు చూశాడు. ఎడమచేతిలోని వరహాల సంచిని కుడిచేతిలోకి మార్చుకుని గల్లు గల్లుమనిపించాడు. "నీ పది వరహాలు ఇందులో ఉన్నాయి శరభన్నా! లెక్కపెట్టుకో!"

శరభయ్య సంచి అందుకుని, వరహాలను చేతిలో పోసుకుని లెక్కపెట్టి, తృప్తికరంగా తల పంకించాడు. "నా రాముడు నీవాడే! ఇందు! పగ్గం పట్టుకో!"

శరభయ్య అందించిన పగ్గాన్ని అందుకున్నాడు నంది. "శరభన్నా...తలపాగా!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

శరభయ్య వరహాల సంచిని భార్య చేతికి అందించి, రెండు చేతులతో తన తలపాగా తీసి, జాగ్రత్తగా నంది తల మీద అమర్చాడు. తన మెడ మీద నుంచీ రెండు వైపులా వేళ్ళాడుతున్న రెండు ఉత్తరీయాలనూ నంది మెడలో వేశాడు. వెనక్కి తిరిగి రెండు చేతులతో ఎద్దు ముఖాన్ని ప్రేమగా నిమిరాడు. "రాముడూ, వెళ్ళి రారా! సుఖంగా బతకరా!" అన్నాడు.

రాముడు తలాడించింది. గంటలు గలగలమన్నాయి. శరభయ్య ఎద్దు మూపు వైపు వెళ్ళాడు. దానిపైనున్న ఒక పంచెను తీసి, నేల మీద పరిచాడు. వీపు మీదుగా రెండువైపులకూ బరువుగా వేళ్ళాడుతున్న 'అసిమి' అనబడే సంచిని తీశాడు. ఆ సంచిలో రెండువైపులా ఉన్న బియ్యాన్ని పంచె మీద పోశాడు. అసిమిని మళ్ళీ యథాస్థానంలో గంగిరెద్దు వీపు మీద వేశాడు.

"సంచిలో ఇంకా ఉన్నాయి బియ్యం" నంది హెచ్చరించాడు.

"అవి నీకే తమ్ముడూ! ఉత్త సంచి ఇవ్వరాదు. కొంచెం ధాన్యం ఉంచాలి!" శరభయ్య అన్నాడు.

**అవకాశం యాదృచ్ఛికంగా అందివచ్చింది. అందివచ్చిన అవకాశం ఉపయోగించుకోవాలనుకున్నాడు నంది. అతడిలో మొలకెత్తిన ఆలోచన క్రమంగా నిర్ణయంగా మారింది. ఎవరికీ అందకుండా బయటపడే దుర్భేద్యమైన రక్షాకవచాలు అతడి మదిలో రూపుదాల్చాయి. నిర్ణయాన్ని ఆచరణలో పెట్టేందుకు నడక వేగం పెంచాడు. ఇంతకీ అతడికి అందివచ్చిన అవకాశమేమిటి? ఎటువంటి రక్షాకవచాలు అతడికి తారసిల్లాయి?**

నేలమీద కూచుని బియ్యం పోసిన పంచె నాలుగు మూలల్నీ కలుపుతూ జాగ్రత్తగా మూట కట్టాడు. మూటను ఎత్తి భుజంమీద పెట్టుకున్నాడు. నంది వైపు నవ్వుతూ చూశాడు. "అదిగో... చిన్న గుట్ట కనిపిస్తోందిగా. దాని అంచునే మా ఊరు. దగ్గరే! వెళ్ళొస్తాం!" అన్నాడు కుడివైపు ఉన్న చిన్న గుట్టలను చూపిస్తూ.

"శరభన్నా...ఇటువైపు నేనెప్పుడూ రాలేదు. ఈ ప్రాంతం ఏ రాజ్యంలోది?" నంది అడిగాడు.

"ఇది సారంగ సామ్రాజ్యం.."

"ఓ...మన సారంగ సామ్రాజ్యం పొలిమేర ఎంత దూరం?" నంది అమాయకత్వం ధ్వనించే కంఠంతో అడిగాడు.

"అర్ధమండలం ప్రయాణం చేస్తే గానీ మన రాజ్యం ఎల్లలు దాటలేం" శరభయ్య అన్నాడు. "అర్ధమండలం అంటే తెలుసా?"

"తెలుసన్నా... ఇరవై దినాలు!" నంది చిన్నగా నవ్వాడు.

"అటు వెళ్ళాలనుకుంటున్నావా?"

"ఆ! ఇన్నాళ్ళూ...మన రాజ్యంలోనే గానుగెద్దులా తిరుగుతూ ఉండిపోవాల్సి వచ్చింది. ఇరుగు పొరుగు రాజ్యాలు చూడాలనుకుంటున్నాను" నంది అన్నాడు.

"మంచిదే. మనిషి ప్రపంచాన్ని చూడాలి. మన రాజ్యానికీ, పొరుగున ఉన్న దర్శన రాజ్యానికీ మధ్య పొలిమేరలో ఏపుగా పెరిగిన కొబ్బరి తోటల మధ్య చిన్న ఏరు పారుతూ ఉంటుంది. ఏరు చిన్నదే అయినా పేరు 'పెద్దేరు!' దాన్ని దాటితే పొరుగు రాజ్యంలో ఉన్నట్టే!"

"దారిలో జనవాసాలు.."

"తగుల్తాయి. చెదురుమదురుగా ఉంటాయి. ఉదయం ఒక ఊరైతే, రాత్రికి మరో ఊరు. అలా తగుల్తూ ఉంటాయి. నీ తిండికీ, రాముడి మేతకూ లోటు రాదు! చెయ్యి చాచితే 'లేదు' అనే గడప లేదు!" శరభయ్య ధైర్యం చెప్పాడు.

మల్లి గంగిరెద్దు రాముడి దగ్గరగా జరిగింది. ముందుకు వంగి, తన చెంపను దాని ముఖానికి ఆన్చింది. తగ్గుస్వరంతో 'రాముడు' 'రాముడూ' అంటోంది. ఎద్దు ముఖాన్ని ప్రేమగా నిమిరి, ఎడంగా జరిగి, దాని కంఠాన్ని కావిలించుకుంది. "రాముడూ... వెళ్ళిపోతున్నావా?" బొంగురు పోయిన కంఠంతో అందామె.

గంగిరెద్దు రాముడు తలాడిస్తోంది. శరభయ్య భార్య దగ్గరగా జరిగి, ఆమె భుజం మీద చేతిని వేశాడు. "మల్లీ..లే..వెళ్దాం రా..."

మల్లి రాముడి కంఠాన్ని వదిలి, నిలుచుంది. కన్నీళ్ళతో ఆమె బుగ్గలు తడిసిపోయి ఉన్నాయి. "రాముణ్ణి భద్రంగా చూసుకో అన్నా!" అందామె.

"ప్రాణంలా చూసుకుంటానమ్మా.. బాధపడకు" నంది ఓదార్చాడు.

ఆమె మెడలోంచి వేళ్ళాడుతున్న చిన్న డోలును తీసి, నందికి అందించాడు శరభయ్య. నంది డోలును మెడలో వేసుకున్నాడు. శరభయ్య మల్లి చెయ్యి పట్టుకుని తమ పల్లెటూరివైపు నడిపించుకు వెళ్తున్నాడు. మల్లి రెండుమూడు అడుగులకు ఒకసారి తలతిప్పి గంగిరెద్దు వైపు చూస్తోంది. కళ్ళు తుడుచుకుంటోంది. ఆమెను నిరాశపర్చడం ఇష్టంలేని నంది అక్కడే నిలుచుని ఉండిపోయాడు.

●●●

లాలస నివ్వెరపాటుతో లేచి నిలుచుంది. నంది తలమీద తెల్లటి చుక్కలతో ఎర్రరంగు తలపాగా, అతని వెనక గంటల చప్పుడుతో నడుస్తున్న ఎద్దూ ఆమెను ఆశ్చర్య ప్రతిమలా మార్చివేశాయి.

"నేనే!" నంది నవ్వాడు.

"ఆ తలపాగా ఏమిటి? ఆ ఎద్దేమిటి? ఎక్కడ దొరికాయి?" లాలస గుడ్లు పెళ్ళగించుకుంటూ అడిగింది.

గుర్రం ఎద్దువైపు ఎర్రటి కళ్ళతో గుర్రుగా చూస్తోంది. నంది ఎద్దును గుర్రానికి దూరంగా పచ్చికలో కట్టేశాడు. గంగిరెద్దు ఉత్సాహంగా పచ్చిక మేయసాగింది. నంది, లాలస దగ్గరగా వచ్చాడు. పచ్చిక మీద కూర్చుని తలపాగా తీసి, జాగ్రత్తగా కింద పెట్టాడు. తన ముఖంలోకే ప్రశ్నార్థకంగా చూస్తూ బొమ్మలా నిలుచున్న లాలస వైపు చిరునవ్వుతో చూశాడు. "కూర్చో లాలసా... సందేహాలు తీర్చి నీ ఆశ్చర్యాన్ని తరిమేస్తాను!"



లాలస మాట్లాడకుండా కూర్చుంది. ఆమె చూపులు నంది ముఖం మీదే ఉన్నాయి.

"ఈ గంగిరెద్దుతో భార్యాభర్తలు వచ్చారు. మనం ఇంకా సారంగ సామ్రాజ్యంలోనే ఉన్నాం. ఇరవై దినాలు ప్రయాణం చేస్తే గానీ ఈ రాజ్యాన్ని దాటలేం. మనకోసం సారంగరాజ్య రాజపరివారం అన్వేషణ సాగించే అవకాశాలున్నాయి. మన గురించి సారంగ ప్రభువులకు తెలిసినట్టుంది. కళింగ యువరాజుకీ, సారంగరాజుకీ స్నేహ సంబంధం ఉన్నట్టుంది. కళింగరత్న ఇరుగుపొరుగు రాజ్యాలలో మన గురించి వర్తమానం అందజేసి ఉంటాడు. కామరూప రాజ్యం చేరేదాకా మనకు రక్షణ లేదు. అందుకని మారువేషాల మాటున దాగి మనం ప్రయాణం చేయడం క్షేమం అని భావించాను. అందుకే అదనులో అందివచ్చిన అదృష్టాన్ని అందిపుచ్చుకుని, గంగిరెద్దును కొన్నాను.." నంది ఆగి, లాలస వైపు చూశాడు.

లాలస అర్థమైనట్టు తల పంకించింది. "అంటే మనం..."

"గంగిరెద్దు వాళ్ళలాగా వేషాలు వేసుకోవాలి. అభ్యంతరం లేదుగా?" నంది అడిగాడు.

"లేదు.." లాలస అంది. "అయితే వేషం ఎలా వేసుకోవాలో నాకు తెలీదు..."

"గంగిరెద్దు శరభయ్య భార్య మల్లి వేషం- ఆమెది వేషం కాదు, సహజమైన వస్త్రధారణ. నువ్వు ఆమెలాగా రూపొందాలి."

"ఆమెను నేను చూసి ఉంటే బాగుండేది.." లాలస సాలోచనగా అంది.

"నేను చూశాను. ఆమె వస్త్రధారణ ఎలా ఉందో చెప్తాను" నంది ఏదో ఆలోచన తట్టి, పైకి లేస్తూ అన్నాడు. "మన వేషధారణకి సరిపడే వస్త్రాలు గంగిరెద్దు మీద ఉన్నాయేమో చూస్తాను."

లాలస గంగిరెద్దు వైపు వెళ్తున్న నందినే చూస్తూ ఉండిపోయింది. చూస్తారేమో, పట్టుకుంటారేమో అంటూ అనుక్షణం భయంతో నరకయాతన పడటం కన్నా ఎవ్వరూ పోల్చుకోడానికి వీలు లేకుండా మారువేషాలతో ప్రయాణం చేయడం మంచిది. నంది ఆలోచనలో ముందుచూపు ఉంది!

నంది నవ్వుముఖంతో తిరిగి వచ్చాడు. అతని చేతుల్లో ఆకుపచ్చ రంగు చీర, ఎర్రరంగు పంచె ఉన్నాయి. "గంగిరెద్దు మూపు మీద ఇంకా చీరలు, ధోవతులు ఉన్నాయి. దాతలు ఇచ్చే వస్త్రాలన్నింటినీ గంగిరెద్దు మీద అలంకరించడం గంగిరెద్దుల వాళ్ళ వాడుక!" చీరను లాలసకు అందించాడు.

"ఈ చీర కట్టుకో లాలసా. కుచ్చెళ్ళు పాదాల మీద పడకూడదు సుమా! పాదాలకు జానెడు పైన ఉండాలి. ఆమె పాదాలకు లావుపాటి వెండి అందెలున్నాయి. నీ పాదాలకు అందెలు లేవు. ఆమె లాగా పాదాలకు దట్టంగా పసుపు రాసుకోవాలి. అలాగే ముఖమంతా పసుపు రాయాలి. నుదురు మీద పెద్దగా, గుండ్రంగా కుంకుమ బొట్టు.."

"కుంకుమ, పసుపు లేవుగా?" లాలస అడ్డు తగిలింది.

"ఉన్నాయి. గంగిరెద్దు కొమ్ముల మొదట్లో పిడికిలంత చిన్న మూటలు రెండున్నాయి. చూశాను. ఒకటి పసుపు, ఒకటి కుంకుమ. ప్రతి దినమూ




## జారువెన్నెల

ఉబికుబికి వచ్చే చనుబాలను
ఎక్కడ ఏ కనుమ పిండి పారబోసుకుందో ఏమో,
రొమ్మందుకోకుండానే అమ్మపాలను
చప్పరించిన కసికందుగా
అది ఎప్పుడు గుక్కతిప్పుకుందో ఏమో,
అడుగు అడుగు పడటం మొదలుపెట్టాక
ఇక పరుగునాపిందెక్కడ?
పరుగుకే అంకితమయ్యాక కథ ముగిసిందెక్కడ?

ఇరుకుదో, విరిగినదో, ఎల్లలెరుగనిదో
రారమ్మని పిలిచే రాదారి ఏదైతేనేం
ఇతిహాసమైపోయాక
విరామాన్ని పోగొట్టుకోవలసిందేగా

రాముడి పాదం రాతిని నాతిని చేసిన మాటేమోగానీ
పసివాడి పాదం తాకిడికే
గుండె పురి విప్పుకున్నంత నిజంగా
అది - సనసన్నగా సన్నాయి ఊదిన చోటల్లా
ఊపిరిపాటల గుత్తులే
అది - వసంతాల్ని వాయిదా వేసిన చోటల్లా
నిండా విరగపండే సంక్రాంతుల కోసం
పడిగాపులు పడుతున్న కంటిపాపల కుప్పలే

ఎన్ని లోయలు చూసిందో
ఎన్ని లోతులు దిగమింగిందో
తీరతీరాలకు సంబురాల బొట్లు పెట్టి
అలల కావిళ్లతో సారె పంచుకుంటూ
కాస్తంత నవ్విన ప్రతి వాకిట్లోనూ
నాగరికానికి నలుగుపెట్టి పారాణి దిద్ది
ఇక్కడిదాకా నడిపించుకొచ్చిన ప్రణవదీపమది
నీకు దారులు చేసుకుంటూ
ఎన్నెన్ని దూరాల్నో ఎద కొంగున ముడేసుకుంటూ
పచ్చపచ్చని గెలుపులకు పారుతున్న సంతకమై
నేల పట్టని సిరులకు ఆది దీవెన అది

వలపుతాళ్లు విసిరి మోహాల జలతార్లు పరిచే
మొయిళ్ల లోకానికి అప్పుడప్పుడూ
మోమాటంగానే వెళ్లినా -
కాలం ఒడ్డునపడ్డ చేపయినప్పుడెప్పుడో
గోసపడిన గలగలలు ఎందుకో తప్పిన లెక్కలయినా -
జటాఝూట బంధనాన్ని తప్పించుకున్న ఉగ్రగంగలా
అప్పుడప్పుడు ఉదయాల్ని ఊడ్చుకెళ్లిపోయినా -
ఎంతైనా అమ్మకడుపు కదా...
మళ్లీ పూతకొచ్చిన పాటలతోటై
జుర్రుకొచ్చిన తేనెల్ని జల్లుకుంటూ పోతున్న
నీటికోకచిలుకై



మొదలుకొక మొదలుకొక మొదలుకు
తోరణాలు కట్టే శుభమంత్రమది
ఎటు చూసినా కొసరుతున్న కోరికల్లో
ఎన్నిసార్లు వివస్త్ర అయిందో
ఎన్నిసార్లు కురులరురుల్ని జారవిడిచి ముడిచిందో;
నిండుపొంగుల్నీ, పొంగుకొచ్చే పుప్పొడిలోకాల్నీ
నిలువెల్లా దోచుకుపోయే దోసిళ్లే చుట్టూ లంగర్లు దింపుకున్నా
నేల నేలంతా ఇంద్రధనసుల్ని అచ్చొత్తుతూనే ఉంది
తిరిగితిరిగితిరిగి స్వరపరుచుకున్న తపోశ్వాసతో
జీవనోపనిషత్తును వార్చుకుంటూనే ఉంది

.................................... అయినా...
పురులు పురులుగా ఎన్ని సంపుటాలకెత్తుకున్నా
పండుగలా వచ్చి వాలుతూనే ఉన్న
ఆ జారు వెన్నెల నిండా
ఇప్పటికింకా ఇల
ఎంతగా తోడిపోసుకుంటున్నా
తరగనంత ఆయుష్మాన్‌భవ దీవెన
ఇప్పటికింకా ఇల
ఎన్నిమార్లు ముద్దలు చేసుకుతిన్నా
కంచం పట్టనంత మహాస్వప్నాల వడ్డన

**- యార్లగడ్డ రాఘవేంద్రరావు**

**సెల్: 99854 11099**

ఎద్దును అలంకరించాలిగా!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"గాజులు..." గాజులు లేని చేతుల్ని చూపిస్తూ అంది లాలస.

"నా బంగారు గాజులను కళింగ రాక్షసుడు కాజేసినట్టున్నాడు, నా నగలతో పాటు..."

"ఏదో జనవాసం తగలగానే మట్టిగాజులు సంపాదించుకుందాం" నంది అన్నాడు. "అన్నట్టు లాలసా... నీ కర్ణాభరణాలు, నాసికాభరణం మనల్ని పట్టిస్తాయి! తీసివేసి భద్రంగా కొంగులో ముడి వేసుకో!"

"అలాగే... వేషం మార్చుకోనా!"

"ఒక్కక్షణం.." అంటూ నంది మళ్ళీ గంగిరెద్దు వైపు వెళ్ళాడు. క్షణంలో మరొక పంచెతో తిరిగి వచ్చాడు. లాలస అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

"నువ్వు బొద్దుగా కనిపించాలి. పొట్ట బాగా లావుగా ఉండేలా ఈ పంచెను చుట్టుకో. దాని పైన చీరకట్టుకో..." నంది చూపులను దాచుకుంటూ అన్నాడు.

"దేనికి? గంగిరెద్దతని భార్య అలా ఉందా?" లాలస అమాయకంగా అడిగింది.

"ఆమె...ఆమె...గర్భవతి.."

"ఓ..." లాలస అర్థమైనట్టు అంది.

"లాలసా, మరోలా అనుకోకు. మనిద్దర్నీ గంగిరెద్దుతోపాటు చూస్తే జనం ఏమనుకుంటారు?" నంది ప్రశ్నించాడు.

లాలస క్షణకాలం పాటు అతని ముఖంలోకి చూసింది. ఆమె కనురెప్పలు కిందకి వాలాయి. "ద...దంపతులు అనుకుంటారు."

"ఔను... అలా అనుకోవడమే మనకు కావల్సింది. చూసేవాళ్ళు ఎవరైనా సరే నీలో యువరాణిని... నిన్ను...చూడకూడదు. నీలో గంగిరెద్దులవాడి పెళ్ళాన్నీ, త్వరలో తల్లికాబోయే ఇల్లాలినీ చూడాలి. అది నీకూ, నాకూ ఎంతో మంచిది."

లాలస చిరునవ్వు నవ్వింది. "నీ ఉపాయం అపాయాన్ని దూరంగా ఉంచుతుంది! ఇలా ఇవ్వు!" అంటూ లాలస పంచెకోసం చేతిని జాచింది.

నంది పంచెను ఆమెకు అందించాడు. లాలస గుబురుగా ఉన్న పొదల చాటుకు వెళ్ళింది. నంది గంగిరెద్దు శరభయ్య తనకోసం ఎద్దు మీద వదిలి వెళ్ళిన ఎర్రటి ధోవతిని కట్టుకోవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

•••

నంది తలవాల్చి కొలను నీటిలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు. ఎర్రటి ధోవతి. నడుము చుట్టూ దట్టీలాగా చుట్టిన నీలిరంగు ఉత్తరీయం. దాని రెండు అంచులూ కుడిచేతివైపు క్రిందికి వేళ్ళాడుతున్నాయి. మెడ మీద నుండి మూడు మూడురంగుల ఉత్తరీయాలు క్రిందికి జారాయి. తల మీద శరభయ్య తలపాగా. తన తండ్రీ, చెల్లెలు కూడా తనను పోల్చుకోలేరు! నంది తృప్తిగా నవ్వుకుంటూ వెనుతిరిగాడు.

చెట్టు క్రింద నిలుచున్న లాలస వైపు ఆశ్చర్యంగా చూశాడు నంది. ఆకుపచ్చ రంగు ముతక చీరలో కొత్తగా కనిపిస్తోందామె. చీర కుచ్చెళ్ళు పాదాలకు జానెడు పైన ఉన్నాయి. నంది చూపులు పైకి ప్రాకాయి. లాలస సన్నటి నడుము మాయమైంది. ఆరేడు నెలల గర్భవతిలా కనిపిస్తోందామె! ఆమె చెవులూ, ముక్కూ బోసిగా ఉన్నాయి.

"ఎలా ఉన్నాను?" తననే చూస్తూ దగ్గరగా వచ్చిన నందిని చిరునవ్వుతో ప్రశ్నించింది లాలస.

"ఎలా ఉండాలని అనుకున్నానో అలా ఉన్నావు. ముఖానికీ, ముంజేతులకూ, పాదాలకూ దట్టంగా పసుపు రాస్తే కళింగరత్న, ఉలూకుడూ చచ్చినా పోల్చుకోలేరు."

"నిన్ను కూడా!" లాలస నవ్వింది.

"పసుపు మూట ఇస్తాను.." అంటూ నంది గంగిరెద్దు వైపు అడుగులు వేశాడు.

•••

గంగిరెద్దు మూపురం మీద మోస్తున్న వస్తువులను పరిశీలిస్తూ ఉండిపోయాడు నంది. పంచెలు, చీరలు, ఉత్తరీయాలు, అంగీలు, పాదాల దాకా ఉండే పురుషులు ధరించే వస్త్రాలు... మూపురం దగ్గరగా సన్నటి తాడు రెండు వైపులకూ వేలాడుతోంది. రెండు మట్టిపాత్రలు, తాడు కొసలతో బంధించి ఉన్నాయి. సన్నటి నులక ముంతల్లా ఉన్న ఆ మట్టిపాత్రల చుట్టూ చిక్కటి ఆకారంలో అల్లబడి ఉన్నాయి, మట్టిపాత్రలు పగిలిపోకుండా నులక కవచాలు! మట్టిపాత్రల మీద ఉన్న చిన్న మూతల్ని తీసి చూశాడు నంది. నీళ్ళు! శరభయ్య దంపతుల దాహం తీర్చడానికి గంగిరెద్దు నీటిని మోసుకెళ్తుందన్నమాట. నంది ఉట్లలో ఉన్న మట్టిపాత్రలనూ, బంధించిన తాడుతో పాటు తీసుకొని, కొలను వైపు నడిచాడు.

ముఖానికీ, ముంజేతులకూ, పాదాలకూ పసుపు రాసుకోవడం ముగించిన లాలస లేచి నిలుచుంది. తనవైపు తిరిగిన లాలస ముఖాన్నీ, ముంజేతులనూ, పాదాలనూ పరిశీలనగా చూస్తూ నంది మెప్పుగా తల పంకించాడు. రొంటిన దోపుకున్న కుంకుమ మూటను ఆమె వైపు చాచాడు.

"గుండ్రంగా, పెద్దగా ఉదయించే సూర్యబింబంలా ఉండాలి!" అన్నాడు చిరునవ్వుతో.

లాలస కుంకుమను అందుకోలేదు. ఆమె తల అడ్డంగా ఊపింది.

"నా చేత కాదు. నుదురుమీద సూర్యబింబాన్ని నువ్వే చిత్రించు!" లాలస నవ్వుతూ అంది.

"సరే...అలా కూర్చో!" అంటూ పచ్చిక మీద పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు నంది.

లాలస అతని ముందు మోకాళ్ళ మీద కూర్చుంది. నంది కుంకుమ మూట విప్పాడు. బొటన వేలితో ఉంగరం వేలితో కుంకుమ తీసుకున్నాడు. లాలస నుదురు మీద, కనుబొమల మధ్యా పైభాగాన తడిగా ఉన్న పసుపు మీద కుంకుమ అద్దడం ప్రారంభించాడు. గుండ్రంగా, పెద్దగా రూపొందిన కుంకుమ తిలకాన్ని తృప్తికరంగా బొమ్మను చిత్రించిన చిత్రకారుడిలా చూశాడు.

"ఇప్పుడు జలదర్పణంలో చూసుకో" అన్నాడు.

లాలస లేచి కొలను దగ్గరగా వెళ్ళింది. నిశ్చలంగా, స్వచ్ఛంగా ఉన్న నీటిలో తన ముఖం చూసుకుంది. కుంకుమ తిలకం అందంగా ఉంది. చిరునవ్వు నవ్వుతూ నంది దగ్గరగా వచ్చింది.

"ఎలా ఉంది లాలసా?"

"ఉదయ సూర్యుడే!" అంటూ లాలస కుడి చేత్తో కొంచెం కుంకుమ తీసుకుంది. ఎడమ అరచేతిలో వేసుకుంది. కొలను దరికి వెళ్ళి కుంకుమ మీద కొన్ని నీటి చుక్కలు జారవిడిచింది. చూపుడు వేలితో చక్కగా రంగరించింది. నేలమీద పడి ఉన్న ఎండుపుల్లను తీసుకుంది. దానిని తడిగా, బురదగా ఉన్న కుంకుమలో అద్దింది. పుల్లకు తడి కుంకుమ బాగా అంటుకునేలా చేసింది. ప్రశ్నార్థకంగా చూస్తున్న నంది ముందు మోకాళ్ళ మీద కూర్చుంది.

"నీ నుదురు బోసిగా ఉంది!" అంటూ నంది కనుబొమల మధ్య నుండీ నుదురు పై భాగం దాకా పొడుగాటి నామం పెట్టింది. నీటిలో చూసుకోమన్నట్టు తల ఎగరేసింది.

నంది లేచి వెళ్ళి నీటి అద్దంలో చూసుకున్నాడు. ఎర్రటి పొడుగాటి నామం తన ముఖకవళికలనే మార్చివేసింది. "నేను పెట్టిన బొట్టు కన్నా నువ్వు దిద్దిన నామమే బాగుంది!"

"నా వేషంలో ఇంకొక లోపం ఉంది. ఆ లోపాన్ని పూరిస్తే నేను పరిపూర్ణంగా గంగిరెద్దుల వ్యక్తి ఇల్లాలినే!" లాలస నవ్వుతూ అంది.

"లోపమా?" నంది చూపులతో లోపాన్ని వెదికే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

లాలస మాట్లాడకుండా పైటకొంగు ముడి విప్పింది. కుడి అరచేతిని ముడివిప్పిన చోట బోర్లించి, బిగించిన పిడికిలిని నంది చూసేలా పట్టుకుంది. నంది కళ్ళు చిట్లిస్తూ చూస్తున్నాడు. లాలస అతనివైపు చిరునవ్వుతో చూస్తూ పిడికిలి విప్పింది. ఆమె చేతిలో చుట్టగా చుట్టిన సన్నటి నులక ఉంది. ఆ నులక పసుపు వర్ణంలో ఉంది.

"నువ్విచ్చిన చీరకొంగులో ఈ నులక దొరికింది. పసుపు పూసి, పసుపు తాడుగా చేశాను. నన్ను గర్భవతిగా, గంగిరెద్దులవాడి భార్యగా చూసిన వాళ్ళు నమ్మాలంటే నా మెడలో పసుపుతాడు ఉండాలి.

ఇదిగో...తీసుకో...నా మెడలో కట్టు నందీ!" అంది లాలస.

***(ఇంకా వుంది)***

## అక్క సాయంతో హాలీవుడ్‌కి



*పవన్‌కల్యాణ్ హీరోయిన్ మీరాచోప్రా గుర్తుంది కదా! 'బంగారం' సినిమా తరువాత పెద్దగా టాలీవుడ్‌లో కనిపించలేదు మీరా. ఆ తరువాత బాలీవుడ్ వెళ్లినా పరిస్థితిలో ఎలాంటి మార్పు లేదు. బాలీవుడ్ హీరోయిన్ ప్రియాంకాచోప్రాకు మీరా చోప్రా వరసకు చెల్లెలు అవుతుంది. సరైన అవకాశాలు లేక అవస్థపడుతున్న మీరాను చూసి ప్రియాంకకు జాలి కలిగినట్టు ఉంది. హాలీవుడ్‌లో తన దగ్గరకు వచ్చిన ఓ సీరియల్‌లో మీరాను తీసుకోమంటూ రికమెండ్ చేసిందట! ఈ విషయం తెలిసిన మీరా నేల మీద నడవకుండా గాలిలో తేలిపోతోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. అక్క మేలు ఈ జన్మలో మరిచిపోలేనని అందరి దగ్గరా చెబుతోంది మీరా చోప్రా.* ■

# పైల్స్ - హోమియో చికిత్స

పైల్స్ వున్న వారి బాధవర్ణనాతీతం, మలవిసర్జన తర్వాత ఈ బాధ కొన్ని గంటల వరకు ఉంటుంది. నొప్పి, మంట, దురద ఉండి, సూదులతో గుచ్చు కున్నట్లువుండి వీరు ఒకచోట కూర్చోలేరు, నిల్చో లేరు. ఈ మొలలు చిట్లడంవలన రక్తస్రావం జరుగు తుంది. చాలారోజుల వరకు రక్తస్రావం అయితే శరీరంలో హిమోగ్లోబిన్ శాతంతగ్గి ఎనీమియా రావడానికి ఆస్కారంఉంది. జీవనవిధానం, మారుతున్న ఆహారపు అలవాట్లు, నిద్రలేమి, వాహనాలు అధికంగా నడపటం, వేసవికాలం, నీరు అధికంగా తీసుకోకపోవడం వలన ఇవి వస్తాయి. మలద్వారంతో కలుపబడిన పెద్దపేగు చివరి భాగాన్ని మలనాళం లేదా రెక్టమ్ అంటారు. ఇక్కడ ఉన్నకణజాలంలో అధికంగాఉండే రక్తనాళాల వాపు వలన ఈ స్థితివస్తుంది. పురీషనాళం వెలుపలి భాగంలో వస్తే బాహ్య హెమరాయిడ్స్ అని, లోపలి భాగంలో వస్తే లోపలిహెమరాయిడ్స్ అనిఅంటారు. ఇవి బఠాణీగింజ లేదా ద్రాక్షపండు పరిమాణంలో గులాబీ రంగులో, మూడు లేదా నాలుగు గుత్తులు గా లేదా విడిగాకూడా ఉండే ఈ స్థితిని మూలశంక (పైల్స్) వ్యాధిగా పేర్కొంటారు.

**ఎవరికి వస్తుంది ?:** గర్భిణులలో, ప్రొస్టేట్ గ్రంథి వాపు ఉన్నవారిలో సాధారణంగా చూస్తాం. పిల్లలలో ఈ వ్యాధిని అరుదుగా చూస్తాం.

**కారణాలు :** 1. మలబద్ధకం మూలంగా అధికంగా ముక్కుటం 2. దీర్ఘకాలిక విరేచనాలు 3.గర్భస్థ పిండం ఒత్తిడి వలన, అధికంగా ఉత్పత్తి అయ్యే హార్మోన్ల వలన 4. పొత్తికడుపు లేదా పేగులలోని క్యాన్సర్ సంబంధ కణుతుల వలన 5. వంశపారం పర్యంగా 6. అధిక బరువు 7. పీచు పదార్థాలు తక్కువగా ఉన్న ఆహారాన్ని రోజూ తీసుకోవడం.. వంటివి.

**హెమరాయిడ్‌లు - రకములు:** మొదటి తరగతి ( ఫస్ట్ డిగ్రీ పైల్స్), రెక్టమ్ లేదా మలనాళం లోపలే ఉంటాయి. రెండవ తరగతి (సెకండ్ డిగ్రీ పైల్స్). పురీషనాళం తెరుచుకొని ఉన్నప్పుడు వెలుపలికి వచ్చి, మలద్వారం మూసుకున్న వెంటనే లోపలికి వెళ్ళిపోతాయి . మూడవ తరగతి (థర్డ్ డిగ్రీ పైల్స్) వెలుపలికి వచ్చి, హెమరాయిడ్‌లను లోపలికి చొప్పించిన వెంటనే లోనికి వెళ్ళిపోతాయి. నాల్గవ తరగతి (పోర్త్ డిగ్రీ పైల్స్) మలద్వారం వెలుపల శాశ్వతంగా వేలాడుతూ ఉంటాయి.

**లక్షణాలు:** చాలా మంది ఎక్కువగా లోపలి హెమరాయిడ్‌ల(ఇంటర్నల్ పైల్స్)తో ఏ లక్షణాలు లేకుండానే ఉంటారు. మలద్వారం తెరుచుకున్న వెంటనే తాజా రక్తం మలద్వారం ద్వారా వెలుపలికి వస్తుంది. మలద్వారం చుట్టూ దురద ఉండవచ్చు. మూడు - నాలుగు దశలలోని హెమరాయిడ్‌లు, అధికంగా నొప్పి ఉండి చీమువంటి పలుచనిద్రవం విసర్జింప బడుతుంది.

**నివారించవచ్చా:** మొలలు వచ్చిన తరువాత కంటె మొలల లక్షణాలు కనబడిన వెంటనే కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే వీటిని నివారించవచ్చు. మొలలతో బాధపడేవారు ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో మార్పుతీసుకొస్తే నివారించవచ్చు.




డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి


ముఖ్యంగా తాజా పండ్లు, ఆకుకూరలు, ఫైబర్‌తో కూడిన పదార్థాలు, దప్పికఉన్న లేకున్నా పది నుండి పన్నెండు గ్లాసులనీరుతీసుకోవడం, మాంసాహారం, మసాలాలు, పచ్చళ్లుతీసుకోకుండా ఉంటే మంచిది. ఎక్కువసేపు కూర్చోకుండా, యోగా, వ్యాయామం చేయడం వలన నివారించవచ్చు.

**హోమియో చికిత్స వలన ప్రయోజనం ఉంటుందా?:** మొదటి మూడు దశలలోని హెమరాయిడ్‌లను పూర్తిగా నయం చేయుటమేకాక, శాస్త్రచికిత్స అవసరం లేకుండా చేస్తుంది. అంతేకాకుండా హెమరాయిడ్ వలన వచ్చే బలహీనతను తగ్గించి, శాశ్వతంగా రాకుండా చేస్తుంది. హోమియోలో ఆస్కులస్ హిప్, ఆలోస్, హెయాములస్, కొలింగ్ సోనియా, ఆర్సెనిక్ ఆల్, నక్సామికా మందులు బాగా పనిచేస్తాయి.



# సోరియాసిస్

సోరియాసిస్ మచ్చలు పింక్ లేక ఎరుపు వర్ణంలో పొలుసులతో కూడి ఉంటాయి. చర్మం దళసరిగా ఉంటుంది. ఈ పొలుసులను బల వంతంగా తీస్తే వాటికింద ఎర్రటిరక్తపు మచ్చలు గాకనిపిస్తాయి.ఈసోరియాసిస్‌మచ్చలు కొంచెం కాని, ఎక్కువ సంఖ్యలో గాని ఉంటాయి.

శరీరంలోని చాలాభాగాలలో అంటే చేతులు, కాళ్ళు, తల,వీపుమీద,మోకాళ్ళ ముందుభాగాన, ఉదరం, అరికాళ్ళు, అరిచేతులలో అధికంగా ఈమచ్చలువస్తాయి.పొలుసులుచాలా దట్టంగా, అధికంగాఉండి కొవ్వొత్తిమైనంలాగాఉంటాయి. ఒక్కొక్కసారి వాపుతో కూడి ఉంటాయి.

సోరియాసిస్ ప్రధానంగా చాతి, కాళ్ళ మీద... యుక్త, మధ్యవయస్సులో అధికంగా కనిపిస్తుంది. చాలా తక్కువగా చిన్నపిల్లలు, వృద్ధులలో కనిపించ వచ్చు. అధికవత్తిడివలన, వంశపారంపర్యంగా తల్లిదండ్రులకు ఉంటే వారి పిల్లలకు ఈ వ్యాధిరావటానికి అవకాశాలు ఉంటాయి. కాలివేళ్ళు, చేతివేళ్ళ గోళ్ళలో గుంటలు పడినట్లు ఉంటాయి.



(కిటిభ కుష్టం) అనే వ్యాధిలో పంచకర్మ చికిత్సా విధానం ఎంతో ప్రముఖమైనది. ఈ పంచకర్మ విధానంలో వమనకర్మప్రధానమైనది. దీనివలన శరీరంలో ఉన్న చెడుభావాలు రసాయనాలు మొదలగు శరీరం నుండి బయటికి పంపబడ తాయి. తక్రధార. ఈ చికిత్సావిధానంలో ప్రత్యేకంగా ఔషధాలతో తయారు చేయబడిన తక్రము లేదామజ్జిగధారతో మచ్చలుగల శరీర భాగాలను శుభ్రంగా తడపటం జరుగుతుంది. దీనివలన శరీరం పైభాగంలోని పొలుసులన్నీ ఊడిపోతాయి.

**నివారణ:** మానసికవత్తిడి నుండి పూర్తిగా విముక్తి వలన, పులుపు పదార్థాలు, మాంసాహార సేవన, సముద్రఉత్పత్తులు పూర్తిగా నిషేదించటంవలన, వాయుకాలుష్యం, జల కాలుష్యం నుంచి దూరంగా ఉండటం, పరిశ్రమలలో సరైనరక్షణ విధానాలు పాటించటం వలన నివారించవచ్చు.


డా. లక్ష్మి M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 21

**రెండిళ్ళపూజారి' చిత్రంలో నాది హిజ్రా పాత్ర. చిత్రంలో అదే ప్రధానమైన పాత్ర. అంతకు ముందెప్పుడూ ఆ వేషం చెయ్యలేదు. అందుకే షూటింగ్‌కి ముందునుంచీ ఆ పాత్రను ఎలా పండించాలా? అని ఎంతో అంతర్మథనం చెందాను.**

ఆ సమయంలో 'నర్తనశాల' చిత్రరాజం గుర్తుకొచ్చింది. మహానుభావుడు రామారావుగారు ఆ చిత్రంలో ఎంతో బాగా చేశారు. నాకన్నా పెద్ద పర్సనాలిటీ ఉన్న వ్యక్తి. అయినా ఆ పాత్రను ఎంతో బాగా పండించారు. అప్పటికే నేను ఆ సినిమా చాలాసార్లు చూసేశాను. చూసిన ప్రతిసారీ 'ఈయన ఇంత సునాయాసంగా ఎలా నటించారా?' అనుకునేవాణ్ణి. ఆ విషయాలన్నీ గుర్తుకొచ్చాయి. అంటే నాకు ముందర పెద్దాయన ఒక బాట వేశారన్నమాట అనిపించింది. ఆయనలాగా ప్రయత్నిస్తే ప్రేక్షకుల్ని మెప్పించవచ్చునే ధైర్యం వచ్చింది. మనసు కాస్త కుదుటపడింది. కంటినిండా కునుకు పట్టింది. అదేరోజు సాయంత్రం ఈ పాత్ర గురించి ఓ మిత్రుడికి చెబితే,

'హిందీలో ఈ మధ్యనే ఒక సినిమా వచ్చింది. అందులో మీరు చెప్పినపాత్రను పోలిన పాత్ర ఉంది. ఒకసారి చూడండి' అని రిఫరెన్స్ ఇచ్చారు. వినడమైతే విన్నాను కానీ సినిమా చూడలేదు. ఆ సంగతి వదిలేశాను.

### నిర్ణయించే జడ్జ్ ఎవరు?

తీరా షూటింగ్ రోజు రానే వచ్చింది. సెట్‌లో సుమన్, హీరోయిన్లు ఉన్నారు. సుమన్ అందగాడు. ఆజానుబాహుడు. చూడగానే ఎవరికైనా ఇట్టే నచ్చేరూపం. సీన్ కోసం రెడీ అవుతున్నారు సుమన్. అంతలో మా మేకప్‌మన్ మోహన్ నా దగ్గరకు వచ్చాడు.

'సార్ మేకప్ సార్' అన్నాడు.

సరే అని అందర్నీ ఒకసారి విష్‌చేసి మేకప్ రూమ్‌లోకి వెళ్ళాను.

తలనిండా కాస్తంత పొడవుజుట్టు ఉండేలా విగ్గు ప్రిపేర్ చేయించాడు మోహన్. పువ్వుల డ్రెస్ కూడా చక్కగా కుట్టించాడు. మేకప్ చేసుకోవడం పూర్తయ్యాక చూసిన వారందరూ 'చాలా బావుందండీ' అనసాగారు.

'గెటప్ నప్పింది.. అందరూ బావుందని అంటున్నారు. కానీ, ఆ పాత్ర ఎలా చేసి మెప్పించాలి?' అని నాలో మథన మొదలైంది. 'అతిగా చేయకుండా, పాత్రకు సరిపోయినంత చేస్తే ప్రేక్షకులు తప్పకుండా ఆదరిస్తారు. ఒకసారి ఒక షాట్‌లో చేయడం వేరు. సినిమా మొత్తం ఆ వేషం చేయడం వేరు. ఎక్కువ తక్కువ చేస్తే సినిమా చూసే ప్రేక్షకుడు ఇట్టే కనిపెట్టేస్తాడు. ఒకే లెవెల్లో, గ్రాఫ్‌లో హెచ్చుతగ్గులు లేకుండా చేయాలి. అలా చేస్తానో లేదో జడ్జి చేసి చెప్పేదెవరు?' అని మనసులో ఎడతెరిపి లేకుండా నాలో ఆలోచనలు చుట్టుముట్టసాగాయి.

అంతలోనే 'షాట్ రెడీ' అన్నారు.

నాకు డాబామీద నుంచి మెట్లుదిగే సన్నివేశం ప్లాన్ చేశారు. నేను కూడా గుండెలనిండా గాలి పీల్చుకుని వెళ్ళి 'మెట్లు దిగుతూ ఓ డైలాగు చెప్పా'.

## చాలామంది హీరోలతో నాకు సాన్నిహిత్యం లేదు

'కట్.. షాట్ ఓకే' అన్నారు డైరెక్టర్‌గారు.

'ఇదిగో... రేయ్ కోటయ్యా.. ఒకసారి ఇట్రా' అని పిలిచారు నిర్మలమ్మగారు. ఆవేళ ఆవిడ కూడా సెట్‌లోనే ఉన్నారు.

'ఏంటమ్మా' అని దగ్గరకు వెళ్ళా.

చేతితో ఆడవాళ్ళు దిష్టితీస్తూ మెటికలు విరుస్తారే.. అలా విరిచి,

'నువ్వు నాకు తెలిసిన కోట శ్రీనివాసరావు అంటే నేను కూడా నమ్మను. మీ అమ్మ కడుపు సల్లగుండ... ఎంత నేచురల్‌గా చేశావ్రా, నువ్వలా నడిచి వస్తుంటే నాకు ఓ పోశ్చర్ కనిపించింది. నీలాంటి నటులు ఉండాలి. ఎక్కువా తక్కువా కాకుండా ఆ వేషానికి తగ్గట్టే చేశావు' అన్నారు.

నేను ఇండస్ట్రీకి వచ్చేసరికే నిర్మలమ్మగారు చాలా పెద్దావిడ. తల్లి క్యారెక్టర్లు, హీరోలకు బామ్మ పాత్రలు చేసేవారు. ఆ సినిమాల్లో నేను విలన్‌గా నటించేవాణ్ణి. కలిసి చాలా సినిమాలు చేసినా, ఆవిడతో నాకు కాంబినేషన్ సీన్లు తక్కువగానే ఉండేవి. కానీ నేను రోజుకు ఎన్నిసార్లు కనిపిస్తే అన్నిసార్లూ "మంచి ఆర్టిస్టుని చూస్తున్నాన్రా కోటయ్యా" అని మనసారా దీవించేవారు ఆవిడ. అలాంటి పెద్దల నోటిమాటలు నన్ను ఇవాళ ఇంత గొప్ప స్థాయికి తెచ్చాయేమో అనిపిస్తూ ఉంటుంది. నిర్మలమ్మగారిలో మరో గొప్పతనం ఏమిటంటే లంచ్ టైమ్‌కు ఆవిడకు ఇంటి నుంచి స్పెషల్ క్యారేజ్ వచ్చేది. పులిహోర, గారెలు, బూరెలు, రకరకాల పచ్చళ్ళు లాంటివి ఉండేవి అందులో. పండుగల సమయంలో బోలెడన్ని వెరైటీలుండేవి. నాన్‌వెజిటేరియన్ వాళ్ళకి కూడా నాన్‌వెజ్ వంటకాలు తెచ్చి పెట్టేవారు. పెద్దా చిన్నా తేడా లేకుండా అందరినీ



# అలా అనుకుంటే స్వీయనాశనానికి శ్రీకారమే!

*ఏ రంగంలో పనిచేసే వ్యక్తి అయినా సరే 'నేను ఇవాళ టాప్ పొజిషన్‌లో ఉన్నాను' అని అనుకుంటే అంతటితో అతని నాశనానికి అతడే శ్రీకారం చుట్టుకున్నట్టు. 'ఈ రోజు మనకి మంచి రోజు. బాగా కష్టపడాలి. భగవంతుడు ఇచ్చిన అవకాశం సద్వినియోగం చేసుకోవాలి' అని అనుకున్నవాడు ఇంకాస్త ఎదుగుతాడు. నన్ను ఎవరైనా ఎప్పుడైనా 'మీకేంటండీ టాప్‌లో ఉన్నారు' అంటే విని లోపల్లోపల పొంగిపోతాను. ఆ ఫీలింగ్ అక్కడితో వదిలేసి ముందడుగు వేస్తుంటాను. అంతేగానీ నేను ఎప్పుడూ దాన్ని తలకి ఎక్కించుకుని గర్వం చూపించలేదు.*



ఆప్యాయంగా పలకరించేవారు. అందుకే అందరూ నిర్మలమ్మగారిని ఇంట్లో మనిషిలాగానే భావించేవారు. ఎవరిమీదైనా కోపమో, ప్రేమో ఉంటే మొహమ్మీదే అనేసేవారావిడ. అంతేతప్ప ముందు ఒకటి, వెనుక ఒకటి మాట్లాడటం వంటి పిచ్చిపిచ్చి ప్రవర్తనలు తెలియని మనిషి నిర్మలమ్మ.

అంత సీనియర్ ఆర్టిస్టు నన్ను పిలిచి బాగా చేశావు అని చెప్పేసరికి నాకు 'హమ్మయ్య..' అనిపించింది. ధైర్యం పెరిగింది. ఇక వేషాన్ని చెడుగుడు ఆడుకుంటూ చేసేశానంతే.

### ఆ గ్యాప్ ఉండేది!

'రెండిళ్ల పూజారి' తర్వాత సుమన్‌గారితో 'బావ బావమరిది' సినిమా చేశాను. అందులో కృష్ణంరాజుగారు, జయసుధగారు, మాలాశ్రీ, నేను నటించాం. శరత్ గారని చాలా మంచి డైరెక్టర్. ఆయన చేశారు ఆ పిక్చర్. మంచి సక్సెస్ అయింది. మా కాంబినేషన్‌లో ఇలాంటి సక్సెస్‌ఫుల్ సినిమాలున్నప్పటికీ, సుమన్ గారితో నాకు వ్యక్తిగతంగా పెద్ద పరిచయం లేదు. ఆ మాటకొస్తే చాలామంది హీరోలతో నాకు సాన్నిహిత్యం లేదు. లొకేషన్‌కి వెళ్ళడం, డైరెక్టర్‌గారు చెప్పింది చేయడం, మరలా ఇంకో షూటింగ్‌కి పరుగులు తీయడం... ఇదే పని. హీరోలతో పెద్దగా పరిచయాలు లేకపోవడానికి మరో కారణం కూడా ఉంది. అదేంటంటే మామూలుగా ఏ చెన్నైలోనో, హైదరాబాద్‌లోనో సినిమాచేస్తే సాయంత్రానికి ఎవరి గూటికి వాళ్ళు చేరుకుంటాం. అలా కాకుండా ఔట్‌డోర్ షూటింగ్స్ ఉన్నప్పుడు హీరో, హీరోయిన్లకి ఏసీ హోటల్ రూములు ఇచ్చేవారు. మాక్కూడా మంచి రూమ్‌లే అరేంజ్ చేసేవారు. కాకపోతే హోటళ్లు వేరుగా ఉండేవి. అందువల్ల హీరోలతో పెద్దగా పరిచయాలు ఉండేవి కావు.

### వంశీ చాలా స్పెషల్

'అలెగ్జాండర్' తర్వాత నా కెరీర్‌లో గుర్తుండిపోయే చిత్రం పెద్దవంశీగారి దర్శకత్వంలో వచ్చిన 'కనకమహాలక్ష్మి రికార్డింగ్ డ్యాన్స్ ట్రూప్'. ఆ సినిమాని నేను ఇప్పుడు చూసుకున్నాగానీ కడుపుబ్బ నవ్వుకుంటూ ఉంటా. అందులో ప్రతి డైలాగూ నవ్విస్తుంది. ఎన్నిసార్లు విన్నా వెగటు అనిపించదు. ఎక్కడా వెకిలిగానూ ఉండదు. ఆ సినిమాలో వంశీగారు నాచేత చాలా వెరైటీ వేషం వేయించారు. చెరువుగట్టున గోచీ పెట్టుకుని చిన్నపిల్లాడి చేష్టలు చేస్తుంటా. నటుడిగా లొకేషన్‌లో అడుగుపెట్టాక దర్శకుడు ఏం చెప్పినా చేయాలన్నది నేను నమ్మే సిద్ధాంతం. అంతేగానీ 'దర్శకుడు కావాలని చెబుతున్నాడా? నన్ను ఏడిపించడానికి చెబుతున్నాడా?' అని ఆరాలు తీయడమంటే నాకు అసహ్యం. ఒకవేళ నిజంగానే ఏ దర్శకుడైనా దురుద్దేశంతో చెప్పినా 'వాడి ఖర్మ వాడే అనుభవిస్తాడు' అని అనుకునేవాణ్ణి. అలా అనుకోవడంతప్ప నేనుమాత్రం ఏం చేయగలను? 'కనకమహాలక్ష్మి రికార్డింగ్ డ్యాన్స్ ట్రూప్ సినిమా'లో నిర్మలమ్మగారు, భరణి, నేను, మల్లికార్జునరావుగారు, రాళ్ళపల్లి... ఇంకా చాలామంది నటించాం. ఆ చిత్రంలో మాతోపాటు చేసిన ఆడవాళ్లు చాలామంది ఇప్పుడు ఇండస్ట్రీలో లేరు. పెళ్ళిళ్ళు చేసుకుని సెటిల్ అయ్యారు.

### చీపురు దెబ్బలు

'కనకమహాలక్ష్మి రికార్డింగ్ డ్యాన్స్ ట్రూప్' సినిమా పేరు వినగానే నాకు రెండు, మూడు డైలాగులు గుర్తుకొస్తాయి. అందులో 'ఇప్పుడు మనం ప్రేయర్ పాడాలి... ప్రేయర్.. పరాబ్రహ్మ పరమేశ్వర...' అని పాట అందుకునే సీన్, నిర్మలమ్మగారితో 'పరువుతీసేయకు మామ్మా.. మేమంతా కృష్ణుడి టైపు బులుగు రంగు..' అని చెప్పడం, కొత్తరకం డ్యాన్సులు నేర్పిస్తున్నానని కొంతమందిని పోగేసుకుని వెళ్తుంటే నిర్మలమ్మ ఆపి... 'ఏదిరా మీరు నేర్చుకున్నది ఒకసారి చెయ్యండి' అని అడుగుతారు.

'పాహి అని అశోకవనమున శోకించె సీత..' అని పాట అందుకోగానే,

'ముండాకొడుకుల్లారా.. కొత్తరకం అని ఇదొక్కటి అడ్డం పెట్టుకుని రామాయణాన్ని రోడ్డున పడేస్తున్నారా?' అని చీపురు పట్టుకుని యమకొట్టుడు కొడుతుంది ఆవిడపాత్ర. ఆ సినిమా టీవీలో వచ్చిన ప్రతిసారీ చాలా ఫోన్లు వస్తుంటాయి. నిక్కరు, చొక్కా, తలపాగాతో నా వేషం చాలా బావుంటుంది. అందులో మరో హైలైట్ కోడి సందేశం సీన్. స్రవంతి రవికిశోర్‌గారికి మంచి డబ్బులు తెచ్చిపెట్టిన చిత్రమిది.

### స్వరకల్పన

వంశీగారి దర్శకత్వంలో నేను చెప్పుకోవాల్సిన ఇంకో సినిమా 'స్వరకల్పన'. పూర్ణోదయ క్రియేషన్స్ ఏడిద నాగేశ్వరరావుగారి అబ్బాయి ఏడిద శ్రీరామ్ హీరోగా నటించిన సినిమా అది. తొలిసారి నా కెరీర్‌లో సింపతీ పాత్ర చేశా. చాలా సోఫిస్టికేటెడ్ వేషం. అందులో అన్నపూర్ణమ్మగారు నా పక్కన చేశారు.

### అదీ... ఆవిడ స్పెషాలిటీ.

నాకు పెయిర్‌గా చేసిన చిత్రాలకన్నా, మారుతీరావుగారికి పెయిర్‌గా చేసిన సినిమాలు అన్నపూర్ణమ్మగారికి చాలా మంచిపేరు తెచ్చిపెట్టాయి. తమిళంలో విస్సుగారి పాత్రలకు తెలుగులో మారుతీరావుగారు కీలక పాత్రధారిగా అప్పట్లో రీమేక్ చిత్రాలు చేశారు. వాటిలో అన్నపూర్ణమ్మ చాలా మంచి పాత్రలు చేశారు. ఆవిడ కూడా రంగస్థలం నుంచే వచ్చారు. మామూలుగా రంగస్థలం నుంచి వచ్చిన వారు ఆహార్యంపరంగా పెద్ద జాగ్రత్తలు తీసుకునేవారు కాదు. సినిమావాళ్ళతో పోలిస్తే వాళ్ళ మెయింటెనెన్స్ చాలా తక్కువ. అసలు ఆ రోజుల్లో లేడీ క్యారెక్టర్ ఆర్టిస్టులు బ్యూటీ మెయింటెనెన్స్ గురించి పట్టించుకునేవారు కాదు. కానీ అన్నపూర్ణమ్మ అప్పట్లోనే స్పెషల్‌గా ఉండేవారు. సినిమాకు సరిపోయేలా కనిపించేవారు. మనిషికూడా స్వతహాగా అందగత్తె కావడం ఇంకా ప్లస్ అయ్యేది. నేనంటే చాలా అభిమానం ఉన్నమనిషి. నాకన్నా అన్నపూర్ణమ్మగారు చాలా సీనియర్ నటి.

**(ఇంకా ఉంది)**

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**







# అత్తారింటికి దారేది?

**-సి.భవానీదేవి**

**సెల్‌ఫోన్ మోగింది. ఉలికిపాటుతో మెలకువ వచ్చింది వరలక్ష్మికి. సెల్‌ఫోన్‌లో దివ్య అనే అక్షరాలు ఆమెను మరింత ఉలికిపాటుకు గురిచేస్తున్నాయి. టైం చూసింది. సరిగ్గా అర్ధరాత్రి రెండు గంటలైంది. ఒక్కసారిగా లేచి మంచంమీద నిటారుగా కూర్చుంది. పక్కన మంచంమీద పరమేశం గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. ఎంత అదృష్టవంతుడో!**

ఫోన్ ఆన్‌చేసి మెల్లగా దివ్యా! అని పిలిచింది వణకుతున్న గొంతుతో. అవతలివైపు నుంచి ఏ మాటా వినబడలేదు. మళ్ళీ తనే కొంచెం కంగారుగా గట్టిగా దివ్యా!! అని పిలిచింది. ఒక తల్లిపడే ఆరాటంతోపాటు వరలక్ష్మి గొంతులో నిస్సహాయత కూడా ధ్వనిస్తోంది. దివ్య ఏం మాట్లాడలేదు. కానీ సన్నగా ఏడుపు వినిపించింది.

"ఏమైందమ్మా... ఇంత రాత్రివేళ ఫోన్ చేశావు, భయపడకుండా చెప్పు" అంటున్న వరలక్ష్మి గొంతులో వణకు దాగటం లేదు.

ఎక్కిళ్ళు దిగమింగి ఒక్క సెకను ఆగి దివ్య మెల్లగా అంది.

"మళ్ళీ ఆయన తలుపు కొడుతున్నాడమ్మా" అంటూనే భయంతో ఏడుస్తోంది. వరలక్ష్మి బుద్ధినీ, శరీరాన్నీ ఒక్కసారిగా ఎలర్ట్ చేసుకుంది. ఆమెలోని మాతృశక్తి నిదురలేచింది. ఇక లాభంలేదు, కూతురుకోసం తను ఈ క్షణంలో ఏమైనా చేయాలి! ఇప్పుడు ఈ క్షణం జారిపోతే కూతురు దక్కదు. తనలోని భయం, కంగారు అదిమిపట్టి దృఢత్వాన్ని పులుముకుంటూ దివ్యతో చెప్పింది, "వాడు ఎంత బాదినా నువ్వు తలుపు తీయకు. నేను మళ్ళీ నీకు పది నిమిషాల్లో ఫోన్ చేస్తాను దివ్యా! ధైర్యంగా ఉండు, ధైర్యంగా ఉండు."

"అమ్మా! నాకు భయమేస్తోంది. ఏం చేయాలో తెలియటం లేదు."

ఇంక మాట్లాడలేక దివ్య ఏడవటం మొదలు పెట్టింది.

"దివ్యా! ఇలాంటప్పుడే ధైర్యంగా ఉండాలి. నేను ఇప్పుడే నీకు ఫోన్ చేస్తాను. ఎటువంటి పరిస్థితుల్లోనూ తలుపు తీయకు" అని ఫోన్ కట్ చేసింది వరలక్ష్మి.

లేచి లైట్ వేసింది. కళ్ళమీద వెలుగు పడగానే పరమేశం ముఖం చిట్లించి కదిలాడు. వరలక్ష్మి అతడి మంచం దగ్గరకెళ్ళి "ఏమండీ!" అని మెల్లగా తట్టింది.

అతను కళ్ళు తెరచి చిరాగ్గా చూశాడు.

"ఏంటి?! నిద్ర పోనీకుండా".

"నిద్ర ఎప్పుడూ ఉండేదేలెండి. అవతల జీవితాలు మునిగిపోతుంటే" అని ఒక్కక్షణం ఆగి, ప్రాధేయపడుతున్నట్లుగా "ప్లీజ్ లేవండి. దివ్య ఫోన్ చేసింది" అన్నది. అతను ఒక్కసారి ఇటువైపు ఒత్తిగిల్లి కళ్ళు తెరచి తీక్షణంగా చూశాడు.

"దానికీ నీకూ పనీ పాటా ఏం లేదు" అన్నాడు విసురుగా.

వరలక్ష్మిలో కోపం కట్టలు తెంచుకుంది.

కుక్క ఈనినప్పుడు, తనకు పుట్టిన పిల్లల్ని వదలకుండా తను ఆకలితో మాడుతూ అయినా కాపలా కాస్తుంది. ఎవరైనా పిల్లల జోలికి వస్తేమాత్రం ప్రాణాలకు తెగించి పోరాడుతుంది. జంతువులైనా, మనిషైనా, తల్లి స్థానం ఒక్కటే. అందుకే వరలక్ష్మి కళ్ళు ఎర్రబడ్డాయి.

"వాడు మళ్ళీ తలుపు బాదుతున్నాడట! పిల్ల వణికిపోతోంది. లేవండి. ఇవాళ అటో ఇటో

తేల్చుకుందాం లేవండి..." అరిచింది.

అప్పటికిగానీ పరమేశానికి చురుకు తగల్లేదు. లేచి విసుగ్గా మంచంమీద కూర్చుని "నీ కూతురికి ఏమైందిట? అర్ధరాత్రివేళ అంకమ్మశివాలు. పగలంతా చాకిరీ చేసి, అలిసి పడుకుంటే నిద్ర కూడా పోనీయవే" అంటున్నప్పుడు అతని ముఖంలో కొంచెం కూడా ప్రేమ కనిపించకపోవటం గమనించింది. అలవాటైన పరిస్థితే అయినా వరలక్ష్మి తల్లి హృదయం మరింత తల్లడిల్లిపోయింది.

"మనం వెంటనే బయలుదేరాలి, దివ్య ప్రమాదంలో ఉంది. వెళ్ళి తెచ్చేసుకుందాం" రుద్ధమైన కంఠంతో చెప్పింది. అతను గడియారం కేసి ఓసారి చూశాడు. రెండున్నర గంటలయింది. "ఇంత రాత్రివేళ ఆటో కూడా దొరకదు. రేపు పొద్దున్నే వెళ్దాం. దాని అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది. పడుకో" అని ముసుగుతన్ని గోడకేసి తిరిగి పడుకున్నాడు పరమేశం.

ఇక ఆరునూరైనా నూరు ఆరైనా అతడు కదలని వరలక్ష్మికి అర్థమైంది. ఉసూరుమంటూ వచ్చి ముందుగదిలో కూర్చుంది. దివ్యకి ఫోన్ చేసింది. "అమ్మా" సన్నని గొంతుతో దివ్య పలికింది. వరలక్ష్మి తాను పూజించే దేవుళ్ళందరినీ ఒక్కసారి తల్చుకుని యుద్ధానికి సిద్ధమవుతున్న సైనికుడిలా మారిపోయింది.

"దివ్యా, నీకేం భయం లేదు" నువ్వు మాత్రం చాలా జాగ్రత్తగా నేను చెప్పేది విను. ఎటువంటి పరిస్థితుల్లోనూ తలుపు తీయొద్దు. ఎవరెంత బెదిరించినా భయపడొద్దు. మరీ అవసరమైతే 100 నెంబర్‌కి ఫోన్ చేయి. వాళ్ళు కూడా అంత తొందరగా స్పందిస్తారనుకోను. ప్రతీ అరగంటకీ నువ్వూ నేనూ మాట్లాడుకుందాం. తెల్లవారేసరికి నేను నీ దగ్గర ఉంటాను. నువ్వు నాతో రావటానికి సిద్ధంగా ఉండు. ముఖ్యంగా దేనికీ భయపడకు సరేనా!" స్థిరంగా అంది వరలక్ష్మి.

దివ్య గొంతులో కొంచెం ధైర్యం కనబడింది. "అలాగే అమ్మా. నేను జాగ్రత్తగా, ధైర్యంగా ఉంటాను. ఉదయం నీకోసం ఎదురు చూస్తాను" అన్నది. ఫోన్ డిస్‌కనెక్ట్ అయ్యింది.

వరలక్ష్మి కుర్చీలో అలాగే చేరగిలపడింది. దివ్య పసిపిల్లలా, పాపాయిగా బుడి బుడి అడుగులు వేస్తూ స్కూలుకెళుతూ కాలేజీకెళుతూ... సినిమా రీలులాగా ఆ దృశ్యాలు ఆమె కళ్ళముందు కనబడుతున్నాయి. భర్త పరమేశం అంతగా కుటుంబ బాధ్యత తీసుకోని మనిషైనా, దివ్యకి ఏ లోపం రాకుండా అల్లారుముద్దుగా, ఎన్నెన్నో కలల్ని కథలుగా వినిపిస్తూ పెంచింది వరలక్ష్మి. దివ్య ఇంజనీరింగ్ చదువుతున్నప్పుడే పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టింది.

"నేనిప్పుడే చేసుకోనమ్మా! ఉద్యోగంలో చేరాక చేసుకుంటా!" అంటున్న దివ్యకేసి ప్రేమగా చూసి ఇలా చెప్పింది.

"నేను చూస్తుంటాను. నీకు నచ్చింది దొరికినప్పుడు చదువు కొనసాగించే అవకాశమున్న సంబంధం దొరికినప్పుడు చేసుకుందువు గాని. నువ్వు నాకేం బరువు కాదు" అని కూతురుకి



నచ్చచెప్పింది.

వరలక్ష్మి అప్పుడప్పుడు మానసిక ప్రశాంతత కోసం ప్రవచనాలు వినేందుకు ఒక ఆధ్యాత్మిక గురువు దగ్గరకు వెళ్తూ ఉంటుంది. అక్కడ పరిచయమైంది కాదంబిని. ఇద్దరి అభిరుచులు కలవటం, స్నేహం కొనసాగటం... కొన్నాళ్ళు ఇలా జరిగింది. అసలు ఆమె పరిచయం కాకుండా ఉంటే ఎంతో బాగుండేది. ఈ రోజు దివ్య జీవితం ఇలా సాలెగూట్లో చిక్కుకున్నట్లుగా అయ్యేది కాదేమో!

మళ్ళీ సెల్‌ఫోన్ మోగింది. దివ్యే! కాసేపు ధైర్యవచనాలు చెప్పి మళ్ళీ అరగంటకు ఫోన్ చేయమని చెప్పింది వరలక్ష్మి.

"అమ్మా, అంతా పడుకున్నట్టున్నారు. నిశ్శబ్దంగా ఉంది. నువ్వు కూడా కాసేపు పడుకో. నీ ఫోన్ విని నేను తీస్తాను. ఇంక ఇప్పుడు నేను ఫోన్ చేయను. పొద్దున్నే వచ్చెయ్, ఎదురు చూస్తుంటాను" బేలగా అంది దివ్య.

కూతురికి ధైర్యంచెప్పి నిద్రపొమ్మన్నదే కానీ, వరలక్ష్మికి నిద్ర ఎలా పడుతుంది. ఆమె ఆలోచనలు సముద్ర అలలుగా ఎగిసిపడుతున్నాయి. అవి గతంకేసి ప్రవహిస్తున్నాయి.

●●●

ఆ రోజు సాయంత్రం ప్రవచనం పూర్తయ్యాక గురువుగారికి నమస్కరించటానికి తనూ, కాదంబినీ వెళ్ళారు. ఆయన ఆశీర్వదించి ఇద్దరివైపు తేరిపారచూసి వరలక్ష్మికి చెప్పాడు.

"కాదంబినిగారి అబ్బాయికి మీ అమ్మాయిని ఇచ్చి కల్యాణం జరిపించు" అంటూ చెరికాసిని అక్షింతలు ఇచ్చి కళ్ళు మూసుకుని కూర్చున్నాడు.

ఇద్దరూ సంతోషంతో బయటికి వచ్చారు. వరలక్ష్మి ఇంటికివచ్చి జరిగినదంతా భర్తకి వివరించింది. 'తెలిసిన వాళ్ళ పిల్లవాడు, అందంగా, తెల్లగా ఉంటాడు, అమెరికాలో సాఫ్ట్‌వేర్ జాబ్ చేస్తున్నాడు, సంప్రదాయ కుటుంబం' అనుకున్నారు ఆ దంపతులు.

కాదంబినీ కుటుంబం కూడా పెళ్ళికి అంగీకరించింది. ఉత్తేజ్, దివ్య స్కైప్‌లో ఒకరినొకరు చూసుకొని మాట్లాడుకున్నారు. 'ఇప్పట్లో పెళ్ళి వద్దు' అని అప్పటివరకు చెప్పిన దివ్య కూడా ఉత్తేజ్‌ని చూశాక సంతోషంగా ఒప్పుకుంది.

తమ శక్తికిమించినా ఉత్తేజ్‌తో దివ్య పెళ్ళి వైభవంగా జరిపించారు వరలక్ష్మి దంపతులు. దివ్య అత్తగారింటికి వెళ్ళింది. అమెరికా వీసా రావటానికి ఇంకా టైం ఉందనీ అప్పటిదాకా తల్లిదండ్రులతో ఉండమనీ, ఉత్తేజ్ తన తల్లిదండ్రుల దగ్గర దివ్యను వదిలి వెళ్ళాడు.

**అర్థరాత్రి రెండు గంటల సమయం. ఆ ఇంట్లో ఫోన్ మోగింది. ఉలికిపాటుతో లేచిందామె. ఫోన్ ఆన్‌చేసి పేరుపెట్టి పిలిచింది. అవతలివైపు నిశ్శబ్దం. కాసేపటికి సన్నగా ఏడుపు వినిపించింది. అమ్మా! ఆయన మళ్ళీ తలుపు కొడుతున్నాడమ్మా! అంది బేలగా. ఆ మాటలువిన్న ఆమె ఒక్కసారిగా ఎలర్టైంది. కంగారు, భయం అదిమిపట్టుకుని కూతురికి ధైర్యం చెప్పింది. ఇంతకూ ఆ అర్ధరాత్రి ఏం జరిగింది?**

కూతురుకి అన్నివిధాలా ధైర్యంచెప్పి ఫైనలియర్ పరీక్షలు దగ్గర్లో ఉన్నాయనీ, జాగ్రత్తగా చదువుకోమనీ చెప్పింది వరలక్ష్మి.

దివ్యని అత్తగారింట్లో వదిలొచ్చి పది రోజులయ్యింది. కూతురుమీద ప్రేమతో కాదంబిని ఇంటికి వెళ్ళిన వరలక్ష్మి దివ్యనిచూసి కలవరపడింది. చలాకీగా, ఆరోగ్యంగా, కళకళలాడుతూ ఉండే దివ్య ముఖం వాడిపోయి ఉంది. తీసుకెళ్ళిన స్వీట్స్, పళ్ళు కాదంబిని చేతుల్లోపెట్టి దివ్యతో మాట్లాడాలని ప్రయత్నించిన వరలక్ష్మికి ఆ అవకాశమే కరవైంది.

కాదంబిని, ఆమె ప్లీడర్ భర్త భానుమూర్తి అక్కడే వాళ్ళకు కాపలాగా కూర్చున్నారు.

ఏదో నచ్చని సంగతి..! ఇబ్బందిగా ఉంది లేదా ఏదో జరుగుతోందని గ్రహించింది వరలక్ష్మి.

"వదినగారూ అమ్మాయిని రెండు రోజులు మా ఇంటికి తీసుకెళ్తా, మాక్కూడా దిగులుగా ఉంది. మేము కూడా ఎక్కువగా వదిలి ఉండలేదు" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అంది వరలక్ష్మి.

కాదంబిని ముఖం మాడిపోయింది. ఆమె అసలు స్వరూపం మెల్లమెల్లగా బయటపడుతున్నట్లు అనిపించింది.

"ఇప్పుడు కుదరదులెండి. ఇప్పుడిప్పుడే అలవాటుపడుతోంది. దివ్యకు మీరేమీ పని నేర్పించకుండా పెంచారు. రేపు అక్కడకెళితే ఎలా చేసుకుంటుందో? ఇలాంటి భార్యతో వాడికీ ఇబ్బందే." కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్టు చెప్పింది.

వరలక్ష్మి అప్రతిభురాలై వింటోంది. తనతో ఇన్నాళ్ళుగా ఇంత స్నేహంగా తిరిగిన కాదంబిని ఈమేనా? అదంతా నటనా? ఎంత వంచన? నీ కూతుర్ని కడుపులో పెట్టుకొని చూసుకుంటానని చెప్పిన నోరేనా అది?

ఆపైన వరలక్ష్మి ఉన్నంతసేపు దివ్యకి ఏదో ఒక పని పురమాయిస్తూనే ఉంది కాదంబిని. తల్లితో అసలు మాట్లాడనీయలేదు.

ఉసూరుమంటూ బయలుదేరిన వరలక్ష్మికి మనసునిండా కొండంత అశాంతి, చెప్పలేని దిగులు. ఎందుకిలా జరుగుతోందనే బాధ.

గేటుదాకా వచ్చి తల్లిని సాగనంపుతున్న దివ్యతో చిన్నగా చెప్పింది వరలక్ష్మి.

"దివ్యా! భయపడకు. ఓ రోజు కాలేజ్ మానేసైనా మన ఇంటికిరా. నీతో చాలా మాట్లాడాలి" అన్నది.

దివ్య నిశ్శబ్దంగా తలూపింది.

ఇంటికి వచ్చినప్పటినుండీ వరలక్ష్మికి అన్నం సయించటం లేదు. నిద్రపట్టటం లేదు. పరమేశానికి ఇవేమీ పట్టవు. ఏదో మొదలుపెట్టి చెప్పబోతే "కొత్తల్లో అలాగే ఉంటుందిలే, వాళ్ళే సర్దుకుంటారు" అని కట్ చేశాడు.

నాలుగు రోజులకు దివ్య ఇంటికి వస్తూనే తల్లిని కావలించుకొని పెద్దగా ఏడ్చింది. ఇందులో కొంత తల్లిదండ్రుల మీద దిగులు అయ్యుండొచ్చని తనకు తానే నచ్చచెప్పుకొని కూతురుకి అన్నం తినిపించి, దగ్గర కూర్చోబెట్టుకుని కొత్త కాపురం గురించి అడిగింది వరలక్ష్మి.

దివ్య చెప్తున్న సంగతులు ఒక్కొక్కటి వింటున్నప్పుడు క్రమంగా వరలక్ష్మి కనుబొమలు ముడిపడ్డాయి. కోపంతో కళ్ళు ఎరుపెక్కాయి. స్నేహితురాలని నమ్మిన కాదంబిని ఇంత దుర్మార్గురాలా?! ఈ పెళ్ళి చెయ్యమని గురువుగారితో చెప్పించింది. ఆయనకి ఎంత లంచం ఇచ్చిందో?!

దివ్య వేదనగా తల్లితో చెప్పుకుంటున్నది. క్రమంగా వరలక్ష్మికి కళ్ళముందున్న తెరలన్నీ విడిపోతున్నాయి.

•••

కాదంబిని భర్తకి లేని అలవాటు లేదు. నిండా అప్పుల్లో మునిగి ఉన్నారు. ఆశపడి అమెరికా పంపిస్తే ఎం.ఎస్ పూర్తిచేసిన ఉత్తేజ్‌కి ఉద్యోగం దొరకలేదు. పెళ్ళి పేరుతో ఆ కుటుంబం కొన్ని అప్పులు తీర్చుకున్నారు. మూడు నిద్రలప్పుడే దివ్య గ్రహించిన విషయాలు చాలా ఉన్నాయి. అప్పుడే తల్లికి చెబితే తల్లకిందులవుతుందని ఓర్పు వహించింది. అతని పర్సునిండా ఆడపిల్లల ఫొటోలే. అమెరికాలో అతనికి ఒక స్త్రీతో 'సహజీవనం' ఉన్నట్లు దివ్యకి రూఢి అయ్యింది. అదేమని ప్రశ్నిస్తే,

"వాడు మగాడు, ఎంతమందినైనా చేసుకుంటాడు" అని కాదంబిని గర్జించింది.

పెళ్ళిలో దివ్యకి పెట్టిన అన్ని ఆభరణాలకూ కాళ్ళు వచ్చాయి. దివ్య ఎంతో ఇష్టపడి నేర్చుకున్న సంగీతం పాడటానికి వీల్లేదు. ప్రతి పనికీ వంక పెడుతోంది కాదంబిని.

"నువ్వు పొడుగ్గా, తెల్లగాలేవు. నా కొడుక్కి తగిన భార్యవి కాదు. వాడుమాత్రం ఏం చేస్తాడు" అని కాదంబిని అంటుంటే దివ్య కొన్నిసార్లు కళ్ళు తుడుచుకునేది. కొన్నిసార్లు ఎదురుతిరిగి 'అలాంటప్పుడు నన్నెందుకు చేసుకోవాలి" అనేది.

రోజూ ఉదయం పదిన్నరకల్లా కాదంబిని ఏం ఉద్యోగం చేస్తోందో ఏమోగానీ వంటపని చేసేసి అన్నంతిని వెళ్ళిపోతుంది. దివ్య కాలేజ్ నుండి వచ్చేసరికి ఇంట్లో భానుమూర్తి ఒక్కడే ఉంటాడు. మొదట్లో దివ్య మామగారిని చాలా గౌరవించేది. కాఫీ ఇచ్చేటప్పుడు చేతులు తగిలించటం, ఆకలి చూపులు చూడటం చూశాక కొంచెం దూరంగా ఉండటం మొదలుపెట్టింది. బట్టలు మార్చుకుంటున్నప్పుడూ, స్నానం చేస్తున్నప్పుడూ చాలా జాగ్రత్తపడేది. ఇవన్నీ అత్తగారికి తెలుసని దివ్యకి క్రమంగా అర్థమైంది. కడుపునిండా భోజనం లేదు. పచ్చడి మెతుకులే గతి. ఆర్థిక సమస్యలు. ఇంటెడు చాకిరీ. పైగా ఉత్తేజ్‌నుండి ఒక్కఫోన్ కూడా లేదు. ఈ మధ్య భానుమూర్తి దివ్య సెల్‌ఫోన్ తీసుకుని కాల్స్, మెసేజెస్ చెక్‌చేయటం, ప్రశ్నించటం కూడా మొదలుపెట్టాడు. దివ్య పరిస్థితి వరలక్ష్మికి అర్థమైంది. కూతురు జీవితం, ముఖ్యంగా కాపురం గురించి ఒక నిర్ణయం తీసుకోవాల్సిన సమయం వచ్చేసింది. హృదయంలో లావా పొంగుతున్నా, పైకి నిబ్బరంగా కూతురికి ధైర్యం చెప్పింది వరలక్ష్మి.

"దివ్యా! మనం జాగ్రత్తగా వ్యవహరించాలి. నేను ఒక లాయరుగారితో సంప్రదించి నీ విషయంలో జరగవలసిన సంగతులన్నీ ఆలోచిస్తాను. జీవితం, కాపురం కంటే విలువైనదని గుర్తుంచుకో. తెలిసో తెలియకో నిన్ను ఆ రొంపిలోకి నేనే దించాను. నేనే నిన్ను బయటకి తీసుకొస్తాను. అదీ వీలైనంత త్వరగానే. మీ అత్తగారికి అనుమానం రాకముందే ఆలస్యం కాకుండా నువ్వు బయలుదేరు. చాలా జాగ్రత్తగా ఉండు. పాము పడగ నీడలో ఉన్నట్లే భావించుకో. ఆ పాముకాటు పడకముందే నేను దానిపై వేటు వేస్తాను. రోజూ నాకు ఫోన్ చెయ్యి. ఏమీ జరగనట్టే ఉండు" అంటూ పరిపరి విధాల ధైర్యం నూరిపోసి కూతుర్ని అత్తగారింటికి పంపించాక వరలక్ష్మి లాయర్ శ్రీనివాస్‌కి డయల్ చేసింది.

•••

ఓ రోజు హఠాత్తుగా కాదంబిని, "రేపట్నుంచీ కాలేజీకి వెళ్ళక్కర్లేదు. మానేయ్. నువ్వు చదివి చేసేదేం లేదు. నిన్ను పనిమనిషిగా తెచ్చు



## స్వీటీ సీక్రెట్ బయటపడింది

మొన్నామధ్య 'బాహుబలి 2' పోస్టర్‌లో అనుష్క చాలా చాలా స్లిమ్‌గా కనిపించింది. నిజంగానే బరువు తగ్గిపోయిందేమో అని ఆమె అభిమానులు ఎంతో సంబరపడ్డారు. వారి సంబరం మూన్నాళ్ల ముచ్చటే అయింది.

'సింగం 3', 'నమో వెంకటేశాయ'లో అనుష్కను చూసిన వారికి కళ్లు బైర్లు కమ్మాయట! ఏమాత్రం బరువు తగ్గకుండా కనిపించిన అనుష్క ఆకృతి అభిమానులకు నిరాశ కలిగించింది అంటున్నారు. 'బాహుబలి 2'లో అలా కనిపించిందిగా? అని ప్రశ్నించేవారికి అదంతా గ్రాఫిక్ మాయాజాలం అన్న సమాధానమే వస్తోంది. గ్రాఫిక్స్‌తో ఎలాంటి అద్భుతాలైనా సృష్టించవచ్చు అన్నదానికి అనుష్క ఓ లైవ్ ఉదాహరణ అని చెబుతున్నారు.

కున్నాం" అని దివ్యతో చెప్పింది. ఆ రోజే దివ్య అత్తగారితో కచ్చితంగా చెప్పింది.

"చదువు కొనసాగిస్తానని పెళ్ళికి ముందు చెప్పాను కదా?! మీరు అన్నమాటమీద నిలబడండి. ఇప్పుడు కాదంటే నేను బయటికెళ్ళి చదువుకుంటాను" చెప్పింది దివ్య. ఆ తరువాత ఎందుకో కాదంబిని ఆ ప్రసక్తి తీసుకురాలేదు. రెండు రోజుల తరువాత జరిగిన భయంకరమైన సంఘటనతో దివ్య చాలా బెదిరిపోయింది.

ఎప్పటిలాగే కాలేజ్ నుండి వచ్చి, బట్టలు మార్చుకుని గదిలో కూర్చుని చదువుకుంటోంది దివ్య. ఆమెను మామగారు పిలిచారు. చేతిలో పుస్తకంతో అలాగే హాల్లోకొచ్చింది.

ఆయన వెకిలిగా నవ్వుతున్నాడు. "ఎంతసేపలా బోర్‌గా చదువుతావు? ఇలారా. వచ్చి ఇక్కడ కూర్చో. మంచి సినిమా వస్తోంది" అంటూ సోఫాలో తన పక్కన సీటు చూపించాడు.

దివ్య లోలోపల జంకుతూనే ఆయనకి కాస్త దూరంగా సోఫాలో కూర్చుని టీవీకేసి చూసింది.

అంతే!

దివ్య కళ్ళు భయంతో పెద్దవయ్యాయి. గుండె దడదడ కొట్టుకోవటం మొదలైంది. మనసంతా అసహ్యంతో నిండిపోయింది.

"ఛీ!" అంటూ ఒక్క ఉదుటున సోఫాలోంచి లేచి తన గదిలోకి విసురుగావెళ్ళి దఢాలున తలుపేసి గడియ పెట్టుకుంది.

ఎంత పొగరు! తేనెపూసిన కత్తి! కోడల్ని కూతురుగా చూసుకోవాల్సిన వ్యక్తి బ్లూఫిల్మ్ చూపిస్తాడా? నాకు మొదట్నుంచీ ఆయన వ్యవహారమే అదోలా ఉంటోంది. అస్సలు నచ్చటం లేదు. ఇక లాభం లేదు. అత్తగారికి ఇవన్నీ తెలియవని అనుకోవటానికి లేదు. తనతో ఏడు అడుగులు నడిచి మూడుముళ్ళు వేసి అగ్నిసాక్షిగా ప్రమాణం చేసిన ఉత్తేజ్‌కి తను అవసరం లేదు. తను ఈ ఇంట్లో ఎందుకు ఉండాలో అర్థం కాదు. కోపం, దుఃఖం కలగలిసిన ఆమె కన్నీళ్ళతో దిండు తడిసి పోయింది.

అత్తగారువచ్చి పిలిచేదాకా తలుపు తీయలేదు దివ్య. ఆవిడ వచ్చాక మామగారు ఏమీ ఎరగనట్లు మామూలుగా ప్రవర్తిస్తూ దివ్య ఏమైనా అంటుందేమోనని అతిగా నటిస్తున్నాడు.

ఇంటికెళ్ళిపోతే? అమ్మ చాలా బాధపడుతుంది. తన కూతురు సంసారం నెలరోజులకే భగ్నమైందని తలకిందులైపోతుంది. కొన్నాళ్ళకైనా ఉత్తేజ్ దగ్గరికి తను వెళ్ళిపోతుందని, అమెరికాలో సుఖంగా ఉంటుందని అమ్మ అనుకుంటోంది. కానీ అవన్నీ జరగవని తెలిపోయింది. పైగా కామంతో కళ్ళు పొరలు కమ్మిన ఈ మామగాడి సంగతి అమ్మకెలా చెప్పాలి? అయినా చెప్పాలి, తప్పదు.

రెండు మూడురోజుల్లో అన్నీ సర్దుకుని అమ్మ దగ్గరకెళ్ళిపోవాలి. సంఘం, పరువు ఈ పదాలన్నింటినీ కూతురుకోసం లెక్కచేసే స్వభావం కాదు అమ్మది. దివ్య ఆనాటినుంచీ అదే పనిలో ఉంది. అది జరిగిన రెండవరోజునే.. అర్థరాత్రి దివ్య గది తలుపు చిన్నగా చప్పుడైంది.

"దివ్యా తలుపు తియ్, నేనే.."

మామ భానుమూర్తి గొంతు. మొదట నెమ్మదిగా, తర్వాత ప్రాధేయపడుతూ కొంచెం కోపంగా.. అలా గది తలుపు తట్టిన భానుమూర్తి ఆ రాత్రి ఇక లాభం లేదని పడుకున్నాడు.

●●●

దివ్యకీ, వరలక్ష్మికీ సూర్యోదయం అయింది.

వాకిట్లో ఆటో ఆగిన శబ్దంచూసి బయటికొచ్చిన కాదంబిని, వరలక్ష్మిని చూసి ముఖం మాడ్చుకుంది.

ఆమె ఆహ్వానించకపోయినా వరలక్ష్మి దంపతులు లోపలికి నడిచారు.

దివ్య గది తలుపు తీయటం, సూట్‌కేస్‌తో బయటికి రావటం ఒకేసారి జరిగాయి.

దివ్యనీ, సూట్‌కేస్‌నీ కాదంబిని చూస్తూనే, తీక్షణంగా ఏమిటిది? అంది. అలా అంటుండగానే, వరలక్ష్మి దివ్య చేయి పట్టుకుని లాక్కెళుతున్నంత వేగంగా గేటుకేసి నడిపిస్తూ, "ఏమిటో ఇంకా చెప్పాలా? నీ మొగుణ్ణి అడుగు, నీ మనసుని అడుగు. స్నేహం పేరుతో డబ్బుకోసం నా కూతురు జీవితం సర్వనాశనం చేశావు. నీతో మాట్లాడటమే వృథా పద దివ్యా" అంటూ కూతురుతో కలిసి ఆటో ఎక్కేసింది.

పరమేశం ఎప్పటిలాగే భార్యని అనుసరించాడు.

కాలచక్రంలో ఐదేళ్ళు గడిచాయి. కలెక్టర్ కారులోంచి పట్టుచీర, సింపుల్ నగతో హుందాగా బాబా గుడి ముందు దిగింది దివ్య. స్ఫురద్రూపంలో ఫుల్‌సూట్ ధరించిన భర్త, దివ్య తల్లిదండ్రులు ఆమె వెంట ఉన్నారు.

దర్శనమయ్యాక బయటికివచ్చి వరుసలో కూర్చున్న బిచ్చగాళ్ళకు చిల్లరనాణేలు పంచుతూ వెళ్తోంది వరలక్ష్మి. అప్పటికే పరమేశం, దివ్య, ఆమె భర్త కారులో కూర్చున్నారు. బిచ్చగాళ్ళ వరుసలో ఒక వ్యక్తిని చూసి ఉలికిపాటుతో మళ్ళీ చూసింది వరలక్ష్మి. సందేహం లేదు... ఆమె కాదంబినే! కానీ ఇక్కడ ఇలా..?

దూరంగా చెట్టునీడలో శుష్కించిపోయి మట్టి గొట్టుకుని పడివున్న భానుమూర్తి ఆమె కంటపడలేదు.

వాళ్ళిద్దరూ ఈ స్థితికి రావటానికి కారకుడైన పుత్రరత్నం ఉత్తేజ్ డ్రగ్ మాఫియాలో నేరస్థుడిగా అమెరికా జైల్లో మగ్గుతున్న విషయం వరలక్ష్మికి తెలిసే అవకాశం కూడా లేదు.

మరుక్షణం తలతిప్పుకుని మిగిలిన బిచ్చగాళ్ళను పట్టించుకోకుండా గబగబా ఎవరో తరుముకొస్తున్నట్టు కారువైపు నడిచింది వరలక్ష్మి.

అభయహస్తంతో చిరునవ్వులు చిందించే బాబాగారి గుడి ముంగిట యాచకుల్లో కాదంబిని లాంటి వాళ్ళు ఉండటం వాళ్ళ స్వయంకృతాపరాధమే!

సెల్:98668 47000

# వావ్! వీళ్ళు గ్రేట్!






**గొప్ప వాళ్లు ఎక్కడి నుండో ఊడిపడ లేదు. గొప్ప విజయాలు సాధించినవాళ్లంతా ఒకప్పుడు అపజయాలతో కుంగిపోయినవారే. ఓటమితో పట్టుదల పెంచుకుని, నిరాశను జయించి సాధనతో గ్రేట్ అనిపించుకున్నవాళ్లే. అందుకే ఓటమి భయం, ఓడిపోయామనే ఆవేదన ఉండకూడదు. విధి బెదిరించినా, వైకల్యం వెంటాడినా వెనుకడుగేయకూడదు. వైఫల్యం వల్ల, అనుకోని సంఘటనల వల్ల అనుభవం వస్తుంది. పట్టుదల వస్తుంది. ఎందరో సామాన్యులు ఇలా ఎదిగి గొప్పవాళ్లుగా రూపాంతరం చెందినవారే. ఇప్పుడు చెప్పుకోబోయేవాళ్లు కూడా ఒకప్పుడు సాధారణ వ్యక్తులే. కానీ విధి వైపరీత్యం వల్ల వికలాంగులయ్యారు. అయినప్పటికీ వారి ప్రతిభ చూస్తే ఆశ్చర్యపోవాల్సిందే. మరి వారి గురించి తెలుసుకుని మనమూ స్ఫూర్తి పొందుదాం రండి.**

**సమస్యలెన్ని చుట్టు ముట్టినా ధైర్యం కోల్పోకుండా, జీవితంపై పోరాడి గెలిచారు. అయ్యో పాపం అనే జాలిమాటలు కాదు అమ్మో! వావ్! వీరు గ్రేట్ అనిపించుకోవాలనుకున్నారు. అనిపించుకుంటున్నారు కూడా! కోల్పోయింది కేవలం శరీర అవయవాలే తప్ప, తమలోవున్న ఆత్మవిశ్వాసం, ప్రతిభ, ధైర్యం మాత్రం కాదని నిరూపిస్తూ, తోటివారిలో స్ఫూర్తి నింపుతున్నారు.**

**విధికి ఎదురునిలిచి పోరాడి తమ తమ రంగాల్లో రాణిస్తున్న ధీర వనితల గురించి...**

### పారా ఒలింపిక్స్ లక్ష్యం

ముంబయికి చెందిన అమ్మాయి మానసి. భారతదేశం నుంచి 2016 పారా ఒలింపిక్స్‌లో పాల్గొన్న బ్యాడ్మింటన్ క్రీడాకారిణి. వచ్చే పారా ఒలింపిక్స్‌లో స్వర్ణపతకమే ఆమె లక్ష్యం. 2011వ సంవత్సరానికి ముందు ఆమె కూడా మనందరిలాగానే ఉండేది. కానీ ఆ ఏడాది రోడ్డు ప్రమాదంలో తీవ్రంగా గాయపడి కుడికాలు కోల్పోయింది మానసి. అయినా ఏమాత్రం పట్టువదలకుండా, తన లక్ష్య సాధనకు వైకల్యం అడ్డుకాదని నిరూపిస్తోంది. 2011లో జరిగిన కార్పొరేట్ బ్యాడ్మింటన్ లీగ్‌లో రజతం సాధించిన ఆమె, 2012లో ప్రమాదం తర్వాత ఒంటికాలుతోనే పోటీలో పాల్గొని స్వర్ణపతకం గెలుచుకుంది. ఆపై పారా ఒలింపిక్స్‌కి అర్హత సాధించింది. ప్రపంచ పారా బ్యాడ్మింటన్ సింగిల్స్‌లో మానసి ఐదో స్థానంలో, మిక్స్‌డ్ డబుల్స్‌లో మూడో స్థానంలో ఉండడం విశేషం. వచ్చే పారా ఒలింపిక్స్‌లో ఆమె అనుకున్న లక్ష్యం సాధిస్తుందని ఆశిద్దాం.

### ఆమె జీవితం కత్తిమీద సాము..

కిరణ్ కనోజియా మనదేశంలోనే మొదటి బ్లేడ్ రన్నర్. ఆమె ఓ సాఫ్ట్‌వేర్ ప్రొఫెషనల్ కూడా. అయితే పాతికేళ్ళ వయసు వరకూ ఆమె జీవితం సాధారణంగానే సాగింది. తన 25వ పుట్టినరోజు సెలబ్రేట్ చేసుకోవడానికి తల్లిదండ్రుల వద్దకు ఫరీదాబాద్ బయల్దేరిందామె. రైల్లో తలుపు వద్దే ఆమె సీట్. ఇక అరగంటలో తను దిగాల్సిన స్టేషన్ వస్తుందనే ఆనందంలో తేలియాడుతుండగా ఇద్దరు దుండగులు ఆమె బ్యాగ్ లాక్కునే ప్రయత్నం చేశారు. ఆమె అడ్డుకుంది. దాంతో వారు బ్యాగ్ దొంగిలించలేకపోయారు. ఈ పెనుగులాటలో ఒక దుండగుడు ఆమెను రైల్లోంచి తోసేశాడు. దాంతో ఆమె కాలు తలుపులో ఇరుక్కుపోయి శరీరం కిందకు వేలాడింది. ప్రయాణికులు వెంటనే గుర్తించి ఎమర్జెన్సీ చైన్ లాగినా ఫలితం లేకుండా పోయింది. ఆ ప్రమాదంలో కాలును పోగొట్టుకుంది ఆమె. అయినప్పటికీ పట్టు సడలకుండా తనకంటూ ఓ గుర్తింపు తెచ్చుకోవాలని భావించింది. బ్లేడ్ రన్నింగ్‌లో సాధన చేసింది కిరణ్ కనోజియా. తద్వారా మన దేశంలో మొదటి బ్లేడ్ రన్నర్‌గా పేరు సంపాదించుకుంది. తాను నివసించే ముంబయిలోనే కాదు దేశంలో ఎక్కడ పరుగు పందాలు జరిగినా అందులో కిరణ్ పాల్గొంటుంది.

### పట్టువదలకుండా

బెంగళూరు మహిళ షాలిని సరస్వతి. మంచి నాట్యకళాకారిణి. నాట్యం అంటే ఆమెకు ప్రాణం. బీపీవో ప్రొఫెషనల్. గర్భవతిగా ఉండగా కంబోడియా వెళ్ళొస్తున్నప్పుడు జ్వరపడింది. ముందు సాధారణ జ్వరం అనుకున్నారు. తర్వాత డెంగ్యూ కావచ్చుననుకున్నారు వైద్యులు. కానీ అరుదైన బ్యాక్టీరియల్ ఇన్ఫెక్షన్ రికెట్సియా విత్ మోర్ఫ్ అని పరీక్షల్లో తేల్చారు. ఈవ్యాధివల్ల గర్భస్థశిశువును పోగొట్టుకోవడమే కాదు, చాలా రోజులు ఐసీయూలోనే








చికిత్స పొందింది. కేవలం ఐదు శాతం మాత్రమే జీవించే అవకాశాలు ఉన్నాయని ఒకానొకదశలో వైద్యులు చెప్పారు. మృత్యువుతో పోరాడిమరీ మనుగడ సాగించింది. అయితే బ్యాక్టీరియల్ ఇన్ఫెక్షన్ వల్ల ఆమె ఎడమ చేయి తొలగించారు. అయినా పర్లేదులే మనిషి దక్కిందనుకునేంతలోనే కాళ్లకు గాంగ్రేన్ రావడంతో కాళ్లు కూడా తొలగించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆ తర్వాత కుడిచేయి కొద్దికొద్దిగా కుళ్లిపోయి ఊడిపోయింది. డాక్టర్ వద్దకు వెళ్లిన ప్రతిసారీ నొప్పితో ఆమె నరకయాతన అనుభవించేది. కుళ్ళిన మృతకణాలు తొలగిస్తున్నప్పుడు వైద్యులు ఆమెకు అనస్థీషియా కూడా ఇచ్చేవారుకాదు. నొప్పితో ఏడిస్తే కణాలు బతికున్నాయని నొప్పి లేకపోతే మృతకణాలనీ గుర్తించి వాటిని తొలగించేవారు వైద్యులు. నరకయాతనతో అవయవాలు కోల్పోయినా ఆమెలో ఆత్మవిశ్వాసం ఏమాత్రం తగ్గలేదు. ఏదైనా సాధించాలన్న తపనతో బ్లేడ్ సాయంతో నాట్యం ప్రారంభించింది. చిన్నతనంలో భరతనాట్యం నేర్చుకుంది షాలిని. ఆమె కాళ్లు, చేతులు పోగొట్టుకున్న తర్వాతే సల్సా, కాంటెంపరరీ నృత్య రీతుల్ని కూడా అభ్యసించి ప్రదర్శనలు ఇస్తోంది. కేవలం డ్యాన్స్ మాత్రమే కాదు తను మంచి రన్నర్ కూడా. బ్లేడ్ సాయంతో రన్నింగ్ ప్రాక్టీస్ చేసింది. 5 కె, 10 కె వంటి పరుగులలో సైతం పాలు పంచుకుంటోంది.

## ఏదేమైనా నవ్వేసెయ్

జీవితంలో ఎంత కష్టమొచ్చినా సరే నవ్వితే అన్నీ తీరిపోతాయి అంటుంది ముంబయికి చెందిన అంతరా తెలాంగ్. లాఫ్ గురు సంస్థలో కంటెంట్ హెడ్‌గా పనిచేస్తోంది. నాట్యం అంటే ఆమెకు చాలా ఇష్టం. చిన్నప్పుడు నాట్యం నేర్చుకుంది. అప్పట్లో చాలా ప్రదర్శనలు ఇచ్చేది. కేవలం నాట్యమేకాదు, బొమ్మలు గీయడం, ఆసక్తికర కథనాలు, కథలు రాయడం ఆమె ఇష్టాలు. అయితే పద్దెనిమిదేళ్ల వయసులో ఆమె జీవితం పూర్తిగా మారిపోయింది. ముంబయిలో కురిసిన భారీవర్షానికి ఓ పెద్ద రావిచెట్టు కూలి అటుగా వెళ్తున్న అంతరా తెలాంగ్‌పై పడింది. ఈ ప్రమాదంలో ఎడమ కాలు రెండు ముక్కలైంది. కుడికాలు పాదంమొత్తం నుజ్జునుజ్జయిపోయింది. దీంతో ఆమె కుడికాలు తొడ భాగం వరకూ తొలగించారు. అయితే వైకల్యం తన అభిరుచికి ఏమాత్రం అడ్డుకాదని భావించింది అంతరాతెలాంగ్. ఒంటికాలితోనే డ్యాన్స్ చేయడం సాధన చేసింది. మంచి డ్యాన్సర్‌గా పేరు తెచ్చుకుంది. అనేక అవార్డులు గెలుచుకుంది. ఇప్పుడు కృత్రిమ కాలితోనే ప్రదర్శనలిస్తోంది.

## రోల్‌మోడల్

కాలేజీ విద్యార్థిని షెరిల్. మోడల్ కావాలనేది తన లక్ష్యం. అందుకే కాలేజీ ఫంక్షన్స్‌లో బయట జరిగే చిన్న చిన్న మోడలింగ్ షోలలో పాల్గొనేది. ఆమె కన్నకలలకు ఓ ప్రమాదం రూపంలో విధి అడ్డుతగిలింది. 2016లో జరిగిన ఓ ప్రమాదంలో ఆమె కాలు తీసేయాల్సి వచ్చింది. అయినప్పటికీ ఆత్మవిశ్వాసం కోల్పోలేదు షెరిల్. కృత్రిమ కాలుతోనే మోడలింగ్ ప్రారంభించింది. గొప్పగొప్ప మోడల్స్ సైతం ఆశ్చర్యపోయేలా షెరిల్ మోడలింగ్ ప్రదర్శనలుంటాయి.

అలా విధి నిర్మించిన అడ్డుగోడదాటి ఒంటికాలితోనే ముందడుగు వేసింది షెరిల్. ప్రస్తుతం బెంగళూరులో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తోంది. చదువుకొనసాగిస్తూనే తన కల సాకారం చేసుకోవడానికి ప్రయత్నిస్తోంది.

ఇలా విధి వైపరీత్యంవల్ల వివిధ రకాలుగా వైకల్యం బారినపడినప్పటికీ, తమదైన రంగంలో దూసుకుపోయేవారు మన చుట్టూ అనేకమంది ఉన్నారు. వారందరూ తమలోని ఆత్మవిశ్వాసం, ధైర్యం కోల్పోకుండా ముందడగు వేస్తున్నారు. వారందరికీ చేయూతనిద్దాం. మన జీవితం మనకుపెట్టే పరీక్షల్ని సమర్థంగా ఎదుర్కొని ముందుకు సాగేందుకు మనకూ ఇలాంటివి స్ఫూర్తినిస్తాయనడంలో సందేహమేమీ అక్కర్లేదు.

**-సంతోషి దహగాం**

## రియల్ హీరోల క్యాలెండర్

ప్రతి సంవత్సరం ఓ కొత్త క్యాలెండర్‌ను వినూత్నంగా రూపొందించడం బీయింగ్ యూ అనే సంస్థ అలవాటు. అదేవిధంగా ఈ సంవత్సరం కూడా ఒక కొత్త క్యాలెండర్ రూపొందించింది ఆ సంస్థ. ఆ క్యాలెండర్ మాత్రం పోరాడిగెలిచిన రియల్ హీరోల గురించే. ఈ క్యాలెండర్‌లో ఒలింపిక్స్ పతక విజేత మరియప్పన్ తంగవేలు సహా మరో పన్నెండుమంది ఉన్నారు. అందులో ఐదారుగురు అమ్మాయిలున్నారు. వివిధ ప్రమాదాల బారిన పడి లేదా ఆరోగ్య కారణాలవల్ల దివ్యాంగులుగా మారిన వీరిని పరిచయం చేస్తూ జీవితంలో పోరాడే స్ఫూర్తిని మనకు కలిగిస్తోంది ఆ క్యాలెండర్.




# జీజీజీ!

**"డాక్టరుగారో!"**

**ఆసుపత్రి అంతా వినిపించేట్లుగా ఉంది ఆ కేక!**

**మెడ కనపడని లావులోంచి, పెగిలి పెల్లుబికిన గొంతు! చూసిన వాళ్లు తప్పితే చూడకుండా విన్నవాళ్లెవరూ అది ఓ మహిళాగళం అనరు.**

**ఆమె పేరు శుంభ. వెంట పదేళ్ళ పిల్లవాడు, పొట్టిగా లావుగా పొట్టఉబ్బి ఉన్నాడు. "టోకెన్ తీసుకుని క్యూలో కూర్చోవమ్మా. ఇక్కడ పదిమంది ఉన్నాం" అన్నతన్ని ఎత్తి కుదేసినంత పని చేసింది శుంభ!**

శుంభ చేసిన హడావిడికి డాక్టరుగారు బయటికి రావాల్సి వచ్చింది.

'ఏంటమ్మా, ఏమైంది, ఆ ఎత్తున గగ్గోలు పెడుతున్నావు. ఎక్కడున్నావో నీకు తెలుస్తోందా" అన్నాడు డాక్టరు.

"నా కొడుకు పది! పది గోలీలు మింగాడు. డాక్టరుగారో మరి" అంది శుంభ.

"నిద్రమాత్రలు కావుగా" అన్నాడు డాక్టరు.

'గోలీలంటే మాత్రలంటారేం! ఆడుకుండే గాజు గోలీలు!"

"గాజువేగా... వజ్రాల ఉండలేం కావుగా".

"డాక్టరు గారూ! నా జీవితంతో ఆడుకుంటున్నారు. నా మొగుడెవరో తెలుసా, గూండాలకు గూండా, ఏమనుకుంటున్నారో" అక్కడున్నవాళ్ళకు కూడా ఓ హెచ్చరిక చేస్తున్నట్లు అంది.

"పేరేంటమ్మా"

"నా పేరా, ఈడి పేరా, ఈడి తండ్రి పేరా"

"ఆయనెవరో చెప్పి భయపెట్టావే, ఆయన పేరు"

"గుండు గండన్న గూండా! ఇంటిపేరు, ఒంటి పేరు, పేరుపడ్డ పేరు".

"భలేగా చెప్పావే"

"నేను ఎవరికైనా అంతే చెబుతా"

"ఏం చేస్తుంటాడేంటి"

"గూండాగిరి, వేరే చెప్పాలా" ఘనంగా చెప్పింది.

"అంటే ఏంటో?" నిజంగానే తెలియనట్లు అడిగాడు డాక్టరు.

"ఇరగదీస్తాడు, చించుతాడు, పగల గొడతాడు, ఎముకల్లో సున్నం లేకుండా చేసి బట్టీలు పెడతాడు" ముఖంలో ముడతలు మార్చి చెప్పింది.

"ఇంకేం చేస్తాడు"

"అంతకంటే ఏం చేస్తాడు"

"రాళ్లను గుగ్గిళ్లనుకుని మింగుతాడు" చెప్పాడు డాక్టరు.

"అదెప్పుడూ లేదే"

"ఇప్పుడుంది కాబట్టే చెబుతున్నా".

"నాలుక మలుపులుతిప్పి, మాటల పలుపులిప్పకండి డాట్టరో! అయినా కండల్లో సూదులు గుచ్చేవాడికి గుండెల్లో గునపాలు దించేవాడి సంగతేం తెలుస్తుందిలే" అంది.

"నేనన్నది నిజమేనమ్మా"

"డాట్టరో! నేను ఆవులిస్తే గొంతులోకి దూరతావు, జాగ్రత్త".

"అంత పనిచేయకుగానీ! ఆ పేరుగలాయనే, జీజీజీ అంటారటగా, పేగుల్లో రాళ్లు మడతపడి, పై అంతస్తులో చివరి బెడ్‌మీద అంతులేని మత్తులో ఉన్నాడులే".

"లేదు. ఆ పేరుతో ఇంకోడుండడానికి ఈల్లేదు. ఈల్లేదుగాక ఈల్లేదు".

"ఉన్నాడో లేడో ఒకసారి పైకెళ్ళి చూడు".

"ముందీడి సంగతి చూడండి" గట్టిగా అని "నా ప్రాణానికి ఒకడు పట్టాడు, ఒకడు పుట్టాడు మింగుడుగాళ్లు" అని గొణిగింది.

●●●

చాలారోజుల తర్వాత మళ్లీ వచ్చింది!

ఈసారి వాతావరణం ప్రశాంతంగా ఉంది.

చీరకట్టులో, జడముడిలో, మాట, సంస్కారంలో ఎంతో తేడా ఉంది.

అన్నిటికన్నా స్త్రీ గాత్రం మధురంగా ఉంది. ఇంతమార్పు ఎలా వచ్చిందో ఊహకు అందడం లేదు డాక్టరుగారికి. ఒకింత ఆశ్చర్యపోయాడు! ఈ పరిశీలన ఇలావుంటే వెంటవచ్చిన అతను అతనుకాదు. పిల్లవాడు రాలేదు. పిల్లవాడు అంతపెద్దవాడు కావటానికి ఆస్కారమేలేదు. ఒకవేళ తనే ఏదన్నా పొరపాటు పడుతున్నాడేమో భ్రమే. అయితే మరీ ఇంత అయోమయంలో పడేస్తుందా! క్షణంలోనే ఎంతో ఆలోచనలో పడ్డాడు డాక్టరు.

"డాక్టరుగారూ, మా వారికి రాత్రంతా నిద్ర లేదు. కన్నీళ్ళే తక్కువ అన్నట్లుగా కడుపునొప్పితో బాధపడ్డారు. మేలుకొని ఉన్నంత సేపూ మెలికలు తిరిగారు" చెప్పింది.

ఏమిటీ భాష, ఉచ్చారణ!

"ఏంటి! మీ ఇంట్లో ఎప్పుడూ ఎవరో ఒకరికి ఉదరసంబంధ ఫిర్యాదులేనా" అన్నాడు జవాబు బట్టి సంగతి తెలుస్తుందన్న ఉద్దేశంతో.

"అదేంటండీ! ఎప్పుడూ లేదే! పైగా మేం మీ దగ్గరికి రావడం ఇదే మొదటిసారి" ఆవిడ మాటలతో తేరుకున్నాడు డాక్టరు.

"సరే! ఈరోజు చూడండి. ఈ మాత్రలు దగ్గర ఉంచుకోండి. నొప్పి వచ్చినప్పుడు ఒకటి వేయండి, అయినా తగ్గకపోతే తీసుకురండి, ఎంత రాత్రయినా ఫరవాలేదు" అన్నాడు డాక్టరు.

"డాక్టరుగారు, ఎవర్నోచూసి ఎవర్నో అనుకున్నట్లున్నారు" అన్నాడతను.

"ఆఁ! అటువంటిదేదో అయుంటుంది" అని నవ్వాడు డాక్టరు.

ఆయన గొంతులోకూడా తేడా ఉంది. మొహం మీద మీసాలు లేవు. మెలికలు లేవు! ఇంకా తడబాటులోనే ఉన్నాడు డాక్టరు. ఇకపేర్లు వినడమే మిగిలింది అనుకున్నాడు. ఏదో కాయితం తీసి రాస్తూ-

"మీ పేరు!" అడిగాడు డాక్టరు.

"నికుంభ!" చెప్పిందావిడ

"మీ వారి పేరు!"

"నాగాభరణం!"

●●●

"మందుమత్తులో మాటామాటా పెంచి, ఏదో పందెం! పోటీ అని, రాళ్ల గుగ్గిళ్లను మింగించినవాణ్ణి వెతికి పట్టుకున్నాడు గూండా గుండు గండన్న. వాడు చావకూడదు. బతికేవుండాలి. బతికి ఉన్నంత కాలం నొప్పి తెలుస్తూనే ఉండాలి. అనే కక్షతో దొరికినవాణ్ణి చితకబాదాడు. శుంభకూడా కొంత వీరవనితా విహారం చేసింది. పోలీసులువచ్చి ఇద్దర్నీ తీసికెళ్ళి జైల్లో నేల పరుపులమీద పడేశారు" భార్యతో చెప్పాడు డాక్టరు.

"ఆ పిల్లవాణ్ణి!" అడిగింది భార్య.

"అప్పీలు పెడితే వాడికి రక్షణగా ఓ పోలీసుని పెట్టారు. ఆ తర్వాత కోర్టు శుంభని విడుదల చేసింది. జీజీజీకి ఇప్పట్లో విముక్తి లభించేట్లు లేదు. ఎందుకంటే దెబ్బలు తిన్నవాడికి పక్షవాతం వచ్చింది" చెప్పాడు డాక్టరు.

"ఆసుపత్రి అన్న తర్వాత ఎవరో వస్తుంటారు, పోతుంటారని వదిలేయకుండా మీకు వీళ్లమీద ఇంత శ్రద్ధదేనికో" సందేహ నివారణకోసం అడిగింది.

"దేనికంటే, విలువలేని వ్యక్తులు, మెదడు ఉపయోగించలేని వాళ్లూ, అక్కడక్కడా ఆసుపత్రుల్లో అరాచకపు గోల చేయడం మనకు తెలిసిందేగా.."

"ఈ గోల మనకెందుకని నేను చెబుతుంటే, ఆ గోల గురించి చెబుతారేం" అంది భార్య.

**శుంభ గగ్గోలుగా హాస్పిటల్‌కి వచ్చిపడింది. తన కొడుక్కి ఉదరంలో నొప్పి! ఆమె మాట తీరు కర్ణకఠోరం! బిహేవియర్ రఫ్ అండ్ టఫ్. చిరాకుపడ్డాడు డాక్టరు. ఆరాతీస్తే ఓ పెద్ద గూండా గుండుగండన్న భార్య అని తేలింది. కొంతకాలానికి మళ్ళీవచ్చిందామె. ఈసారి రూపంలో సంస్కారం, గాత్రంలో మధురం, తీరులో ప్రశాంతత ఉట్టిపడింది! ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపోయాడు డాక్టరు! ఇంతలోనే అంతమార్పా? ఆమె ఈమె కాదా? ఈమె ఆమె కాదా?**

"శుంభ గొంతు నాకు నచ్చింది" అన్నాడు డాక్టరు.

"పాడుతా తీయగా! అన్నదా ఏమిటి ఎప్పు డన్నా మీ చెవిలో".

"అదికాదోయ్! మన ఆసుపత్రిలో అజమాయి షీకి ఆ గొంతు అవసరం. మామూలుగా మంచిగా చెబితే విననివాళ్ల నోళ్లు మూయించగలదని శుంభ పైన నాకో నమ్మకం ఏర్పడింది".

"ఎవరన్నా వింటే నవ్వుతారండీ"

"ఆ గొంతు నవ్వించే గొంతుకాదు"

"నేననేది మీ సంగతి వింటే, అని"

"అదొదిలేయ్. ఇది కూడా ఆసుపత్రి నిర్వహ ణలో ఒక భాగమే".

"సరే! మీ ఊహలో లేనిది మీకొకటి చెబుతా" అంది భార్య.

"తొందరగా చెప్పు"

"ఆ శుంభ, నికుంభలు కవలలు".

"నీవు ఊహిస్తున్నావా, నాకు తెలియకుండా రక్తపరీక్ష చేయించావా" అన్నాడు డాక్టరు నవ్వుతూ.

"మాఊరి వాళ్ల గురించి ఊహించడమేం టండీ.." అంది భార్య. ఆశ్చర్యపోయాడు డాక్టరు.

●●●

'గుండుగండన్న గూండా గుండె ఆగిపోయింది. జీజీజీ మనకిక లేడు. అంతకంటే వివరాలకేం ప్రాముఖ్యత ఇవ్వలేదు పేపర్లో' పెద్దగా చదివి చెప్పాడు డాక్టరు.

"ఆయన రంగంలో ఆయన ప్రముఖుడే కాబట్టి రోజంతా చూపిస్తారేమో టీవీల్లో అనుకున్నా" అంది భార్య.

"చూపించినా ఆశ్చర్యం లేదనుకో! ఏ మాటకా మాట. అటువంటి వాళ్లుండబట్టేగా పోలీసులకు పనీ, ఉద్యోగాలూ, ప్రమోషన్లూ, ఇళ్లూ, వాకిళ్లూ, వెక్కిళ్లూ, వేవిళ్లూ" అన్నాడు నవ్వుతూ.

"అందరూ ఆరోగ్యంగా ఉంటే మీ ఆసుపత్రి అవసరం ఏముంటుంది? శుంభ గురించి ఆలోచన మీకెందుకుంటుంది?" అన్నది భార్య.

"అవును కదా" అన్నాడు డాక్టరు.

●●●

"ఈ మధ్య మీరు శుంభ, నికుంభలని తల వడం లేదెందుకో. మా ఊరివాళ్లని తెలిసినందుకా? నాకు తెలిసిందని తెలిసినందుకా?" అన్నది.

"శుంభ ఏదో సెక్యూరిటీ కంపెనీలో చేరిందిట. పిల్లవాణ్ణి ఏదో బళ్లో చేర్పించిందిట" అన్నాడు డాక్టరు.

"అట అని అనకపోతే, మీరెళ్లి కనుక్కొచ్చారని అనుకుంటాననుకున్నారా? అలా ఎందుకనుకుంటా లెండిగానీ, మీరన్నట్లు, శుంభకు అక్కడ చోటు దొరకడానికి ఆ గొంతే కారణమా? భర్త చావు కారణమా?" అంది.

"అదేమోగాని, తనెక్కడ పనికొస్తానో అని తనకు తెలియడం విశేషం. నీలాగా చదువుకుని ఉంటే ఏ డాక్టరుకో, లాయరుకో, భార్య అయ్యుం డేది. గృహరాజ్యానికి రాణీ అయ్యుండేది" కొంత చిలిపిగా అన్నాడు డాక్టరు.

"చాల్లెండి! చదివి లాభం ఏముందిలే అని అందరూ నాలాగా ఎందుకు అనుకుంటారు లెండి" అంది చురకగా.

●●●

"సెక్యూర్టీగార్డుగా శుంభ మన ఆసుపత్రికే రావడం గమ్మత్తుగా ఉందే" అన్నాడు.




"మీ మనసులో ఏమూలో గట్టిగా ఉన్న కోరిక కదా మరి" అంది భార్య.

"నేననుకున్నది ఎప్పుడూ ఇక్కడే ఉండాలని కదా" అన్నాడు.

"ఇదైనట్లు అదెందుకు కాదులెండి" అన్నది భార్య. భార్యమాటలే తలచుకుంటూ కిందకి ఏదో పనిమీదవచ్చి శుంభని పలకరించాడు డాక్టరు.

"ఏవమ్మా, మీది ఏ ఊరు"

"చిన్నిచిన్నారం సార్" చెప్పింది శుంభ. ఆ ముక్కతో తెలిసిపోయింది, శుంభ మాట సరళి మామూలుగా అయిందని.

"ఏంటమ్మా, నీ పద్ధతే పూర్తిగా మారిన ట్లుందే" అన్నాడు.

"లేదు సార్, నా పద్ధతికి నేనొచ్చా" అంది. ఆ జవాబుతో శుంభ ఎత్తుపెరిగి కనిపించింది.

"నీ కొడుకేం చేస్తున్నాడిప్పుడు" అడిగాడు.

"గోలీలు మింగినవాడు గోళాలు మింగేట్లున్నాడు సార్. లిఫ్ట్ బాయ్‌గా చేరిన పదిరోజులకే లిఫ్టు ఎందుకు ఆకాశంలోకిపోయి రాకూడదూ? అంటు న్నాడు సార్" చెప్పింది. ఆ జవాబుకి నవ్వి,

"ఈ ఉద్యోగం కాక ఇంకేదన్నా పని చేస్తు న్నావా?" అడిగాడు డాక్టరు.

"గూండాగిరి గుండెపోటుకే, అనే పుస్తకం రాస్తున్నాను సార్"

"దేనికమ్మా! ఖర్చుతో కూడుకున్న పని. ఈ కిండిల్ రోజుల్లో పుస్తకం పట్టుకుని చదివేవాళ్లున్నా రంటావా" అడిగాడు.

"అదేం లేదు సార్! కేవలం నా కొడుకుతో చది వించాలని" చెప్పింది.

●●●

ఒకరోజు నికుంభ తన తండ్రి ఆదిదేవుణ్ణి చికిత్స కోసమని డాక్టరు దగ్గరకు తీసుకువచ్చింది.

"నాన్నా" అని పిలిచింది శుంభ.

"ఇంకా ఆ పిలుపు అలాగే ఉందామ్మా?" అన్నాడు. మళ్ళీ తనే "తెలిసిందమ్మా" అంటూ కూతుర్ని దగ్గరకు తీసుకున్నాడు. నికుంభ కూడా 'అక్కా!' అంటూ అక్క భుజానికి చెంప ఆనించి, గట్టిగా పట్టుకుంది.

కూతురు, తను కాదన్నవాణ్ణి చేసుకుందని "ఇంట్లో చోటు లేదన్నాడు" ఆ దూరం ఇప్పుడు దగ్గరయింది.

●●●

"అంత ఖర్చుపెట్టి చావుని పొడిగించుకునే స్తోమత నాకు లేదు సార్" అన్నాడు ఆదిదేవుడు.

"నేనున్నానుగా, ఆ బెంగ అఖ్ఖర్లేదు" అన్నాడు డాక్టరు. తండ్రీ కూతుళ్ల కళ్ళు ఆనందంతో కన్నీళ్ళు నింపు కున్నాయి.

"నీవయ్యా అసలు దేవుడివి" అన్నాడు ఆదిదేవుడు.

"ఏంకాదు. మీ ఊరి అమ్మాయిని చేసుకున్నం దుకు ఆ మాత్రం ఆదుకోకపోతే ఎలా" అన్నాడు డాక్టరు.

"మా ఊరి అమ్మాయా!!!" ముగ్గురూ ఆశ్చర్య పోయారు.




**ఆ ఘోరాన్ని చూసినందుకు సిగ్గుతో తలొంచుకుని సూర్యుడు పశ్చిమాద్రికి పారిపోతున్న సమయంలో, నాలుగు గంటల తర్వాత, బజాజ్ జేబులో ఉన్న అరవై వేల రూపాయలు తీసుకుని, ఫామ్‌హౌస్ నుండి పోతూపోతూ,**

**'పోలీసులకు చెప్పారనుకోండి... మొత్తం వీడియోలను ఫేస్‌బుక్‌లో, యూట్యూబ్‌లో పెడతా! ఇంతటితో మరిచిపోండి. మీకూ మాకూ మంచిది. లేకపోతే పోలీసుల్లో అందరూ మా వాళ్ళే. ఎం.ఎల్.ఏ కూడా మా వాడే. పోలీసు కంప్లైంట్ ఇస్తే రెండురోజుల్లో బయటకొచ్చి, దూండ్ దూండ్కే వెతికి పట్టుకుని సఫా చేస్తా!' అంటూ వెళ్ళిపోయాడు.**

సుమన్ వెక్కివెక్కి ఏడ్చింది. ఒళ్ళంతా పశువులు తొక్కిన పచ్చటి చేనులా అయింది. 'చావడమే తనకు గతి' అనుకుంది. ఒళ్ళంతా గాయాలతో పచ్చి పుండులా తయారైంది. బజాజ్ అయితే అవమానభారంతో తల వాల్చుకున్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత రెండు గంటల వరకు సుమన్ లేచి నిలబడలేక పోయింది. శరీరంతో పాటూ, ఆమె మనసు కూడా కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది.

'ఎవరో నీచులు, నికృష్టులు వచ్చి ఇష్టమొచ్చినట్టుగా తన శరీరాన్ని వాడుకుని పోవడానికి వాళ్ళకు ఏం హక్కుంది? తనేమైనా పబ్లిక్ ప్రాపర్టీనా? ఈ వెధవలను వదిలిపెట్టకూడదు. నా జీవితం ఎలాగూ నాశనమైంది. చావడం కన్నా వీళ్ళకు బుద్ధిచెప్పాలి. భవిష్యత్తులో మరొక అబల వీళ్ళ దౌర్జన్యానికి బలి కాకూడదు' అనుకుని లేచి నిలబడింది. బజాజ్‌ను లేపింది.

'ఛలో పోలీస్ స్టేషన్!' అంది.

బజాజ్ వణికిపోయాడు. 'వొద్దొద్దు. నీ జీవితం నాశనమయిపోతుంది. వీడియోను యూట్యూబ్‌లో పెడితే మా కుటుంబం పరువు పోతుంది. నేను ఆత్మహత్య చేసుకోవాల్సిందే! ప్లీజ్! ఆల్రెడీ నేను షాక్‌లో ఉన్నాను. ఈ విషయం తెలిస్తే మా అమ్మానాన్నలు మా బారాదరిలో తలెత్తుకోలేరు' అంటూ ఆమె కాళ్ళు పట్టుకుని బ్రతిమాలాడు.

'బజాజ్! ఇది నా పవిత్రతకు సంబంధించిన విషయం కాదు. స్త్రీగా నా డిగ్నిటీకి, నా అభిజాత్యానికి సంబంధించిన విషయం. వాళ్ళను నేనొదిలే ప్రసక్తే లేదు. నువ్వు నీ కుటుంబ గౌరవం గురించి భయపడుతుంటే నువ్వు వెళ్ళిపో! నేను పోలీస్ స్టేషనుకు వెళ్ళడం ఖాయం. నా స్కూటీ తీసుకుని వెళ్తా! నీ గురించి చెప్పను. కానీ, ఫామ్‌హౌస్ గురించిమాత్రం చెప్పక తప్పదు' అంది, కన్నీళ్ళు తుడుచుకుంటూ.

బజాజ్ గబగబా బట్టలు తొడుక్కుని, కారు కీస్ తీసుకుని పారిపోయాడు.

సుమన్ లేచి తన చిరిగిన నైట్‌గౌనును, బెడ్ షీటును ప్యాక్ చేసుకుని బయటకు నడిచింది.

ఒంటినిండా గాయాలతో, ముఖం పగిలిపోయి, రక్తం మరకలున్న చిరిగిన బట్టలతో 'పహాడీషరీఫ్' పోలీస్ స్టేషన్లోకి ఆ రాత్రి సమయంలో అడుగు పెట్టిన పద్దెనిమిదేళ్ళ యువతిని చూసి పోలీసులు కంగారుపడ్డారు. విస్తుపోయారు.

ఆమెను జాగ్రత్తగా తీసుకెళ్ళి సీఐ ముందర కూర్చోబెట్టారు.

అప్పుడే డైలీ క్రైమ్‌న్యూస్ కవర్ చేయడానికి అక్కడికి వచ్చిన ఒక న్యూస్‌పేపర్ రిపోర్టర్ సుమన్‌ను గమనించి, ఆమెను రహస్యంగా ఫాలో అయ్యాడు.

సుమన్ చెప్పిన ఘాతుకాన్ని విన్న పోలీసులే వణికిపోయారు. పేపర్ విలేకరి నిర్ఘాంతపోయాడు. సిఐ శరీరంలో వణుకు పుట్టింది.



### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. రాం హీరోగా, శ్రావణి హీరోయిన్‌గా సినిమా మొదలవుతుంది. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. డైరెక్టర్‌కి తన గతమేమిటో చెప్పి, అతడినుంచి దూరంగా వెళ్లిపోతుంది శ్రావణి. నవీన్‌ను పక్కకు తప్పిస్తాడు డైరెక్టర్. షూటింగ్ పూర్తవడంతో గుమ్మడికాయ కొట్టే కార్యక్రమానికి శ్రావణి కూడా హాజరవుతుంది. తర్వాత డైరెక్టర్ ఇంట్లో ఉన్న హార్డ్ డిస్క్ మాయమవటంతో, శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డైరెక్టర్ యాదగిరిగుట్ట వెళ్తాడు. అర్ధరాత్రవుతుండగా డీసీపీ మేడమ్ ఫోన్ చేస్తుంది డైరెక్టర్‌కి. తాను పంపించిన డీవీడీలు చూడమంటుంది. మొదటి డీవీడీ చూస్తున్న డైరెక్టర్‌కి మతిపోతుంది.

ఆ తర్వాత.....

ఇది తన స్థాయిలో చేపట్టవలసిన కేసు కాదని, డీసీపీ, సీపీలకు ఫోన్ చేసి రిపోర్ట్ చేశాడు.

గంటలోపలే ఆ ఇద్దరు ఉన్నతాధికారులు 'పహాడీ షరీఫ్' పోలీస్ స్టేషన్‌కు వచ్చి, సుమన్‌తో ప్రత్యేకంగా మాట్లాడారు. దీన్ని ఒక ప్రత్యేక కేసుగా ట్రీట్ చేస్తూ, ఉస్మానియా హాస్పిటల్ నుండి డాక్టర్లను పిలిపించి మెడికల్ టెస్ట్ చేయించారు.

కమీషనర్ స్థాయి అధికారి ఒక లోకల్ పోలీస్ స్టేషనుకు వచ్చేసరికి, సిటీ అంతా గందరగోళమయింది. టీవీలు, పేపర్ల రిపోర్టర్లు గుమికూడారు. సీపీగారు పరిస్థితిని గమనించి సుమన్‌ను అక్కడినుంచి, మారువేషంలో తప్పించి వేరే సేఫ్ హౌస్‌కు తరలించారు. ఈ విషయం బయటకు పొక్కకూడదని, పేపర్ వాళ్ళకు, టీవీ వాళ్ళకు సీరియస్ వార్నింగ్ ఇచ్చారు.

పేపర్ వాళ్ళు కూడా అర్థం చేసుకున్నారు. ఇప్పుడే విషయం బయటకు పొక్కితే, 'స్నేక్‌గ్యాంగ్' మెంబర్స్ తప్పించుకునే ప్రమాదముందని, తమకు కూడా సామాజిక బాధ్యత ఉందని, అందరూ అరెస్ట్ అయ్యే వరకూ గోప్యంగా ఉంచాలని నిర్ణయించుకున్నారు.

పోలీసులు ఈ కేసును ప్రెస్టీజియస్‌గా తీసుకుని రెండు రోజుల్లోనే ఫైజల్‌ను, రెండు వారాల్లోనే మిగిలిన ఎనిమిదిమందిని అరెస్టు చేసి విలేకరుల ముందు ప్రవేశపెట్టారు.

ఆ సమావేశంలో సీపీ చెప్పిన విషయాలు విని అందరూ నిర్ఘాంత పోయారు.

పహాడీషరీఫ్ ప్రాంతంలో, ఈ స్నేక్‌గ్యాంగ్ దాదాపు 37 నేరాలు చేసినట్టూ, ఒంటరిగా వెళుతున్న అందమైన అమ్మాయిలను, జంటగా వెళ్తున్న యువతీయువకులను అడ్డగించి, అబ్బాయిలు చూస్తుండగానే, అమ్మాయిలను పాములతో బెదిరించి గ్యాంగ్‌రేప్ చేసి, ఆ తతంగమంతా వీడియో షూట్‌చేసి బెదిరిస్తున్నారనీ, పోలీసులకు చెబితే సోషల్‌మీడియాలో వీడియోలు పోస్ట్ చేస్తామని బ్లాక్‌మెయిల్ చేస్తున్నారనీ చెప్పారు.

జూలై 31న అత్యంత ధైర్యసాహసాలతో ఒక అమ్మాయి ఇచ్చిన ఫిర్యాదుతో 'స్నేక్‌గ్యాంగ్'లో తొమ్మిది మంది సభ్యుల్ని పట్టుకున్నామని, వాళ్ళ ఇళ్ళల్లో నుండి డీవీడీలు, సెల్‌ఫోన్లు, పాములను సీజ్ చేశామని, ఈ 'స్నేక్‌గ్యాంగ్' రియల్ ఎస్టేట్ గొడవలని, 'కంగారు కోర్టులు' పెట్టి సెటిల్మెంట్లు చేసేవారని, ఆ ఏరియాల్లో ప్రజాదర్బారులు పెట్టి ప్రజలను భయభ్రాంతులకు గురిచేసేవారని, వారిని రంగారెడ్డి జిల్లా కోర్టులో ప్రవేశపెడ్తున్నామని చెప్పేసరికి ప్రజల్లో హాహాకారాలు మొదలయ్యాయి.

'ఇంత దారుణమా?' అని అక్కడున్నవారి గుండె లవిసిపోయాయి. చదువుసంధ్యలు లేని ఓ జులాయి వెధవల ముఠా కనపడ్డ ఆడదాన్నల్లా చెరచడమా? మనం సభ్య సమాజంలో జీవిస్తున్నామా లేక ఏదైనా ఆటవిక రాజ్యంలో, రాక్షసుల్లా జీవిస్తున్నామా? అని అక్కడి వారి గుండెలు మండిపోయాయి. టీవీల్లో లైవ్‌చూస్తున్న లక్షలాదిమంది కుతకుత ఉడికిపోయారు. మరునాడు, పేపర్లలో ఆ విషాద వార్తను చదివిన సభ్య సమాజం సిగ్గుతో తలవంచుకుంది.

సమావేశంలో ఉన్న విలేకర్లు, ప్రశ్నలు కూడా అడగలేనంతగా స్తబ్దుగా ఉండిపోయారు.

సీపీగారు సమావేశం ముగించి వెళ్ళబోతుంటే, ఒక విలేకరి ధైర్యం చేసి 'సార్! ఆ 37 మంది ఎవరు సార్?' అని ప్రశ్నించాడు.

సీపీగారు, 'వాళ్ళపేర్లు బయటపెట్టడం భావ్యమంటారా? వాళ్ళు ఆల్రెడీ ఘోరమైన శారీరక హింసలకు గురయ్యారు. మీకు చెప్పకూడదుగానీ నా గుండె కూడా మండిపోతోంది. మన మధ్యలోనే ఇంత దారుణంగా మానవతుల మారణ హోమం జరుగుతుంటే కనుక్కోలేకపోవడంలో మా పోలీసుల అసమర్థత కూడా ఉంది. మా వాళ్ళ ప్రమేయం కూడా ఉంది. నాకు తెలిసిన విషయాలు మీకు చెప్పకూడదు కాబట్టి చెప్పడం లేదు గానీ, ఈ బాస్టర్డ్స్ చేసిన ఘోరాలకు కాల్చి పారేయాలనిపిస్తోంది. వీరిబారిన పడి శీలం కోల్పోయిన వారిలో కొంతమంది, చిన్నపిల్లల తల్లులు కూడా, ఆత్మహత్యలు చేసుకున్నారు' అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ.

'ప్లీజ్... బాధితుల వివరాలు అడగకండి! వాళ్ళ మానాన వాళ్ళను జీవించనీయండి. ఒకవేళ ఎవరైనా ధైర్యం చేసి ముందుకొస్తే వాళ్ళ కంప్లైంట్ తీసుకుంటాం. వాళ్ళ వివరాలు గోప్యంగా ఉంచుతాము' అన్నాడు.

'సార్! ఈ 37 మందిలో ఒక ఫిల్మ్‌స్టార్ కూడా ఉందని అంటున్నారు, నిజమేనా?' అతను ప్రశ్నించాడు.

సీపీగారు ఆ ప్రశ్నను కొట్టిపడేస్తూ, 'అవన్నీ ఉట్టి పుకార్లే' అన్నారు.

•••

డీవీడీ ప్లేయర్లో దృశ్యాలు ఆగిపోయి బ్లాంక్ డీవీడీ ప్లే అవుతోంది.

నేను స్తబ్దుగా కూర్చుండిపోయాను. మనసు, లోకంలోని విషాదాన్నంతా పీల్చుకున్న స్పాంజిలా, బరువుగా అయింది. అసలే నేను బాధల్లో ఉంటే ఈ ఘాతుకం నన్ను మరింత విచారంలో ముంచేసింది. అలాగే కూర్చుండిపోయాను. ఎంత సేపు అలా కూర్చున్నానో గానీ, ఫోన్ మోగడంతో ఉలిక్కి పడ్డాను.

'మేడం'

'మేడం! ఏంటి మేడం? ఇంత ఘోరమైన సంఘటనలు చూడమన్నారు' అన్నాను, నిందిస్తున్నట్టుగా.

"చెబుతాను! ఈ స్నేక్ గ్యాంగ్ కేస్ జూలై 2014లో జరిగింది. ఈ ఘాతుకానికి ఒడిగట్టిన తొమ్మిది మందిలో ఏడుగురికి, 2016లో యావజ్జీవ కారాగార శిక్ష పడింది. మిగిలిన ఇద్దరిపైన సరైన ఋజువులు దొరకక పోవడంతో వదిలేశారు. అయితే, ఆ ఇద్దరు దుర్మార్గులు, మరింత పకడ్బందీగా, ఇవే దారుణాలకు పాల్పడుతున్నారు. ఇంతకుముందు పహాడీషరీఫ్ ప్రాంతంలోనే ఘోరాలు చేసిన వీళ్ళు ఇప్పుడు కొత్త సిటీలోకి కూడా ప్రవేశించారు. సుపారీలు తీసుకుని క్రైమ్‌చేసే స్థాయికి ఎదిగారు. Modus operandi మాత్రం ఇదే. పాములతో



విక్టిమ్స్‌ను టెర్రరైజ్ చేయడం.

ఇప్పుడు ఆ ప్యాకెట్లో రెండో నంబరు వేసిన డీవీడీ చూడండి. తర్వాత ఫోన్ చేస్తాను".

●●●

డీవీడీని ప్లే చేశాను.

బ్లాంక్ స్క్రీన్‌మీద

Recorded Statement of Sravani at Banjara Hills Police Station in the presence of Hon'ble Magistrate M.Kasturi, XXV Special Megistrate Court, City Civil Court, Hyderabad on... అన్న అక్షరాలతో పాటు ఇవ్వాల్టి డేట్ రాసి ఉంది.

ఆ మాటలు చదివి నేను విస్తుపోయాను.

బ్లాంక్ స్క్రీన్‌మీద ఉన్న అక్షరాలు నెమ్మదిగా మసకబారిపోయి, వీడియో ప్రారంభమయింది.

పోలీస్‌స్టేషన్‌లోని ఒక గదిలో, విషాదం రూపం పోసుకున్నట్టుగా శ్రావణి కూర్చుని ఉంది. ముఖం మ్లానమై ఉంది. ఏకధారగా ఏడ్చిందేమో కళ్ళు ఎర్రబడి ఉన్నాయి. జుట్టు రేగిపోయి ఉంది.

ఎవరో 'ఊఁ' అని గద్దించడంతో, శ్రావణి తలెత్తి కెమెరా వైపు చూసింది.

ఆమె సూటిగా నన్నే చూసినట్టై, ఆ చూపు నా గుండెల్లో గుచ్చుకుంది.

తను మాట్లాడటం మొదలుపెట్టింది.

"నా పేరు శ్రావణి. సినిమా హీరోయిన్‌ని. వారం రోజుల క్రితం అంటే గత గురువారం నాడు.." అంటూ భోరున ఏడ్చింది. నా గుండెకు, కాగితాలను జత కలపడానికి స్టేపిల్ చేసే మిషన్‌తో, వేయి స్టేపిల్సును పిన్‌చేసినంత బాధ కలిగింది నాకు.

గత గురువారం నాడు అంటే తనను ఫంక్షనుకు ఇన్వైట్ చేయడానికి వెళ్ళినరోజు.

ఆ రోజు ఏం జరిగిందోనని, నా గుండె వేగంగా కొట్టుకోవడం మొదలు పెట్టింది. ఆరోజు ఉదయమే, రెండు నెలల తర్వాత, మొదటిసారిగా శ్రావణిని కలిశాను.

శ్రావణి మాట్లాడటం మొదలు పెట్టింది.

"....షూటింగులో ఉన్నప్పుడు అభిషేకం గారు, డైరెక్టరు గారు షూటింగు పూర్తయిన సందర్భంగా రెండు రోజుల తర్వాత గుమ్మడికాయ కొడుతున్నామని, ఆ ఫంక్షనుకు ఆహ్వానించడానికి వచ్చారు. ఆ సినిమాలో నాతో పనిచేసిన కొంతమందికి బహుమతులు కొందామని, ఆ రోజు ప్యాకప్ అయిన తర్వాత నేను జివికె 1 మాల్‌కు వెళ్ళి గిఫ్ట్స్‌కొని బయటకొచ్చాను.

వాయుగుండం ప్రభావమేమో, హైదరాబాదు నగరం మేఘావృతమైంది. సన్నగా తుంపర పడుతోంది. ఒక్క టాక్సీ కూడా కనబడడం లేదు.

నేను, ఏం చేయాలో తోచక, కనీసం ఆటోలోనైనా వెడదామని రోడ్డు మీదికొచ్చి నిలబడ్డాను.

ఇంతలో, సినిమా విడిచారేమో రష్ రావడం మొదలయింది. ఆ రష్‌లో ఎవరో నన్ను వెనుకనుంచి గట్టిగా తోశారు. నేను రోడ్డుమీద పడబోతుంటే, ఒక చెయ్యి నన్ను పట్టుకుంది.

"శ్రావణీ!" అని పిలవడంతో నేను ఆశగా ఆ వ్యక్తి వైపు చూశాను. అతనెవరో నాకు తెలియదు గానీ, నన్ను పట్టుకున్న వ్యక్తి నా భుజానికి ఏదో సూదిలాంటిది గుచ్చాడు. చూస్తుండగానే నా కళ్ళు వాలిపోయాయి. నేను మత్తులో మునిగిపోయాను.

●●●

నాకు మెలకువ వచ్చేసరికి, ఒక గదిలో మంచం మీద పడి ఉన్నాను. తలుపులు, కిటికీలు మూసి ఉన్నాయి. నాకు భయమయింది.

మెల్లిగా లేచి తలుపులు బాదుతూ, 'హెల్ప్! హెల్ప్' అని అరిచాను. నా వేడుకోలు అరణ్యరోదనే అయింది. తలుపులు మూసి ఉన్నా, కిటికీ అద్దాలలో నుంచి ప్రసరిస్తున్న వెలుతురు రూమంతా పరుచుకుని ఉంది కాబట్టి అది పగలు అని అర్థమవుతోంది. నేను జివికె దగ్గర రోడ్డు మీద నిలబడినప్పుడు రాత్రి సుమారు ఏడవుతుంది. అంటే రాత్రంతా నేను బందీగానే ఉన్నానన్నమాట. అంటే నేను కిడ్నాప్‌కు గురయ్యానని ఊహించాను. ఆ ఆలోచన రాగానే ఒక్కక్షణం వణికిపోయాను. వెంటనే నా ఒళ్ళంతా చూసుకున్నాను. ప్రైవేట్ పార్ట్స్ చూసుకున్నాను. ఒంటి మీద గాయాలేమీ లేవు. అంటే రేప్‌కు గురికాలేదు. ఒక నిట్టూర్పు విడిచి మంచంలో కూలబడి పోయాను.

అలా ఎంతసేపు గడిచిందో ఆలోచనల్లో పడి తెలియలేదు.

'నన్ను ఎందుకు కిడ్నాప్ చేసి ఉంటారు? నా దగ్గర డబ్బులైతే పెద్దగా లేవు. కేవలం కొన్ని సినిమాల్లో చేశాను కానీ అవి మెయింటెనెన్సుకే సరిపోతున్నాయ్. సినిమాలు లేని టైంలో అయితే రోజు గడవడమే కష్టమవుతుంది. పోనీ, నన్ను సెక్స్ కోసం కిడ్నాప్ చేసి ఉంటారా? అదే కరెక్ట్. మరి ఒక రాత్రంతా ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్న నన్ను శారీరకంగా హింసించిన గుర్తులేం కనపడటం లేదు. మరి నన్నెందుకు కిడ్నాప్ చేశారు. నేను కనపడకపోతే నిర్మాత అయినా పోలీసులకు ఫోన్ చేస్తాడు




**స్తబ్దుగా కూర్చుండిపోయాడతడు. బ్లాంక్ డీవీడీ ప్లే అవుతోంది. లోకంలోని విషాదాన్నంతా పీల్చుకున్న స్పాంజిలా బరువుగా తయారైంది మనసు. అలా ఎంతసేపు కూర్చున్నాడో, ఫోన్ మోగడంతో ఉలికిపడ్డాడు. డీసీపీ మేడమ్! ఈ డీవీడీ నన్నెందుకు చూడమన్నారు మేడమ్? అడిగాడతడు. ఆ రెండో డీవీడీ కూడా చూడు, విషయం నీకే తెలుస్తుంది అని చెప్పిందామె. ఇంతకీ ఆ రెండో డీవీడీలో ఏముంది?**

కదా! ఆ భయం కూడా వీళ్ళకి లేదా?'

ఆలోచనల్లో మునిగిపోయి ఉన్న నేను తలుపులు తీస్తున్న చప్పుడు విని వణికిపోయాను.

ఎర్రటి జెర్కిన్ వేసుకుని, గుట్కా నములుతూ ఓ వ్యక్తి లోపలికి వచ్చాడు. చూడ్డానికే మొరటుగా ఉన్నాడు.

"ఉఠ్ గయా?" అన్నాడు.

నాకు అర్థం కాలేదు.

"ఓహో, తెల్గు గదా! లేచినయ్?" అన్నాడు.

"ఊఁ!" అని తలూపాను.

"ఠీక్‌హై? బాగున్నావా?" అంటూ నింపాదిగా నా పక్కన మంచం మీద కూర్చున్నాడు. నేను లేవబోతుంటే నా నడుం పట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు. నేను గింజుకుంటుంటే,

"బేబీ! సైలెన్స్!" అంటూ, తన జేబులో నుంచి ఒక చిన్నమూటను విప్పి, దాంట్లో నుంచి జరజరా పాకుతున్నదాన్ని నా అరచేతిలో పెట్టి నా గుప్పిట మూశాడు. నా చేతికి మెత్తగా తగులుతుంటే గుప్పిట విప్పి 'ఏమిటా?' అని చూశాను. పాము పిల్ల!

కెవ్వుమని కేకవేసి పామును కింద విసిరేశాను. భయంతో నా ఒళ్ళంతా గజగజ వణకసాగింది. పాములంటేనే నాకు ఎలర్జీ, భయం. సినిమాలో పాముల్ని చూస్తేనే నాకు ఒళ్ళు గగుర్పొడుస్తుంది. అట్లాంటిది, నా చేతుల్లోనే పామును చూసేసరికి నా పై ప్రాణాలు పైనే పోయాయి. కిందపడ్డ పాము మెల్లిగా పాక్కుంటూ నా దగ్గరికే వస్తోంది.

నేను పిచ్చిపిచ్చిగా అరుస్తూ కాళ్ళు పైకి పెట్టుకుని వణుకుతూ కూర్చుండిపోయాను.

రూములోకి వచ్చిన వ్యక్తి పామును తన చేతుల్లోకి తీసుకుని నిమర సాగాడు.

నా చూపులు పాము మీదే ఉన్నాయి. నేను వణికిపోతున్నాను. భయంతో నోట మాట రావడం లేదు. నా జీవితంలో అత్యంత జుగుప్సాకరమైన ప్రాణి పామే. అందుకే, దాన్నిచూస్తుంటే కళ్ళల్లో భయంతో పాటు నీళ్ళు నిండసాగాయి.

వాడు, "అరెరే... బేబీ నిన్ను కిందపడేసిందా? ఏంకాదు. బేబీ మంచిది. బేబీ దగ్గరకు పోరా!" అంటూ పామును పట్టుకున్న చేతుల్ని నా వైపు చాచాడు.

నేను 'వద్దొద్దు' అంటూ అరుస్తూ మూలకు జారుకున్నాను. చెమటతో నా బట్టలన్నీ తడిచిపోయాయి. ఒళ్ళంతా చలిజ్వరం వచ్చినట్టుగా వణుకుతోంది. వణుకు కంటే ఇంకేదైనా పెద్ద పదముంటే అలా శరీరంలోని అణువణువూ గజగజలాడుతోంది.

"తీసేయ్! తీసేయ్! ప్లీజ్! నీకు దండం పెడతా!" అని అతన్ని బ్రతిమిలాడాను.

భయంతో వణికిపోతున్న నన్నుచూసి వాడు పగలబడి నవ్వుతూ నిలబడ్డాడు.

"మరి నేను చెప్పినట్టు చేస్తయ్?" అన్నాడు.

నేను సందేహంగా చూశాను.

"అరే భయ్! బేబీ డౌట్ పడుతుందిరా. ఒక సారి మాట్లాడు" అంటూ పామును నా మీదకు విసిరాడు.

అది నా భుజం మీద పడింది. నేను కెవ్వుమని ఎగిరి మంచం మీద నుండి కిందకు దూకాను. పాము మంచంలో పడింది.

నాకు పిచ్చి పట్టినట్టయింది. నేను గట్టిగా అరుస్తూ, ఏడుస్తూ గదిలో ఒక మూలకు జరిగి కూర్చుండి పోయాను.

"ఏం బేబీ? నేను చెప్పినట్టు చేస్తయ్?"

"చేస్తా... చేస్తా! ఏమైనాచేస్తా, ముందు పామును తీసేయ్!" అని హిస్టీరిగ్గా అరుస్తూ చెప్పాను.

"వాడికేం కావాలో నాకు తెలిసిపోయింది. ప్రాణం పోయినా వాడికి నా శరీరాన్ని అప్పగించ దలుచుకోలేదు. కానీ, ప్రాణం పోవడం కన్నా, జుగుప్సా కరమైన స్థితిలో నేను ఉన్నాను. ఆ పామును చూస్తేనే నాకు కంపరం పుడుతోంది. పోనీ దానితో కాటు వేయించుకుని చచ్చిపోయినా ఫర్వాలేదు కానీ, దాన్ని ముట్టుకోవాలంటేనే నాకు జీవితం మీద విరక్తి పుట్టసాగింది"

శ్రావణి కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది.

●●●

నా గుండె చెరువయింది.

## సినీవాలి
## కూపన్ నెం.18 విజేత

**ఎ. విజయలక్ష్మి**

**క్రిస్టియన్ కాలనీ, కరీంనగర్**

'ఎందుకు నాకు దగ్గరయిన వాళ్ళంతా ఇన్ని చిత్రహింసలకు గురవుతున్నారు? వీటన్నిటికీ నేనే కారణమా? ఏదైనా గ్రహదోషమా?

ఒక అబల, అసహాయురాలిపై ఇంత శారీరక హింసా? కుసుమ కోమలమై రసరమ్య లోకాలు చూపించే శ్రావణి ఒంటిపైన పాములు వేయడమా? ఇందాక సుమన్‌పై కూడా ఘోరమైన అత్యాచారం జరిగింది. ఛీ! ఇవన్నీ జరుగుతుంటే నేనేమో నీతులు వల్లిస్తూ సినిమాలు తీస్తున్నాను' అని నామీద నాకే అసహ్యం వేయసాగింది. రక్తం మరిగి పోసాగింది.

శ్రావణి మళ్ళీ మాట్లాడడం ప్రారంభించగానే, కన్నీళ్ళతో చూడసాగాను. నాకు ఆ దృశ్యాలు చూడా లని లేదు. కానీ, నా ప్రియబాంధవి పడ్డ కష్టాలు నేను కనీసం చూడనైనా చూడకుండా ఎలా ఉండ గలను.

●●●

"వాడు నా దగ్గరకు వస్తుంటే, 'పామును తీసేయ్, పామును చంపేయ్!', పామును చంపేయ్!" అంటూ అరిచాను.

"పాము నా బాయ్, బేబీ!" అంటూ దాన్ని టవల్లో చుట్టి, జెర్కిన్ జేబులో పెట్టుకుని, జెర్కిన్‌ను విడిచి హ్యాంగర్‌కు తగిలించాడు. వాడేం చేయ బోతున్నాడో నాకర్థమైపోయింది.

వాడు నన్ను దగ్గరకు తీసుకుంటుంటే వాడి నోటి నుండి వస్తున్న గుట్కా వాసనకు నా కళ్ళు తిరిగాయి. వాడి స్పర్శ, ఆ పాము స్పర్శ కన్నా జుగు ప్సగా ఉంది. వాడు నా ఒళ్ళంతా తడుముతుంటే ఆ పామే నా ఒంటిమీద జరజరా పాకుతున్నట్టుగా అనిపించింది. నేను ముడుచుకుపోతూ వాణ్ణి కాళ్ళూచేతులతో తన్నుతుంటే, వాడి చెయ్యి జెర్కిన్ వైపు పోతుంటే... నేను,

"వొద్దు, వొద్దు" అని మొర పెట్టుకున్నాను.

"కపడే ఉతారో! బట్టలిప్పు, ఒక్కటొక్కటిగా మెల్లిగా" అని హూంకరించాడు.

నాకైతే ఆ క్షణంలోనే చచ్చిపోతే బాగుండునని పించింది.

వాడు నన్ను నలిపి, క్రూరమృగానికి దొరికిన కుందేలును ఆవురావురుమంటూ తిన్నట్టుగా, కబ ళించాడు. ఒళ్ళు హూనమయింది.

వాడు నన్నొదిలేసి లేచి కూర్చున్నాక, నేను చేతులు జోడించి నన్నొది లేయమని ప్రార్థించాను.

వాడు నవ్విన నవ్వు చూసి నాకు మతిపోయింది. ఇంతలో ఎక్కడినుంచో, చేతిలో వీడియో కెమెరా పట్టుకుని, ఇంకొకడొచ్చాడు.

నేను నిర్ఘాంతపోయాను.

అప్పటివరకు జరిగిన తతంగమంతా కెమెరాలో షూట్‌చేశారు. నాకు ఒళ్ళు మండిపోయింది. వాళ్ళ

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -20 (1-3-2017)

మా ప్రశ్న: సినిమాలో తనతో కలిసి పనిచేసినవారికి బహుమతులు కొందామని ఏ మాల్‌కి వెళ్ళింది శ్రావణి?

మీ జవాబు------------------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------------------

------------------------------------------------------------------------

--------------------------------------పిన్-----------------------ఫోన్‌నెం-----------------------

**ఈ కూపన్‌ను 28 ఫిబ్రవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

## బోలెడు అవమానాలు జరిగాయట!



రకుల్ ప్రీత్‌సింగ్.... గోల్డెన్ లెగ్ హీరోయిన్.... తమ సినిమాలో నటిస్తే చాలు సినిమా సూపర్ డూపర్ హిట్...ఇదీ చాలా మంది దర్శకనిర్మాతల అభిప్రాయం. తమ అభిమాన హీరోయిన్ సినిమా కచ్చితంగా నూరు రోజుల పండుగ జరుపుకుంటుంది. దానికి తిరుగులేదు...ఇది ఆమె అభిమానుల నమ్మకం. ఇంత మంది తన మీద పెట్టుకున్న ఈ నమ్మకం ఒక్కరోజులో రాలేదని అంటోంది రకుల్. ఈ రంగంలోకి వచ్చిన కొత్తల్లో తనకూ అవమానాలు జరిగాయనీ, వాటిని తట్టుకుని నిలబడి, నన్ను నేను నిరూపించుకున్నాను అని చెబుతోంది. ఒక్కరోజులో ఇంత పేరు ప్రఖ్యాతులు రాలేదనీ, వీటి వెనుక ఎంతో కృషి ఉందని కూడా చెబుతోంది. తనను చాలా మంది లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేయమని అడుగుతున్నారనీ, కానీ తనకే ధైర్యం చాలడం లేదనీ అంటోంది. అలాంటి సినిమాలు చేయడానికి ఇంకా టైముందని చెబుతోంది.

మీద పడి రక్కాను, గోళ్ళతో గీరాను. వాళ్ళు వెకిలిగా నవ్వుతూ అదంతా షూట్ చేయసాగారు.

ఈసారి, మొదటివాడు కెమెరా పట్టుకుంటే రెండో వాడు నామీద పడ్డాడు.

"అయిపోయింది. నా జీవితం నాశనమయిపోయింది. నేను సినిమారంగంలో నటిగానే కాదు, మామూలు స్త్రీగా కూడా జీవించే అర్హత కోల్పోయాను".

శ్రావణి కన్నీళ్ళు తుడుచుకుంది.

"నేనేం చేయను చెప్పండి? రాక్షసుల్లాంటి ఇద్దరు కర్కోటకులు నన్నూ నా బలహీనతనూ గమనించి, నా శరీరాన్ని షైలపరుస్తుంటే నేనేం చేయలేక నిర్లిప్తంగా ఉండిపోయాను. వాళ్ళు నన్ను కాదు ఇంకెవరి శరీరాన్నో అనుభవిస్తున్నారన్నంతగా నేను స్తబ్ధుగా ఉండిపోయాను. నేను చేయగలిగింది కూడా ఏమీలేదు. ఒకరి తర్వాత ఒకరు అలా నలుగురు నన్ను గంటలకొద్దీ గ్యాంగ్‌రేప్ చేశారు".

నేను జీవచ్ఛవంలా మిగిలిపోయాను. ఆ క్షణంలో నేను చచ్చిపోతే నా అంత అదృష్టవంతురాలు ప్రపంచంలో మరొకరుండరని అనుకున్నాను.

వాళ్ళ కోరిక చల్లారినట్టుంది.

నన్ను వదిలారు.

వెళ్తూ, వెళ్తూ తలుపు తీసి భోజనం క్యారియర్ లోపలపెట్టి, రూములో బంధించి వెళ్ళిపోయారు.

"ఛీ! ఏం బతుకు నాది? ఈ వెధవలెవరో తెలియదు. ఎవరో కొన్‌కిస్కా గాళ్ళు నా శరీరాన్ని, రోడ్డు మీద దొరికిన అశుద్ధాన్ని తినే కుక్కలు, మలిన పరిచాయి. ఆడదంటే ఇంత చులకనా? ఒక పామును పట్టుకుని బెదిరించి ఆడదాన్ని ఇష్టమొచ్చినట్టు చెరచవచ్చా? రేపటినుంచి నేను ఏ ముఖంతో బయట తిరగాలి. జీవితాంతం ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, ఏ మగాడైనా ఒక్కక్షణం కన్నా ఎక్కువసేపు నన్నుచూస్తే, వాడూ ఇప్పుడు నన్ను చెరచిన వాడూ ఒకడేనా అనే అనుమానంతో బతకాల్సిందేనా? అసలు నేను బతికుండాలా? ప్రాణాలు తీసుకోవటం బెటరా?" అని ఆలోచిస్తూ గడిపాను.

ఒంట్లో ప్రతీ అణువూ చెప్పలేనంత బాధతో అల్లల్లాడుతోంది. చిటికెన వేలును కూడా కదిలించే స్థితిలో లేని నాకు చావడానికిక్కూడా శక్తి లేదు.

"అయ్యో! ఎక్కడున్నానో తెలియదు. ఇక్కడ అనామకంగా ఇలా చచ్చిపోతే జైల్లో ఉన్న అమ్మకు దిక్కెవరు? నేను చనిపోయినా ఫర్వాలేదు. కానీ నా రాకకోసమే కళ్ళల్లో ప్రాణాలు నింపుకుని బ్రతుకుతున్న అమ్మ నేను చచ్చిపోయానన్న వార్త విన్న మరుక్షణం ప్రాణాలు వదిలేస్తుంది. అమ్మకోసమైనా నేను బ్రతికుండాలి. కనీసం నామీద జరిగిన అత్యాచారం జరిగిన విషయం తెలిసినా అమ్మ బ్రతికుండదు" అని తలుచుకునేసరికి కళ్ళల్లో నుండి నీళ్ళు కారుతున్నాయి. వాటిని తుడుచుకునేందుకు కూడా చెయ్యికదపలేని స్థితిలో అలాగే ఆ రాత్రంతా పడి ఉన్నాను.

తెల్లారాక మళ్ళీ నలుగురు వచ్చారు.

"బేబీ! ఉఠో! లే, లే!" అంటూ నన్ను లేపారు.

వాళ్ళను చూడగానే నేను వణికిపోయాను. ఒంట్లో సత్తువ లేదు. ఇప్పుడు గనుక వాళ్ళు నాతో సెక్స్‌చేస్తే చచ్చి ఊరుకుంటాను. ఈ పాపపంకిలమైన శరీరం నుండి విముక్తి పొందుతాను. కానీ, అమ్మ... అమ్మ గుర్తొచ్చి, చేతులెత్తి మొక్కాను.

"లేదు బేబీ! భయపడకు. చలో! ఘర్‌కు జాతే క్యా! ఇంటికి వెళ్ళిపోతావా?" అంటూ నన్ను నేల మీద నుండి పైకి లేపారు. వాళ్ళల్లో ఒకడు టీ తాగించాడు. రెండు టాబ్లెట్లు మింగించాడు. ఏదో ఒక ఇంజెక్షన్ ఇచ్చాడు.

నేను మంచంలో వాలిపోయాను. మందుల ప్రభావమేమోగానీ మధ్యాహ్నం లేచేసరికి ఒంటి నొప్పులు తగ్గాయి. వాళ్ళు ఆ రూములోనే ఉన్నారు. కడుపులో పేగులు 'అన్నమో రామ చంద్రా!' అని అరుస్తున్నాయి. 'ఆకలి' అన్నట్టు సైగచేశాను.

వాళ్ళు తీసుకొచ్చిన రోటీలు సిగ్గులేకుండా తిన్నాను.

"బేబీ! ఘర్‌కు జాతే? ఇంటికి పోతవా?" అన్నాడు పాము పట్టుకొచ్చినవాడు.

ఆ మాటలు చెవుల్లో అమృతం పోసినట్లుగా వినిపించాయి. కానీ, నేను నా చెవులను నమ్మలేక పోయాను. వాళ్ళవైపు ఆశగా చూశాను. 'పోతానని' తలూపాను.

"మాకో చిన్న పనిచేసి పెట్టాలె' అన్నాడు వాడు.

నేను వణికిపోయాను. సందేహంగా చూశాను. అప్పుడే, క్షణం క్రితం మొలకెత్తిన ఆశ, నాలో చచ్చిపోయింది. మాడిపోయిన నా ముఖం చూసి,

'నిన్నటి సిన్మా బాగా వచ్చింది. దేఖ్‌తే? చూస్తవా?' అంటూ నిన్న పొద్దున్న పామును చూసినప్పటి నుండి వణికిపోతూ నేను వాళ్ళు చెప్పిందల్లా చేయడం, వాళ్ళు నన్ను ఆవురావురుమంటూ కబళించిన దృశ్యాలు చూపిస్తుంటే, అప్పుడే తిన్నదంతా నోట్లోకి వచ్చి, భళ్ళున వాంతి అయింది.

"ఛీ... ఛీ..." అంటూ వాళ్ళు దూరంగా జరిగారు.

"దీన్ని యూట్యూబ్‌లో పెట్టాల్నా?" అన్నాడు వాడు కోపంగా.

"వద్దొద్దు!" అని వాడి కాళ్ళు పట్టుకున్నాను. అందరి కాళ్ళూ పట్టుకుని ఏడ్చాను.

"మరి మేం చెప్పినట్టు చేస్తవా?" అన్నాడు.

"నా దగ్గర డబ్బులేం లేవు!" అన్నాను.

వాళ్ళు బిగ్గరగా నవ్వారు.

"నీ డబ్బులు మాకేం వద్దు."

"మరి?" అన్నాను అనుమానంగా. నేనే ఆత్రంగా,

"మళ్ళీ ఎప్పుడు రమ్మంటే అప్పుడొస్తాను! నన్ను వదిలేయండి ప్లీజ్!" అని అన్నాను. "ముందు ఇక్కడి నుంచి బయటపడాలి. వీళ్ళకు అందనంత దూరం పారిపోవాలి. ఆ తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చుననుకుని" అలా చెప్పాను.

"వద్దు బేబీ! ఒకసారి రుచి చూశాక పాత బేబీ మాకు నచ్చదు. మా బాయ్ తోడుగా ఉంటే.." అంటూ జెర్కిన్ జేబులో ఉన్న పామువైపు చూపిస్తూ,

"రోజుకో కొత్త అందం మా సొంతం" అంటూ నవ్వాడు.

'హమ్మయ్యా!' అనుకున్నాను. 'ఈ పీడా వదిలితే ఏ పనైనా చేయొచ్చు' ననుకున్నాను.

కానీ, వాళ్ళు చెప్పిన పని విని నా మతి పోయింది.

**(ఇంకా వుంది)**

# సురభి

అరవై ఏళ్ళు దాటాయంటే చాలు, ఇక రెస్టు తీసుకుందాం అనుకుంటారు చాలామంది. కానీ ఆ బామ్మ అలా అనుకోలేదు. తొంభై ఏళ్ళ వయసులో కూడా ఇంకా పనిచేస్తూనే ఉంది.

## యంగ్ బామ్మ!



మాస్కో, రాజాన్ సిటీ హాస్పిటల్‌లో శస్త్ర చికిత్స నిపుణురాలు ఈ బామ్మ.

తొంభయ్యేళ్ళ వయసులో కూడా ఈ బామ్మ రోజుకు నాలుగు ఆపరేషన్లు చేస్తోంది. ఆమె పేరు అల్లా ఇల్లినిక్నా లెవుష్కినా. కడచిన 67 సంవత్సరాలుగా సుమారు పదివేల ఆపరేషన్లు చేసిందట. రిటైర్మెంట్ ప్రసక్తే లేదంటోందీ బామ్మ! ఆమె మనోనిబ్బరానికి ఎవరైనా ఆహా! అనాల్సిందే!

షాపింగ్‌మాల్స్, రైల్వేస్టేషన్లు, థియేటర్లలో ఎస్కులేటర్ ఎక్కేందుకు ఎవరైనా సరదా పడతారు. కానీ ప్రకృతి అందాలు వీక్షించడానికి కూడా ఎస్కులేటర్లున్నాయి. వాటిని ఎక్కాలంటే

## సైట్ సీయింగ్ ఎస్కులేటర్



చైనా వెళ్ళాల్సిందే!

చైనా హుబే రాష్ట్రం ఎన్షి నగరంలోని ఎన్షి గ్రాండ్ కెన్యన్ అనే పెద్ద లోయ ప్రకృతి అందాలకు నిలయం. లోయ మొత్తం కాలినడకన తిరగాలంటే చాలా కష్టం కదా. అందుకే ఆ బాధ తప్పించటానికి ఎస్కులేటర్ ఏర్పాటుచేశారు. ఇది ఏకంగా 688 మీటర్ల పొడవుంది. ఇలా పర్యాటకుల సందర్శన కోసం ఏర్పాటుచేసిన ఎస్కులేటర్లలో ప్రపంచంలో ఇదే పొడవైనది.

పైన రక్షణ కోసం ప్రత్యేకమైన పైకప్పు కూడా కట్టారు. గంటకు 7,300 మంది ఈ ఎస్కులేటర్ ఎక్కి లోయ అందాలు చూడొచ్చు.

## కొత్త భాష కనిపెట్టిందోచ్!



ప్రపంచంలో తెల్లారి లేస్తే ఎన్నో వింతలూ, విడ్డూరాలూ సృష్టిస్తారెందరో. ఇంగ్లాండ్ కోర్న్‌మ్ పట్టణానికి చెందిన టీనేజ్ అమ్మాయి మెలీసా మే కూడా ఈ జాబితాలో చేరిపోయింది.

ఎందుకంటే ఆమె కొత్తగా ఒక భాష కనిపెట్టింది. అంతేకాదు, ఏకంగా ఆ భాషకు సంబంధించిన ఓ నిఘంటువునే రూపొందిస్తోంది.

మెలీసా మే మాతృభాషతోపాటు జర్మన్, ఫ్రెంచ్, స్పానిష్, పోర్చుగీస్... ఇంకా ఇతర భాషలు నేర్చుకుంది. అయితే ప్రపంచంలో ఎన్నో భాషలున్నాయి కదా, తాను కూడా ఓ భాష కనిపెడితే ఎలా ఉంటుంది? అని ఆలోచించిందట. ఆలోచన వచ్చిందే తడవు, మూడేళ్ళు కష్టపడి 1500 పదాలతో కొత్త భాష రూపొందించింది.

వేరువేరు భాషల్లో అక్షరాలు, పదాలు పలికితే వచ్చే శబ్దాల ఆధారంగా ఈ భాష కనిపెట్టానని చెబుతోందీ అమ్మడు.

ఆ భాషకు 'స్కెనవన్స్' అని పేరు పెట్టింది. అంటే 'మనం మాట్లాడే భాష' అని అర్థం. ఇది అరబిక్ లిపిని పోలి ఉంటుంది.

తాను రూపొందించే నిఘంటువులో ప్రతీ పదానికి అర్థం, ఆ పదం ఎలా వచ్చిందన్న అంశాలు పొందుపరిచింది. మొత్తానికి ప్రపంచ భాషల్లో ఇంకో కొత్త భాష వచ్చి చేరిందన్న మాట.

ఏదైనా దేశానికి వెళ్ళినపుడు అక్కడి వింతలు విశేషాలతోపాటు ప్రముఖ కట్టడాలు, ప్రకృతి సోయగాలు చూసేందుకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. అలాగే జపాన్ వెళితే ఆ రోడ్ క్రాసింగ్ చూసితీరాల్సిందే అంటున్నారు పర్యాటకులు.

## బిజీ బిజీ క్రాస్‌రోడ్డు

జపాన్, షిబుయా పట్టణంలో ఓ రోడ్డు కూడలి ప్రపంచంలోనే బిజీయెస్ట్ రోడ్‌క్రాసింగ్ జంక్షన్‌గా పేరొందింది. ఆ కూడలి చుట్టూ షాపింగ్‌మాల్స్, పేరొందిన కార్యాలయాలు, కాలేజీలు ఎన్నో ఉన్నాయి. దీంతో అక్కడ జన సంచారం అధికం.



రెడ్‌సిగ్నల్ పడగానే, ఒకవైపు పాదచారులు నడుస్తుంటే, మరోవైపు వాహనాలు, ప్రజలు ఆగిపోతారు. కానీ ఈ కూడలిలోని నాలుగువైపులా జీబ్రాక్రాసింగ్‌పై నడుస్తూ పాదచారులు రోడ్డు దాటుతారు. అలా ఒకేసారి వందల మంది దాటేస్తుంటారు. రోడ్డు దాటిన తర్వాత వాహనాలకు గ్రీన్‌సిగ్నల్ పడి తిరిగి పాదచారుల కోసం సిగ్నల్ పడేలోపు రోడ్డు దాటేందుకు మళ్లీ వందల సంఖ్యలో ప్రజలు పోగవుతారు. ఇలా 24 గంటలూ అక్కడ ప్రజలు సిగ్నల్ సిగ్నల్‌కీ రోడ్డు దాటుతుంటే, చూపరులకు భలే అనిపిస్తుందట. అందుకే ఈ కూడలికి యూట్యూబ్‌లో లైవ్‌షో ఏర్పాటుచేశారు.

ఒకప్పుడు పొలానికైనా, పక్కూరికైనా సైకిలే దిక్కు. సైకిల్‌పై వెళ్ళి అన్ని పనులూ పూర్తిచేసుకునేవారు. ప్రస్తుతం సైకిళ్లు పాతబడిపోయినా, ఓ వ్యక్తి మాత్రం సమాజ శ్రేయస్సు కోసం పన్నెండేళ్లుగా సైకిల్‌పై ప్రయాణిస్తూ

## సైకిల్ యాత్ర

ప్రపంచ దేశాలు చుట్టేస్తున్నాడు.

పశ్చిమ బెంగాల్ సుందర్‌బన్ అటవీ ప్రాంతంలో మారుమూల గ్రామస్థుడు సోమెన్ డెబ్‌నాథ్. సైకిల్ యాత్ర చేస్తూ, ఎయిడ్స్‌పై అవగాహన కల్పిస్తున్నాడు. మొదట ఈశాన్య రాష్ట్రాల్లో, తర్వాత భారత దేశం మొత్తం తిరిగి ఎయిడ్స్‌పై అవగాహన కలిగించాలనుకున్నాడు. అనుకున్నదే తడవుగా మూడేళ్ల కష్టపడి దేశం మొత్తం తిరిగాడు. అయినా సంతృప్తి పడలేదు.



2004లో ప్రపంచయాత్రకు శ్రీకారం చుట్టాడు. ఇంకా ప్రయాణిస్తూనే ఉన్నాడు. ఇప్పుడు ప్రపంచమే అతని కుటుంబం. ఎయిడ్స్‌పై అవగాహన కల్పించేందుకు బయలుదేరిన డెబ్‌నాథ్ ఇప్పుడు భారతీయ సంస్కృతిని ప్రపంచానికి చాటిచెప్పే బాధ్యత తీసుకున్నాడు. 2020 లోపు ప్రపంచ దేశాలన్నీ తిరగాలనే లక్ష్యంతో ప్రయాణం కొనసాగిస్తున్నాడు.

**-నర్మద వాసిరెడ్డి**




# ఏయ్! ఇదిగో!

**కాలేజీ అమ్మాయి స్నేహితులతో సెకండ్‌షో సినిమాకి వెళ్ళింది. ఎంతసేపు గడిచినా ఇంటికి చేరుకోలేదు. తల్లిదండ్రులు ఆందోళనతో ఫ్రెండ్స్ ఇళ్ళకు ఫోన్లు చేశారు. వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. మీ ఇంటి సందు మొదట్లోనే వదిలిపెట్టాం, ఆమె వెనక్కు తిరిగి బై కూడా చెప్పిందన్నారు వాళ్ళు. డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించాడు అమ్మాయి తండ్రి. ఆమెను ఎవరు కిడ్నాప్ చేశారు? శరత్ ఈ కేసు ఎలా సాల్వ్ చేశాడు?**

**'మా అమ్మాయి కనిపించడంలేదు, మీరే కనిపెట్టి మమ్మల్ని ఆదుకోవాలి' డిటెక్టివ్ శరత్‌కు కన్నీళ్ళతో చెప్పాడు తండ్రి.**

**'పోలీసులకు ఫిర్యాదు చేశారా?'**

**'చేశాను'.**

**'సరే, జరిగిందేమిటో చెప్పండి.'**

'అమ్మాయి కాలేజీలో చదువుతోంది. ఫ్రెండ్స్ అంతా కలిసి సెకండ్‌షోకి వెళ్ళారట. ఎంతసేపటికీ ఇంటికి రాలేదు అమ్మాయి. ఫ్రెండ్స్‌ని ఫోన్లో అడిగితే ఆశ్చర్యపోయారు. మా ఇంటి సందు మొదట్లోనే దిగబెట్టి వెళ్ళారట. అక్కడి నుంచి మా ఇంటికి పది అడుగులే దూరం. అంతలోనే ఎలా మాయమవుతుంది? ఫోన్ స్విచ్చాఫ్ అయింది. మా అమ్మాయిని మీరే వెతకాలి' ప్రాధేయపడుతూ అడిగాడు.

'ఎవరైనా ఫోన్లు చేశారా?'

'లేదు.'

'అంటే డబ్బుకోసం కిడ్నాప్ చెయ్యలేదు, కాలేజీలో ఎవరినైనా ప్రేమిస్తున్నట్టు, ఎవరైనా వేధిస్తున్నట్టు చెప్పిందా?'

'అలాంటిదేమీ లేదు. మా అమ్మాయికి చదువు తప్ప ఇంకేం తెలియదు'

'ఎవరిమీదైనా అనుమానం ఉందా?'

'ఎవరితోనూ అంత వైరంగానీ, ఇచ్చేందుకు డబ్బుగానీ లేవు.'

'సరే రాముకి వివరాలు చెప్పి వెళ్ళండి, పరిశోధిస్తాను' అన్నాడు శరత్.

ఆయన వెళ్ళాక ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్‌కు ఫోన్ చేసి, 'భార్గవి వివరాలు కావాలి' అన్నాడు.

'మధ్యలో మీగోల ఏంటండీ? మా దర్యాప్తు కొనసాగుతుంటే మధ్యలో వివరాలు ఇవ్వడం కుదరదు, అనవసరంగా నన్ను డిస్టర్బ్ చెయ్యొద్దు' కరాకండిగా చెప్పాడు ఇంద్రజిత్.

ఫోన్ పెట్టేసి అసిస్టెంట్ రామూని పిలిచి, 'భార్గవి కేసులో నీ సహాయకుల్ని రంగంలోకి దింపు' అన్నాడు లేస్తూ.

•••

'పోలీసులు ఎవరితోనూ మాట్లాడవద్దన్నారు' భయంగా చెప్పారు భార్గవి ఫ్రెండ్స్.

'ఫర్వాలేదు. నేనెవరికీ చెప్పను' అన్నాడు శరత్.

'భార్గవి మంచిదండీ. రవి ఆమె వెంట పడ్డాడు. తనను ఇష్టపడకపోతే చంపేస్తానన్నాడు, మాకు అతనిమీదే అనుమానం.'

'రవి ఎక్కడ ఉంటాడు, అడ్రస్ చెప్పండి'

•••

మా వాడు అమాయకుడు. వాడికేం తెలియదు. ఎంత చెప్పినా వినకుండా పోలీసులు వాణ్ణి తీసుకుపోయారు, వారం రోజులుగా జ్వరంతో ఇంట్లో పడున్నవాడు అమ్మాయిని ఎలా ఎత్తుకుపోతాడు?' అరుస్తూ చెప్పాడు రవి తండ్రి.

'జ్వరమా? వైద్యుడెవరు?' అడిగాడు శరత్. ఆయన ఇచ్చిన అడ్రస్ తీసుకుని ఆరా తియ్యమంటూ దాన్ని రామూకి ఫార్వర్డ్ చేశాడు.

•••

'ఇక్కడే దిగబెట్టామండీ. చెయ్యి కూడా ఊపి వెళ్ళింది. కొంతమేరకు లోపలికి వెళ్ళడంచూసి మేం వెళ్ళిపోయాం' భార్గవిని సందుమొదల్లో దింపిన ప్రదేశం శరత్‌కి చూపిస్తూ ఫ్రెండ్స్ చెప్పారు.

అక్కడ నిలబడి భార్గవి ఇంటివైపు చూశాడు శరత్. రోడ్డు కుడివైపు రెండిళ్ళు, తర్వాత ఖాళీ స్థలం. మళ్ళీ ఒక ఇల్లు, రెండు ఖాళీప్లాట్లు. తర్వాతదే భార్గవి ఇల్లు. కుడివైపు వరసగా ఇళ్ళున్నాయి. భార్గవి ఇంటిముందు ఖాళీ స్థలం! మెల్లిగా అక్కడ నుండి ఆమె ఇంటివైపు నడిచాడు శరత్. రెండు ఖాళీప్లాట్లలో ఒక ప్లాటుకు ప్రహరీగోడ ఉంది. లోపల పెద్దచెట్లు. గేటు కొద్దిగా తెరచి వుంది. అటెళ్తుంటే గేటు దగ్గర పొదల్లో విరిగిపోయిన తాళం కనిపించింది. చుట్టూ చూశాడు. ఇళ్ళ తలుపులన్నీ వేసివున్నాయి. 'పొద్దున్నే ఇలా ఉంటే, ఇక రాత్రి ఎలా ఉంటుందో ఊహించడం కష్టంకాదు' అనుకుంటూ గేటు తీసి లోపలికి అడుగుపెట్టాడు శరత్.

చెట్లు ఇష్టం వచ్చినట్టు గుబురుగా పిచ్చిగా పెరిగాయి.

కిడ్నాపర్లు ఈ చెట్లలో దాక్కుంటే ఎవ్వరికీ కనబడరు. వీధిదీపాల వెలుగు కూడా ఆ ప్రాంతంలో కనిపించదు. రాత్రిపూట అక్కడ ఎవరైనా దాక్కుంటే ఎవరికీ తెలిసే అవకాశం లేదు.

ప్లాటు లోలోపలికి వెళ్తున్న శరత్ ఆగిపోయాడు. అక్కడే కొత్తగా ఇటీవలే ఎవరో మట్టిని కదిపిన ఆనవాళ్ళు! చుట్టూ నేలను జాగ్రత్తగా గమనించడం ఆరంభించాడు. ఒక గుబురు పొదను జాగ్రత్తగా పక్కకు జరపబోయి ఆగిపోయాడు. రామూకు ఫోన్ చేశాడు. నెమ్మదిగా తెంపి కుప్పలా పోసిన చెట్లను పక్కకు తప్పించాడు. అక్కడ గుంత తవ్వి మట్టితో పూడ్చి పైన గుబురు చెట్లు కట్ చేసి కనబడకుండా కప్పేశారు. ఇంతలో రాము, అతని అనుచరులు వచ్చారు.

శరత్ చూపిన చోట మట్టి తవ్వడం ప్రారంభించారు. కాస్సేపటికి గుంటలో గుడ్డతో కప్పిన శవం బైటపడింది. ఇంద్రజిత్‌కి ఫోన్ చేశాడు శరత్.

•••

'ఇదంతా ఎవరు డిస్టర్బ్ చెయ్యమన్నారు? క్రైమ్ సీన్‌లో తీసుకోవాల్సిన జాగ్రత్తలు తెలియవా? గుబురు పొదల్లో ఎక్కడో వేలిముద్రలుండొచ్చు. అంతా డిస్టర్బ్ చేశారు. మా లాంటి ఎక్స్‌పర్ట్‌లకు చెప్పొచ్చుకదా? తెలిసీ తెలియక అన్నీ తెలిసినట్టే ప్రవర్తిస్తారు' అరవడం ప్రారంభించాడు ఇంద్రజిత్ వస్తూనే. శరత్ మాట్లాడలేదు.

శవాన్ని జాగ్రత్తగా బైటకు తీయడం గమనిస్తూ మౌనంగా నిలుచున్నాడు.

'వెధవ కుక్కలు వాసన పసిగట్టలేకపోయాయి. రోడ్డంతా తిరిగినాగానీ, ఈ వైపు చూడలేదు. శవం ఇక్కడ ఉన్నా గానీ వాసన రాలేదు. ఎవరికి అనుమానం వస్తుంది?' సబార్డినేట్లమీద అరుస్తూనే ఉన్నాడు ఇంద్రజిత్.

శవం పైన గుడ్డ తొలగించారు. శవం భార్గవిదే.

'ఎవ్వరూ శవాన్ని తాకవద్దు, ఫోరెన్సిక్ నిపుణులు వస్తారు' శరత్‌ని చూస్తూ అరిచాడు ఇంద్రజిత్.

దూరం నుండే శవాన్ని పరిశీలనగా చూస్తున్నాడు శరత్. అతడి దృష్టి నుదుటిపై బొట్టులా వున్న బూడిదపై పడింది. గుడ్డకప్పటం వల్ల అది స్పష్టంగా తెలుస్తోంది. కానీ గాలి తగలటంవల్ల కొద్దికొద్దిగా బూడిద రేణువులు ఎగురుతున్నాయి.

ఇంద్రజిత్‌కు అది చూపించాడు శరత్.

'నా అనుమానం, హంతకుడు తాగుతున్న సిగరెట్ బూడిదను అమ్మాయి నుదుటిపైన అద్దాడు. వేలితో అద్దివుంటే వేలిముద్ర ఉంటుంది. ఫోరెన్సిక్ నిపుణులు వచ్చేసరికి గాలికి బూడిద ఎగిరిపోవచ్చు. నేను ఆ వేలిముద్రను తీస్తాను' అడిగాడు.

'వీల్లేదు. ఇది నా పరిశోధన. ఇది నా కేసు. ఇతర ఇన్‌స్పెక్టర్లలా నీ వెంట తోకలా తిరగను

నేను. నువ్వే నా తోకవి' అరిచాడు ఇంద్రజిత్. శరత్ మాట్లాడలేదు. గాలికి కదిలి నెమ్మదిగా ఎగిరిపోతున్న బూడిద రేణువులను చూస్తూ నిలుచున్నాడు. కాసేపు చూసి గ్లవ్స్ వేసుకున్నాడు. 3 ఎం. ఫింగర్ ప్రింట్ టేప్ తీసుకున్నాడు. రామూకి సౌంజ్ఞ చేశాడు.

రాము అరిచాడు. 'బాస్...ఇక్కడ సిగరెట్ పీక ఉంది. బాస్ త్వరగా రా' శరత్ ఆ వైపు కదలబోయాడు.

ఆపాడు ఇంద్రజిత్. ఇది నా ఇన్వెస్టిగేషన్, అంటూ అటెళ్ళాడు ఇంద్రజిత్. అతను ఆ వైపు వెళ్ళగానే, శరత్ అమ్మాయి నుదుటిపైన జాగ్రత్తగా టేపు ఉంచి, దాన్ని అద్ది వెంటనే లాగేశాడు. దాన్ని తెల్లటి వేలిముద్రల కార్డుపై అద్దాడు. చక్కటి బొటనవేలి ముద్ర దానిపైన పడింది.

వెంటనే ఏమీ ఎరగనట్టుగా దాన్ని దాచేసి నిలబడ్డాడు శరత్.

కోపంగా వచ్చాడు ఇంద్రజిత్. 'ఇలాంటి అసిస్టెంట్లు ఉంటే పని అయినట్టే. ఏది కనబడితే అదే దొంగను పట్టే అధారం అనుకుంటే జీవితాంతం పరిశోధన చేస్తూనే ఉంటాం ఫలితం లేకుండా. అసిస్టెంట్లే ఇలావుంటే ఇక అసలు డిటెక్టివ్ ఎలా ఉంటాడో' అరిచాడు. మౌనంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు శరత్.

●●●

కారులో కూర్చుని లైవ్ స్కాన్ 10 ప్రింటర్ తీశాడు. పోర్టబుల్ ఫింగర్ ప్రింట్ స్కానింగ్ యంత్రం అది. దాన్ని ల్యాప్‌టాప్‌కు కనెక్ట్ చేశాడు. ప్రింట్ స్కాన్ చేశాడు. ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ వేణుకు పంపి అతడికి ఫోన్ చేశాడు.

'వేణూ.. ఇప్పుడే నీకో ప్రింట్ పంపించాను. దాన్ని నేరస్థుల డేటాతో పోల్చు. ఏమైనా తెలుస్తుందేమో చూడు. లేకపోతే, సింక్రోట్రాన్ ఇన్ఫ్రారెడ్ మైక్రో స్పెక్ట్రోస్కోపీ (Synchrotron infrared micro spectroscopy) చేసి చూడు' చెప్పాడు శరత్. వేలిముద్రల్లో చెమటతో పాటు రసాయనాలుంటాయి. ఈ యంత్రం ద్వారా వాటిని పసికడతారు. వాటి ఆధారంగా వేలిముద్ర ఎవరిదో వారు ఎలాంటి మందులు, మాదకద్రవ్యాలు తీసుకునేవారో, ఆ వేలిముద్ర మగవారిదా? అడవారిదా? అనే విషయాలు కూడా కనుక్కోవచ్చు. ఫోన్ పెట్టేసి నిట్టూర్చాడు శరత్. శవాన్ని అంబులెన్స్‌లో ఎక్కిస్తున్నారు. శవం నుదుటన బూడిద గురించి ఎవరూ పట్టించు కోలేదు!

●●●

వారంక్రితం జైలు నుంచి తప్పించుకున్న నరసింహం వేలిముద్ర అది. డబ్బుకోసం ఆడవాళ్ళను హత్య చేస్తాడు. నాలుగైదు హత్యానేరాలున్నాయి అతడిమీద' చెప్పాడు వేణు.

ఆ రిపోర్టు చూశాడు శరత్.

అమ్మాయి బంగారు గొలుసు, చెవి రింగులు, గాజులు, చేతివాచీ, పర్సు, మొబైల్ ఏవీ లేవు. పుస్తకాలు గోతిలోనే దొరికాయి. ఆలోచిస్తూ వేణు అందించిన నరసింహం వివరాలు చదవడం ఆరంభించాడు.



●●●

'ఆయన పోలీసుల దగ్గరే ఉన్నారు. ఇంట్లో ఎందుకుంటాడు?' ఎదురుప్రశ్న వేసింది నరసింహం భార్య.

'ఇల్లంతా వెతకండి' ఆజ్ఞాపించాడు ఇంద్రజిత్. మౌనంగా నిలబడి చూస్తున్నాడు శరత్.

ఇంతలో రాము నుంచి ఫోన్ రావడంతో బైటకు వెళ్ళాడు శరత్.

'ఇంట్లోదాచిపెట్టి, లేడని చెబితే నిన్నుకూడా జైల్లో తోస్తాను, జాగ్రత్త' అరుస్తున్నాడు ఇంద్రజిత్.

●●●

శరత్ బైటకు రాగానే, దూరంగా కర్రపట్టుకుని కుంటుతూ పోతున్న బిచ్చగాడివైపు చూపించాడు రాము. శరత్ గబగబా అతని వెంట వెళ్ళాడు. 'తాతా...ఇదిగో..' అని పదిరూపాయలనోటు ఇవ్వబోయాడు. బిచ్చగాడు ఆగలేదు. శరత్ పిలవగానే కర్రపారేసి పరుగు ఆరంభించాడు. కానీ రాము అనుచరులు చుట్టుముట్టారు.

శరత్ ఇంద్రజిత్‌కి ఫోన్ చేశాడు.

●●●

'జైలు నుంచి తప్పించుకున్నాడు నరసింహం. ఊరెళ్ళేందుకు డబ్బులేదు. ఆ ఖాళీప్లాట్‌లో గుబురు చెట్ల నడుమ దాక్కుని చిన్న చిన్న దొంగతనాలతో కడుపు నింపుకుంటున్నాడు. ఆ రోజు రాత్రి అమ్మాయి ఒంటరిగా రావటంచూసి ఎత్తుకుపోయి విలువైన వస్తువులు కాజేశాడు. అమ్మాయి ప్రతిఘటించడంతో నోరుమూసి గొంతు నొక్కాడు. అమ్మాయి చనిపోయింది. దాంతో అక్కడే దొరికిన పాడైపోయిన పనిముట్లతో గుంట తవ్వి అందులో పడుకోబెట్టి, ఆమె దుపట్టానే ఆమెపై కప్పాడు. అమ్మాయికి బొట్టు లేదని చూసి, సిగరెట్ బూడిదతో బొట్టుపెట్టి బొటనవేలితో దాన్ని అద్దాడు. తాగిన సిగరెట్ పీక కూడా వెంట తీసుకుపోయాడు. కానీ బొటన వేలు ముద్ర వదిలిపెట్టాడు సాక్ష్యంగా! దొరికిన డబ్బుతో ఊరికి చేరుకున్నాడు. ఎవరూ పట్టుకోలేరనుకున్నాడు. ఎందుకంటే అప్పటికే పోలీసులు నరసింహం ఇంట్లో వెతికి వెళ్ళిపోయారు. కానీ బూడిదబొట్టులో ఉన్న వేలిముద్రతో దొరికిపోయాడు' కేసు వివరాలు చెప్పాడు శరత్.

***-కస్తూరి మురళీకృష్ణ***
*సెల్: **98496 17392***




**"నిన్నటికంటే ఈరోజు నిన్ను మరింతగా ప్రేమిస్తున్నాను. అయితే అది, రేపు నీమీద ఉండే ప్రేమ కంటే తక్కువే!" ఫోన్ బీప్‌మంది.**

**పాపప్ అయిన మెసేజ్ చూసి హర్ష పెదవులమీద చిరునవ్వు. క్రమంగా అది మొహమంతా పాకింది. అతని మొహం చూసిన వాళ్ళెవరైనా అతను ప్రేమలో పడ్డాడని చెప్పగలరు. 'తన మీద ప్రేమ రోజురోజుకీ పెరుగుతోందని' ఎంత చక్కగా ఎక్స్‌ప్రెస్ చేసింది.**

"నువ్వెవరో చెప్పొచ్చు కదా!" రిప్లయ్ ఇచ్చాడు.

"నువ్వే కనుక్కో!" అటునుంచి సమాధానం.

"క్లూ ఇవ్వు!"

"ఏం క్లూ ఇవ్వాలో అడుగు"

"నీ పేరులో ఫస్ట్ లెటర్ ఏంటో చెప్పు"

ఒక నిమిషం నిశ్శబ్దం తర్వాత టైపింగ్ అని కనబడుతోంది.

"హర్షా! నన్ను డిజప్పాయింట్ చేయకు. నువ్వు ప్రపంచంలో అందరికంటే మేధావివి అని నా నమ్మకం. అంతరిక్షం నుంచీ బెర్ముడా ట్రయాంగిల్ వరకూ కొలతలతో సహా తడుముకోకుండా చెప్పగలిగే నువ్వు ఇంతకంటే మంచి హింట్ అడగొచ్చు".

చెంపమీద కొట్టినట్టు అనిపించింది హర్షకి.

"అంత సిల్లీ ప్రశ్నా అది?" బుర్ర గోక్కున్నాడు.

కళ్లజోడు తీసి తుడుస్తూ ఆలోచనలో పడ్డాడు.

రెండు నిమిషాలు గడిచింది.

మళ్లీ మెసేజ్ ఫోన్ స్క్రీన్ మీద పాపప్ అయింది.

"ఓకే.. అర్జంట్‌గా ఫోర్త్‌ఫ్లోర్‌లో ఉన్న కెఫెటేరియాకి వచ్చేయ్... నేనిక్కడే ఉన్నాను".

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోతారు. ఇక తనకు మిగిలిన ఒకే ఒక బంధం నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు అక్షయ్. అకస్మాత్తుగా నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ కంప్లయింట్ ఇస్తాడు అక్షయ్. ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన వెబ్‌సైట్ లింక్ ద్వారా ఆన్‌లైన్‌లో రన్ అవుతున్న ప్రాస్టిట్యూట్ రింగ్‌వారిని, ఓ టీవీ చానల్ ద్వారా స్టింగ్ ఆపరేషన్ చేసి, అరెస్టు చేయిస్తాడు అక్షయ్. పేపర్లో వచ్చిన ఓ వార్త ఆధారంగా పసిపిల్లలను బలిచ్చేవారిని వెతుకుతూ కలకత్తా వెళతాడు. అక్కడ ఓ గైడ్ తారసపడి, అఘోరాల దగ్గరకి తీసుకువెళతాడు. అక్కడ బలివ్వబోతున్న చిన్నారుల్ని కాపాడతాడు అక్షయ్. అక్కడ కూడా నైరా ఆచూకీ దొరకదు. ఈలోపు నైరా పోలికలున్న పాప మాకు అక్కడ కనిపించింది, ఇక్కడ కనిపించింది అంటూ రకరకాల సమాచారం వస్తుండటంతో అందరూ అయోమయానికి గురవుతారు.

ఆ తర్వాత...

"అంటే తన ఆఫీస్‌లో అమ్మాయే! ఒక్క విషయం కన్‌ఫర్మ్ అయిపోయింది" ఆనందపడ్డాడు హర్ష.

"వస్తున్నా!" రిప్లయ్ ఇచ్చి, పరుగెత్తినట్లుగా లిఫ్ట్ లాబీలోకి వెళ్తున్న అతన్ని వింతగా చూశారు చుట్టుపక్కల డెస్కులవాళ్లు.

ఫోర్త్‌ఫ్లోర్‌లో దిగి కెఫెటేరియా బయటున్న మెషీన్ దగ్గర బాడ్జ్‌ని స్వయిప్ చేయబోతుండగా తట్టిందతనికి.

"ఇప్పుడు మెసేజ్ పంపిస్తే ఆమె ఫోన్ చూసుకుంటూ తనకు దొరికిపోతుంది".

"ఒకవేళ నేనిప్పుడు రాకపోతే?" మెసేజ్ పంపించి, గబాల్న డోర్ తెరిచాడు.

అతనంత స్పీడ్‌గా డోర్ ఓపెన్ చేసేసరికి డోర్ గోడకి తగిలి క్రీచ్‌మని పెద్ద శబ్దం వచ్చింది.

లోపల దృశ్యం చూసి అతను నివ్వెరపోయాడు.

"టెక్నాలజీ విమెన్స్ నెట్‌వర్క్" సెషన్ ఏదో జరుగుతున్నట్లుంది.

ఆ కంపెనీలో పనిచేసే ప్రతి అమ్మాయి అక్కడే ఉంది.

ఇంకా దారుణమయిన విషయం ఏమిటంటే అప్పుడే ఫోన్‌లో ఫీడ్‌బ్యాక్ ఎంటర్‌చేయమన్నట్లు ఉన్నారు... దాదాపు ప్రతి ఒక్కరూ ఫోన్ టకటకలాడిస్తున్నారు.

శబ్దాలు చేస్తూ లోపలికొచ్చిన అతన్ని అందరూ ఆశ్చర్యంగా చూశారు. స్పీకర్ కొద్దిగా మొహం చిట్లించినట్లనిపించింది.

రెండు చేతులూ పైకెత్తి, 'సారీ!' అంటూ అక్కడ నుంచి బయటపడ్డాడు హర్ష.



అతను తన డెస్క్ దగ్గరికి వచ్చాడో, లేదో నవ్వుతున్న స్మయిలీ వచ్చిందతనికి మెసేజ్‌లో.

ఆ రోజంతా అతనికి అరగంటకొక స్మయిలీ లెక్కన మెసేజెస్ వస్తూనే ఉన్నాయి.

వచ్చిన ప్రతిసారీ అతను ఉడుక్కుంటున్నాడు. కానీ నవ్వొస్తోంది అతనికి కూడా.

రాత్రి పడుకునే ముందు వచ్చిందతనికి మెసేజ్.

"హర్షా! నువ్వు జీనియస్‌వే. నీ అంత కాకపోయినా నేనూ ఇంటెలిజెంట్‌నే! బెటర్ లక్ నెక్స్‌ట్ టైమ్!"

●●●

"రాజేష్, ఇవాళ డిన్నర్‌కి వెళ్దామా?" పెద్దగా అంది సీమ.

అప్పుడే అతను అటువైపు వెళ్తున్నాడు.

ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

అందరిముందూ అడుగుతోంది ఆమె. తన ఇమేజ్ పెరిగిపోతుంది. గర్వంగా చుట్టూచూశాడు.

సీమ దగ్గరకి వెళ్లి అన్నాడు.

"ఈరోజు నాకు చాలా ముఖ్యమైన మీటింగ్ ఉంది. తప్పనిసరిగా అటెండ్ అవ్వాలి. అయినా ఎటూకాకుండా గురువారం ఏమిటీ? రేపెళ్దాము".

"అబ్బ మీటింగే కదా. పోస్ట్‌పోన్ చేసుకో. అదే రేపు పెట్టుకోవచ్చు కదా! రేపు నాకు కుదరదు" అంది సీమ.

ఆలోచనలో పడ్డాడు. ఈ సీమ వల్లే పోయినసారి కూడా తను మీటింగ్స్ పోస్ట్‌పోన్ చేసుకున్నాడు. పోస్ట్‌పోన్ చేసిన తర్వాత తన ఎమర్జెన్సీ లీవ్‌వల్ల వాటిని కూడా అటెండ్ అవలేకపోయాడు. యు.ఎస్. టీమ్ చాలా అత్యవసరమని పెట్టిన మీటింగ్ అది. మళ్లీ మళ్లీ అవతల వ్యక్తి టైమ్ దొరకటం చాలా కష్టం. చాలా బిజీగా ఉంటాడతను. అతని కాలెండర్ ఎప్పుడూ ఖాళీ చూపించదు. ఇంత ఆలోచించినా రాజేష్ తన బలహీనతకి లొంగిపోయాడు. 'ఫ్యామిలీ ఎమర్జెన్సీ' అని మెయిల్ పెట్టి మీటింగ్ పోస్ట్‌పోన్ చేయమని రిక్వెస్ట్ పంపాడు.

'ఫ్యామిలీ ఎమర్జెన్సీ' అనే కారణం ఎం.ఎన్.సిలలో తిరుగులేనిది. ఉద్యోగి ఇంట్లో వారికి జబ్బు చేయటం కానీ, మరేదైనా అత్యవసర పరిస్థితి నెలకొనటం అని అర్థం. ఇటువంటప్పుడు ఎంప్లాయి పరిస్థితిని అర్థం చేసుకుని వారికి అవసరమైన సపోర్ట్, సహాయం అందిస్తారు. ఎంత అర్జంట్ పని ఉన్నా, ఎంప్లాయి మీద ఆధారపడ్డ వర్క్ ఉన్నా, దానివల్ల వేరే ఇతర పనులు ఆగిపోతున్నా సరే ఈ కారణంతో లీవ్‌కానీ, మీటింగ్‌లు పోస్ట్‌పోన్ చేయటం కానీ చేసినప్పుడు ఎటువంటి ప్రశ్నలూ అడగకుండా ఒప్పేసుకుంటారు. తిరిగివచ్చిన తర్వాత "ఇంట్లో అందరూ బాగున్నారా? హోప్ ఎవ్రీథింగ్ ఈజ్ ఆల్‌రైట్!" అని అత్యంత సాదరంగా అడుగుతారు.

మనస్సాక్షి ఉన్నవాళ్లెవరూ ఈ సౌకర్యాన్ని అనవసరంగా అబద్ధాలు చెప్పి వాడుకోరు. అయితే రాజేష్‌లాంటి వాళ్లవల్ల ఒకోసారి ఇది కూడా అబ్యూజ్ అవుతుంటుంది.

సాయంత్రం ఏడింటికి డ్రంకెన్ పోయెట్స్ కెఫేకి చేరుకున్నారిద్దరూ.

అదొక లాంజ్‌లాంటి రెస్టారెంట్. రాత్రవుతున్న కొద్దీ డీజే మ్యూజిక్‌తో హోరెత్తుతుందక్కడ. అవుట్‌డోర్ సీటింగ్ కూడా ఉందక్కడ. వెదురుతో చేసిన పందిళ్లవంటి వాటి కింద బాంబూ స్టిక్స్‌తో చేసిన



సోఫాలు వేసున్నాయి బయట.

బయటే కూర్చుందామంది సీమ.

ఏదేదో మాట్లాడుతోందామె. గట్టిగా క్లౌడ్ టెక్నాల జీస్ గురించి తన పరిజ్ఞానమంతా ప్రదర్శించటం మొదలెట్టింది.

రాజేష్‌కి చాలా ఇబ్బందిగా అనిపిస్తోంది. అందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి టెక్నాలజీ మీద పట్టులేకపోవటం అయితే, రెండవది అతను ఆమెతో సరస సంభాషణ జరపాలనుకోవటం.

ఎందుకంత గట్టిగా మాట్లాడుతోందో అర్థం కావ ట్లేదు అతనికి. ఆఫీస్‌లో మామూలుగానే మాట్లాడు తుంది. చుట్టుపక్కల వాళ్లంతా వీళ్లనే చూస్తు న్నారు.

అంతటితో ఊరుకోకుండా ఏవో ప్రశ్నలు అడుగు తోంది.

"రెండు డేటా సెంటర్స్ మధ్యన లేటెన్సీ లేకుండా సెక్యూర్‌గా కనెక్షన్ ఎలా చేయాలి?" అడుగుతోంది.

పక్కటేబుల్ వాళ్లు ఏమి చెప్తాడా అని ఆస క్తిగా చూస్తున్నారు. అందులో ఆడపిల్లలు కూడా ఉండడంతో అతనికి తల కొట్టేసినట్లయింది.

"ఇది చేసే టెస్టింగ్‌కి ఇంత ఇన్ఫర్మేషన్ అవస రమా?' పళ్లు పటపట నూరాడు.

మెనూ తీసుకుని అన్నీ ఇష్టం వచ్చినట్లు ఆర్డర్ చేసింది సీమ.

తీసుకొచ్చిన ఫుడ్‌ని కొద్దిగా కెలికి బాగాలేదని మరోటి ఆర్డర్ చేస్తోంది.

కాసేపటికి డీజే వాయిద్యాల హోరు ఎక్కు వైంది.

ఇక వెళ్దామన్నాడు రాజేష్.

"లేదు.. లేదు.. నేను ఎంజాయ్ చేస్తున్నా! ఇంకాసేపు కూర్చుందాము" బలవంతం చేసిం దామె.

తప్పనిసరై కూర్చున్నాడు రాజేష్.

డ్రమ్స్ బీట్ అతనికి గుండెలమీద కొడుతున్న ట్లుగా ఉంది.

రానురానూ శబ్దం పెరిగిపోతోంది.

అతని వయస్సు వల్ల కూడా ఆ వాతావర ణాన్ని తట్టుకోలేకపోతున్నాడు. గుండె దడ, తల నొప్పి మొదలయ్యాయి.

సీమ బలవంతం చేస్తున్నా ఉండదల్చుకో లేదు.

బయల్దేరదీశాడు.

కార్ దగ్గరకు నడుస్తుండగా మెరుస్తున్న కళ్లతో చెప్పింది సీమ.

"ఇట్ వాజ్ ఫన్! మళ్లీ ఇంకోసారి రావాలి మనం".

మనసులోనే మూడు, నాలుగుసార్లు సీమ చెంప చెళ్ళుమనిపించి తృప్తిచెందాడు రాజేష్.

●●●

న్యూస్‌పేపర్ సిటీ ఎడిషన్‌లోని మారుమూల చిన్న బాక్స్‌లో ఒక వార్త పడింది. పేపర్ తిర గేస్తుండగా అక్షయ్ కంటపడిందా వార్త.

సుజాత అనే స్త్రీ తన బిడ్డ కనబడట్లేదని సంవత్సరం కిందట ఫిర్యాదు చేసిందట. ఇంటి ముందు ఆడుకుంటున్న తన కూతురు పింకీ సడ న్‌గా మాయం అయిందట. వారం క్రితం ఆమె పొరుగింటి వాళ్లు బిర్లాటెంపుల్ ముందు ఒక పాప అడుక్కుంటోందనీ, అచ్చు పింకీలా ఉందనీ చెప్పారు. బిర్లా టెంపుల్, వాళ్లు ఉండే ఇంటికి పది నిమిషాల దూరంలోనే ఉంది. గబగబా సుజాత, వాళ్లు చెప్పిన చోటికి వెళ్లి వెతికితే ఆమె కూతురు అడుక్కుంటూ కనబడింది.

వెంటనే భర్తకూ, స్నేహితులకూ ఫోన్‌చేసి అక్క డకు రమ్మంది సుజాత.

వాళ్లు తనవైపు రావటం చూసి పారిపోబో యింది పింకీ. ఆమెతో ఉన్న తోటి బిచ్చగాళ్లు సుజాత వాళ్లకు అడ్డుపడ్డారు. పోలీసుల సాయంతో పింకీని తిరిగి ఇంటికి తెచ్చుకుందామె.

ఆ పిల్ల ఇంటికి దగ్గరలోనే అడుక్కుంటూ ఇంటికి రాకపోవటమూ, సంవత్సరంలోనే తమను మర్చిపోవటమూ వాళ్లను ఆశ్చర్యపరిచాయి.

అప్పుడు తెలిశాయట వాళ్లకు కొన్ని నిజాలు.

బెగ్గింగ్ మాఫియా వాళ్లు రోజూ మాదకద్రవ్యాలు అలవాటు చేస్తారట ఎత్తుకొచ్చిన పిల్లలకు. దాని వల్ల వాళ్ల బుర్ర మొద్దుబారిపోవడమూ, మంద కొడిగా తయారవటంతో పాటు, జ్ఞాపకశక్తి కూడా తగ్గిపోతుంది. వాటికి బానిసలై వాళ్ళేది చెప్తే అది చేయటానికి సిద్ధపడతారు.

సంవత్సరకాలం బిడ్డకు దూరంగా తాము, బెగ్గింగ్ మాఫియా చెరలో పింకీ నరకం కళ్ళ చూశామనీ, ఇక తమకీ మంచి రోజులొచ్చాయనీ ఆమె చెప్పినట్లుగా ఉందా వార్త. ఈ సమస్యకు ఒకటే పరిష్కారమనీ అడుక్కుంటున్న పిల్లలను చూసి జాలిపడి డబ్బులు ఇవ్వొద్దనీ, దానివల్ల బెగ్గింగ్ మాఫియా మరింతమంది పిల్లలను ఆ

**రెడ్‌సిగ్నల్ పడడంతో కారు ఆపాడు అక్షయ్. బిలబిలమంటూ పదిమంది పిల్లలు చుట్టూ మూగారు. తలా ఒక పదిరూపాయలిచ్చాడు అక్షయ్. మరుసటిరోజు, ఆ మర్నాడు కూడా అక్షయ్ అలాగే చేసి, వాళ్ల నమ్మకాన్ని చూరగొన్నాడు. మెల్లగా వాళ్లను మాటల్లోపెట్టి, ఆరాతీయడం మొదలెట్టాడు. ఇంతకీ అక్షయ్ అలా ఎందుకు చేస్తున్నాడు? నైరా జాడ కోసమేనా?**

రొచ్చులోకి లాగే అవకాశం ఉందనీ పోలీస్ డిపార్ట్ మెంట్ వాళ్లు చెప్పినట్టుగా కూడా రాశారు.

'సంవత్సరం తర్వాత కూడా క్షేమంగా దొరికిం దట ఆ పాప. నైరా కూడా తనకు క్షేమంగా దొరికే అవకాశాలున్నాయి ఈ లెక్కన' అక్షయ్‌కి ఆ వార్త చాలా పాజిటివ్ సంకేతాలు ఇస్తున్నట్లుగా అనిపిం చింది.

హర్షకు తన పథకం వివరించాడు అక్షయ్.

అప్పుడన్నాడు హర్ష.

"అక్షయ్, నీ ప్లాన్ బాగుంది. దీనివల్ల కొంత మంది పిల్లలు రక్షింపబడతారేమో కానీ నైరా దొరక్క పోవచ్చు. నువ్వే ఆలోచించు. ఇంట్లోకి చొరబడి ఎత్తుకుపోయేంత రిస్క్ తీసుకున్న వాళ్లు అడుక్కు నేందుకు వాడతారంటావా? రిటర్న్ ఆన్ ఇన్వెస్ట్ మెంట్ గురించి ఆలోచించు."

"నువ్వన్నది కరెక్టే! అంతేకాదు. నేను చేస్తున్న దంతా రాండమ్ శాంప్లింగ్. పిల్లల మీద జరిగే నేరాల్లో అక్కడక్కడా ఒక్కొక్కటీ పరిశోధిస్తున్నాను. దీనివల్ల నైరా దొరకకపోవచ్చు. కానీ ఎవరో ఒకళ్లు రక్షించబడుతున్నారు. అదే నైరాకి బ్లెస్సింగ్స్‌గా మారొచ్చు. ఒక నేరాన్ని మనం బయటపెట్టగానే అది వ్యవస్థలో కొద్దిగానైనా ప్రకంపనలు కలిగిస్తోంది. దాంతో మీడియా కొన్నిటినీ, పోలీసులు అటువంటి మరికొన్ని కేసులనీ పరిష్కరిస్తున్నారు, బయటపెడు తున్నారు. వీడితో ఎందుకు? అన్నీ కదిలిస్తున్నాడు అని నైరాని తీసుకెళ్లిన వాళ్ళు, ఆమెను విడిచి పెట్టనూ వచ్చు" నవ్వాడు అక్షయ్.

తలూపాడు హర్ష.

●●●

అప్పుడే రెడ్ సిగ్నల్ పడింది.

కొండాపూర్ జంక్షన్ దగ్గర కార్ ఆపాడు అక్షయ్.

బిలబిలమంటూ ఏడెనిమిది మంది పిల్లలు కార్ను చుట్టుముట్టారు.

పసిపిల్లాణ్ణి ఎత్తుకున్న ఒక అమ్మాయి కూడా అడుక్కుంటోంది.

తన వద్దకు వచ్చిన ఒక పిల్లవాడికి పది రూపా యలు ఇచ్చాడు అక్షయ్.

అతను మిగతావాళ్లకు చెప్పినట్లున్నాడు. మొత్తం అందరూ అక్షయ్ కార్ చుట్టూ గుమికూడారు. పొట్ట చూపిస్తూ, దీనంగా మొహాలు పెట్టి అడు క్కుంటున్నారు.

వాళ్ళకు ఎలా అడుక్కోవాలో ట్రైనింగ్ ఉంటుం దట... ఎక్కడో చదివాడు అక్షయ్. దీనంగా హావ భావాలు చూపిస్తూ అడుక్కోవటం బెగ్గింగ్



మాఫియా ఇచ్చే కఠినమైన ట్రైనింగ్‌లో భాగం. ఎత్తుకొచ్చిన పిల్లలను కొన్ని నెలలపాటు గాలి, వెలుతురు లేని, ఊపిరాడని ప్రదేశాల్లో ఉంచుతారు. దానివల్ల పిల్లలు భయాందోళనలకు గురయి వాళ్ల కంట్రోల్‌లోకి వస్తారు. సరైన తిండి దొరక్క ఆరోగ్య కరమైన పిల్లలు కూడా వీక్‌గా తయారవుతారు.

అడుక్కోమంటే వినని పిల్లలను చిత్రహింస లకు గురి చేస్తారు.

మరింత జాలిగొల్పటానికీ, తద్వారా ఎక్కువ డబ్బు రాలడానికీ కొంతమంది పిల్లల కాళ్లూ, చేతులూ విరిచేస్తారు. కళ్లు పొడిచేసి అంధులను చేసిన సంఘటనలూ ఉన్నాయి. యాసిడ్ లాంటి వాటిని వాడటం ద్వారా పిల్లలకు వికృత రూపాన్ని కలిగిస్తారు కూడా!

రెండువేల నుంచీ, పదివేల వరకూ డబ్బు తీసుకుని కొంతమంది డాక్టర్లే కాలూ, చేయీ తీసేసే వాళ్లు ఉన్నారు. కండరాలు కలిపి కుట్టేయటం ద్వారా ఆ ప్రాంతంలో రక్తప్రసరణ ఆగిపోయేలా చేస్తారు. దాంతో అవయవాలు చచ్చుపడి పోతాయి.

ఒక్క హైదరాబాద్‌లోనే ఇరవైవేలమంది అడు క్కునే పిల్లలున్నారట! ప్రతి పిల్ల లేదా పిల్లవాడికీ డైలీ టార్గెట్ ఉంటుంది. ఇది దాదాపు రెండు వందల వరకూ ఉంటుంది. టార్గెట్ మీట్ అవని పిల్లలను చావగొట్టటమూ, చిత్రహింసలు పెట్టటమూ చేస్తుం టారు.

ఈ పిల్లలు పెద్దవుతున్నకొద్దీ వాళ్లను వేరే పనులకు వాడుకుంటారు. మగపిల్లలను దొంగ తనాలు, స్మగ్లింగ్, డ్రగ్స్ అమ్మటం వంటి పనులకు ఉపయోగిస్తే, ఆడపిల్లల్ని ప్రాస్టిట్యూషన్ లాంటి వాటిల్లోకి దింపుతారు.

తలా ఒక పది రూపాయలు ఇచ్చాడు అక్షయ్.

మర్నాడు కూడా అదే సంఘటన రిపీట్ అయింది.

మూడో నాటికి వాళ్ల నమ్మకం చూరగొన్నాడు అక్షయ్. ఆరోజు వాళ్లు తన దగ్గరకు రాగానే డబ్బు లేదనీ, డ్రా చేసి ఇస్తాననీ కార్ ఎక్కమన్నాడు. మిగతా పిల్లలు తటపటాయిస్తుండగా వాళ్లల్లో చిన్నవాడు మూడేళ్లవాడు నిక్కర్ పైకి లాక్కుంటూ సంతో షంగా ఎక్కి కూర్చున్నాడు. మరికొందరు కూడా ఎక్కారు. పెద్దపిల్లలు ఇద్దరు పది, పన్నెండేళ్ల వాళ్ళు ఆలోచిస్తుండగా, పసివాడిని ఎత్తుకుని అడుక్కుం టున్న అమ్మాయి వచ్చింది.

"అన్నకు చెప్పాలా?" బెదిరిస్తోందామె.

టక్కున కార్ ఎక్కి కూర్చున్నారు వాళ్లు.

వెళ్ళొద్దని ఆమె వారిస్తుండగానే కార్ ముందుకు కదిలింది.

కార్ నంబర్ నోట్ చేసుకుందామె.

•••

మాదాపూర్‌లో చాక్‌లెట్ రూమ్ ముందు కార్ పార్క్ చేశాడు అక్షయ్.

ఏది కావాలంటే అది తినొచ్చన్నాడు అక్షయ్ వాళ్లతో.

వాళ్లు ఆ పరిసరాలను వింతగా చూస్తున్నారు. వాళ్ళను అక్కడున్న మిగతావాళ్లు మరింత వింతగా చూస్తున్నారు.



## సినిమాల్లోకి సొట్టబుగ్గల సుందరి

సొట్టబుగ్గల సుందరి అంటే టక్కున గుర్తుకు వచ్చేది ప్రీతిజింతానే! పెళ్లి చేసుకున్న తరువాత సినిమాలకి దూరంగా ఉన్న ప్రీతి తిరిగి సినీ కెరీ ర్‌ను కంటిన్యూ చేయనుంది. భర్త సలహా మేరకు ఇక నుంచి వరుసగా సినిమాలు చేయాలని చూస్తోందట! పనిలో పనిగా దక్షిణాది మీద కూడా కన్నేసింది. కాకపోతే బాలీవుడ్‌లో ముదురు భామలకు హీరోయిన్‌గా ఛాన్స్ ఇస్తారు కానీ, దక్షిణాదిన ఆ సంప్ర దాయం లేదు కనుక ఏదైనా ముఖ్యమైన పాత్ర దొరి కితే చేసేందుకు రెడీగా ఉందట! ప్రీతిలాంటి హీరోయిన్లకు దక్షిణాదిన అక్క, వదిన పాత్రలు తప్ప ముఖ్యమైన పాత్రలు ఉండవన్న సంగతి తెలియ దేమో అని సినీ జనాలు సెటైర్లు వేస్తున్నారు.

లోపలకు వెళ్ళేసరికి అక్కడ శ్రీకాంత్‌తో పాటు, హర్ష, మరికొందరు కొలీగ్స్ ఉన్నారు. అంతా రోజూ జిమ్‌కి వెళ్ళి ఫిట్‌గా ఉండటంతో పాటు మారథాన్ రన్నర్స్! క్రమశిక్షణతో కూడిన జీవితాన్ని గడుపు తుండటంతో ఆరోగ్యంగా, ఉక్కుకడ్డీల్లా ఉన్నారు. వాళ్లంతా కంపెనీకి చెందిన అడ్వెంచర్ క్లబ్ మెంబర్స్.

ఎం.ఎన్.సిలలో తమ తమ అభిరుచులను బట్టి క్లబ్స్, గ్రూప్స్ ఏర్పాటు చేసుకుంటుంటారు. ఒకరితో ఒకరు ఆ అభిరుచికి సంబంధించిన సమాచారం పంచుకోవటమూ, కలిసి పాల్గొన టమూ, గ్రూప్ డిస్కౌంట్స్ పొందటమూ లాంటివి చేస్తుంటారు.

అడ్వెంచర్ క్లబ్ మెంబర్స్ తమకు సహాయ పడగలరని భావించారు అక్షయ్, హర్ష. వాళ్లూ వీళ్ళ నమ్మకాన్ని వమ్ము చేయకుండా ముందుకొచ్చారు.

మెనూపై బొమ్మలు చూసి ఏది కావాలో చెప్ప న్నారు పిల్లలు.

వాళ్లలో కొంతమందికి ఇంగ్లీష్ చదవరావ టమూ, మెనూ చూడకుండానే ఏది కావాలో చెప్ప టమూ ఆశ్చర్యాన్ని కలిగించింది. ఏ ఇంటి పిల్లలో... వీళ్ళ పాలిట పడ్డారనిపించింది.

మెల్లగా మాటల్లోకి దింపారు.

తమతోపాటు మరొక ఎనభైమంది ఉంటారనీ, అంతా కలిసి కొండయ్యనగర్‌లో ఒక పెద్ద రూమ్‌లో ఉంటామనీ చెప్పారు వాళ్లు.

ఇద్దరు అన్నలు కూడా తమతో ఉంటారనీ, తప్పు చేస్తే అస్సలు ఊరుకోరనీ చెప్పారు. వాళ్లల్లో పెద్దగా ఉన్న పిల్లల్లో ఒకడు... వాడి మొహంలో నీలినీడలు.

అన్నలు గుర్తుకురాగానే వాళ్లకు తింటున్నది మింగుడు పడలేదు.

భయంగా చూస్తూ వెళ్లిపోదామన్నాడు అంద ర్లోకీ చిన్నవాడు.

"మీకేమీ భయం లేదు. మిమ్మల్ని మేము విడి పిస్తాము" చెప్పాడు అక్షయ్.

"మళ్లీ తీసుకెళ్లిపోతారు" చెప్పాడొకడు.

"అంతేకాదు, చావకొడతారు. మీతో వచ్చినందుకు మాకివాళ చావుదెబ్బలు తప్పవు" వణికిపోతూ అన్నాడొకడు.

అతికష్టం మీద అందరూ కలిసి వాళ్లకు నమ్మకం కల్గించారు.

ఒక్కొక్క విషయమూ బయటకు రాసాగాయి.

పిల్లలు చెప్పేది వింటూ నిర్ఘాంతపోసాగారు వాళ్లు.

పసిపిల్లవాడిని ఎత్తుకుని తిరిగే అమ్మాయి ఆ పిల్లవాడి తల్లి కాదట.

ఆ పిల్లవాడి తల్లిదండ్రులు ఇద్దరూ ఉద్యోగస్థు లట.

పిల్లాణ్ణి చూసుకోవటానికి ఒకమ్మాయిని ఇంట్లో ఉంచి, వాళ్ళు ఉద్యోగాలకు వెళ్లిపోతారు.

ఈ అమ్మాయి ఇంట్లో ఆయాగా పనిచేసే అమ్మాయికి కొంత డబ్బు రెంట్‌గా ఇచ్చి, పిల్లాణ్ణి తెచ్చుకుంటుంది. వాడు ఏడవకుండా స్తబ్ధుగా ఉండటానికి రోజూ కొంత నల్లమందు పెడతారు.

"వాళ్ల అమ్మ, నాన్న మీలాగే రోజూ ఆఫీస్‌కి కార్‌లో వెళ్తారు" చెప్పాడొకడు.

"అచ్చు మీ కారు మీద ఉన్న స్టిక్కర్ లాంటిదే వాళ్ల కారు మీద కూడా ఉంటుంది" అందించాడు ఇంకొకడు.

మొహాలు చూసుకున్నారు అక్షయ్, కొలీగ్స్.

"అంటే ఎవరో తమ కంపెనీవాళ్ల పిల్లవాడే! వాళ్లు ఆయాని నమ్మి పిల్లవాడిని సంరక్షించే బాధ్యత అప్పజెప్తే వాళ్లకి తెలీకుండా బెగ్గింగ్ మాఫియాకి అప్పచెప్పి డబ్బు సంపాదిస్తోందామె".

వాళ్లలో కొంతమందికి తమ ఇళ్లెక్కడున్నాయో తెలుసు. అయితే పారిపోయినా మళ్లీ తీసుకొచ్చే స్తారనీ, తమ ఇంట్లోవాళ్లకు కూడా హాని చేస్తారనే

భయం వాళ్లలో అణువణువునా ఉంది.

పిల్లలు చెప్తున్నదంతా రికార్డ్ చేస్తున్నారు.

ఇంతలో కలకలం మొదలైంది.

ఆ పిల్లలు అన్నలుగా చెప్తున్నవాళ్లు లోపలికి చొర బడ్డారు.

అక్షయ్ వాళ్లు వాళ్లతో కలబడ్డారు.

ఆరోగ్యవంతమైన అలవాట్లు కలిగి, న్యాయం తమ వైపే ఉందన్న విశ్వాసంతో, చిన్నపిల్లల్ని ట్రామా నుంచి కాపాడుతున్నామనే ఎమోషనల్ స్ట్రెంగ్త్ లోనూ, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ కూడా తమతో ఉన్నాడనే ధైర్యంతో పది నిమిషాల్లోనే వీళ్లది పైచేయి అయింది. శ్రీకాంత్ నుండి అప్పటికే సూచనలు అందుకున్న పోలీసులు అక్కడికి చేరుకున్నారు. వాళ్లను అరెస్ట్ చేసి తీసుకెళ్లారు.

పిల్లలు చెప్తున్న గుర్తులను ఫాలో అవుతూ వెళ్లగా, వాళ్లకు పిల్లల్ని ఉంచిన రూమ్ కనబడింది. అప్పుడే రకరకాల ఏరియాలకు ముష్టి ఎత్తటానికి వెళ్లినవాళ్లు రూమ్‌కి తిరిగొస్తున్నారు.

లోపల రూమ్‌లో ఒక మూల గొంతు కట్‌చేసి, గాయాలతో ఉన్న పిల్లవాడు కనబడ్డాడు. అడుక్కోనని మొండికేయటంతో అంతకు ముందురోజే బాగా కొట్టి, చాకుతో గొంతుమీదా, చేతిమీదా కట్ చేశారట.

అంత హింస ఆ పిల్లల కళ్లముందే జరుగు తుండటం... వాళ్ల భయానికీ, లొంగుబాటుకీ కారణ మని అర్థమైంది.

అందరికీ విముక్తి కలిగించారు పోలీసులు.

పిల్లల్ని రెస్క్యూ హోమ్‌కి తరలించి, అక్కడి నుంచి వాళ్ల తల్లిదండ్రుల వద్దకు పంపే ఏర్పాట్లు చేయసాగారు.

నైరా వాళ్లలో లేదు. ఉంటుందని పెద్దగా ఆశించ లేదు కాబట్టి అక్షయ్ నిరాశ చెందలేదు.

గొంతు కోయబడిన పిల్లవాడు అపస్మారక స్థితిలోకి వెళ్లటంతో అతడిని హాస్పిటల్‌లో చేర్పిం చారు. ఆ రాత్రే అతను చనిపోవటం విషాదాన్ని కలి గించింది.

మీడియాలో ఈ వార్తను పదే పదే ప్రసారం చేశారు.

పోలీసులు అరెస్ట్ చేసిన వారినుండి మరింత సమాచారాన్ని రాబట్టి వాళ్లకు అనుబంధంగా నడుపు తున్న మరికొన్ని ముఠాలను పట్టుకుని ఇంకొంత మంది పిల్లలకు విముక్తి కలిగించారు.

నైరా వాళ్లల్లోనూ లేదు.

●●●

"ఇంతమంది పిల్లలను రక్షిస్తుండటం, రక రకాల నేరాలకు చెక్ పెడుతుండటం మీకెలా అని పిస్తోంది? అడిగాడు శ్రీకాంత్.

"నాలో ఏ ఫీలింగ్స్ లేవు శ్రీకాంత్! నైరా దొరికే వరకూ డిప్రెషన్ తప్ప నాలో మరే భావనా ఉండదు. నేనేదో ఆ పిల్లలను రక్షించాలనీ, మహాత్ముడిని అయిపోవాలనీ ఇదంతా చేయట్లేదు. నైరా కోసమే నా అన్వేషణ" స్థిరంగా చెప్పాడు అక్షయ్.

"పోలీస్ డిపార్ట్‌మెంట్ నీకు త్వరలోనే జాబ్ ఆఫర్ చేస్తుందనుకుంటా!" నవ్వుతూ అన్నాడు శ్రీకాంత్.

కలిసి చేస్తున్న ప్రయాణంలో వాళ్ల మధ్య స్నేహం నెలకొంది.

నైరా గురించి సోషల్‌మీడియా ద్వారా, మీడియా కిచ్చిన సమాచారం ద్వారా, సీసీ పుటేజ్ ఆధా రంగా పోలీసులు చేసిన పరిశోధన ద్వారా లభిం చిన వివరాలతో ఒక్కొక్కటిగా పరిశోధిస్తున్నారు.




బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌లో కనబడినట్టు ఫేస్‌బుక్ ద్వారా వచ్చిన సమాచారాన్ని పరిశీలిస్తున్నాడు.

మెసేజ్ పెట్టినతను చెప్పినదాని ప్రకారం ఆ రోజు ఏ టైమ్‌కి ట్రైన్ గమ్యం చేరిందో, దార్లో ఎక్క డెక్కడ ఆగిందో వివరాలు సేకరించారు. ఆగిన ప్రతిచోటా ఉన్న సీసీ పుటేజ్ చూశారు.

ఎక్కడా అతను చెప్పినట్టు అయిదారేళ్ల పిల్ల ఉన్న ఆధారాలు దొరకలేదు.

మెసేజ్ వచ్చిన ఐపీ అడ్రస్ ఆధారంగా మెసేజ్ పంపినవాడి ఆచూకీ కనుక్కున్నారు.

అతనుండేది సీమ వాళ్ళ ఇంటికి రెండిళ్ళ అవ తలే! ఇంజనీరింగ్ ఫస్ట్ ఇయర్ చదువుతున్నాడట.

అతనారోజు బెంగుళూరు ఎక్స్‌ప్రెస్ ఎక్కటం కాదు కదా, కనీసం ఇంటి గుమ్మం కూడా దాట లేదని రుజువైంది.

సీమతో మాటలు పెంచడానికీ, ఆమెను ఇంప్రెస్ చేయడానికీ ఆ మెసేజ్ పెట్టానన్నాడతను.

గట్టిగా వార్నింగ్ ఇచ్చి వదిలేశారు.

బస్‌లో కనబడిందని చెప్తున్న సమాచారంపై దృష్టి కేంద్రీకరించారు.

●●●

"ఏమ్మా... పూజలూ పునస్కారాలూ చేసి కొబ్బరి కాయలూ అవీ కొట్టట్లేదు దేవుళ్ళకీ?" కావ్యను అడి గాడు బ్రహ్మి.

"చేస్తున్నాను కానీ, ఇదివరకు నా డెస్క్ దగ్గర ఎప్పుడూ పువ్వులుండేవి. ఇప్పుడు ఉండట్లేదు" విచారంగా చెప్పింది కావ్య.

"ఏంటో నీ పనే కాదు, నీ మాటలు కూడా అర్థమై చావవు" వెళ్ళబోయాడు బ్రహ్మి.

అతడిని ఆపుతూ రోహిణి కల్పించుకుంది.

"ఇందులో అర్థమవడానికేముంది సర్! ఇదివరకు ఎవరో ఆమె క్యూబ్‌లో పువ్వులుంచేవారు. అదామె దేవుడికి పెట్టేది. ఇప్పుడెవరూ పూలు ఉంచట్లేదు. అంతే!" అంది రోహిణి.

"అక్షయ్ తప్ప మిగతా అందరూ వస్తున్నారుగా ఆఫీస్‌కి. ఈ మధ్య ఎవరూ రిజైన్‌కూడా చేయలేదు. కానీ కావ్యా, ఆ మధ్య నెలక్రితం తలకు నూనె పెట్టుకుని వచ్చావు ఆఫీస్‌కి. చాలా వరస్ట్‌గా కనబ డ్డావు. అందుకే పూవులుంచడం మానేసి ఉంటాడె వరో!" ఆలోచిస్తున్నట్టు పెద్దగా పైకే అనేశాడు.

గుడ్లురిమి చూసింది కావ్య.

అసలే పెద్ద కళ్ళేమో బ్రహ్మికి కొంచెం భయ మేసింది. గబగబా వెళ్లిపోవడానికి చూశాడు.

"సార్ నేనో కథ చెప్పనా" అంది రోహిణి.

"చెప్పమన్నాడు బ్రహ్మి."

రోహిణి చెప్పటం మొదలెట్టింది.

"ఒకతను తన కొడుక్కి ఒక మంకీని కొనడానికి పెట్ షాప్‌కి వెళ్లాడు.

అక్కడొక మంకీ ఆరోగ్యంగా, యంగ్‌గా కనబడు తోంది. దాని ఖరీదు లక్ష రూపాయలని కనబడింది. షాప్ వాడిని అడుగుతాడతను 'ఇంత ఖరీదేమిటని?'

అతనంటాడు, "దీనికి కంప్యూటర్ ఆపరేట్ చేయడమొచ్చు. ఎమ్మెస్ ఆఫీస్‌లో డాక్యుమెంట్లు తయారుచేయగలదు. దీనికి కొద్దిగా కోడింగ్ కూడా తెలుసు".

ఇంకాస్త దూరంలో మరో పెట్ మంకీ కనబడింది.

"దాని రేట్ రెండు లక్షలుందేమిటి?" షాప్ అతన్ని మళ్లీ అడిగాడు.

"దీనికి డాట్‌నెట్, క్లౌడ్ కంప్యూటింగ్ తెలుసు" చెప్పాడతను.

అతని దృష్టి అక్కడే ఉన్న మరో కోతిమీద పడింది.

అది డల్‌గా, దిగాలుగా కూర్చుని ఉంది. కొద్దిగా కుంగిపోయినట్లుగా కూడా ఉంది.

"అదేమిటలా ఉంది? దాని రేట్ మూడు లక్షలా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"దానికేమి వచ్చు?"

"ఏమోతెలీదు. మిగతా రెండూ దాన్ని ప్రాజెక్ట్ మేనేజర్ అని పిలుస్తాయి" చెప్పాడు షాపతను.

రోహిణి ముగించగానే, కావ్య గొల్లుమని నవ్వటం మొదలెట్టింది.

స్వయంగా ప్రాజెక్ట్ మేనేజర్ అయిన బ్రహ్మికి రోషం ముంచుకు వచ్చింది.

"అసలిప్పుడు జరిగిన డిస్కషన్‌కీ, ఈ జోక్‌కీ ఏమైనా సంబంధం ఉందా? సర్దార్జీల మీద జోకుల్లా ఎప్పుడూ ప్రాజెక్ట్ మేనేజర్ల మీద జోకులు చెప్తుం టావు" గొణుక్కుంటూ వెళ్లిపోయాడు.

అతనక్కడి నుంచి వెళ్లగానే ఫ్లోర్ మొత్తం ఘొల్లున నవ్వటం మొదలెట్టారు.

**(ఇంకావుంది)**

## సరదాగా....

### తలపోటు

అమ్మో..అయ్యో... తల పగిలిపోతోంది అంటూ ఆదరాబాదరాగా హాస్పిటల్‌లోకి అడుగుపెట్టింది మానస. కాంపౌండర్ దగ్గరకెళ్లి, "కాంపౌండర్‌గారూ, నిన్నటినుంచి తలంతా దిమ్ముగా ఉంది. తలపోటుగా ఉంది. డాక్టరుగారిని వెంటనే కలవాలి." మూలుగుతూ అడిగింది.

"మీరు కూర్చోండి. డాక్టరుగారు లోపలున్నారు, వస్తారు" అన్నాడు కాంపౌండర్.

'త్వరగా పిలవండి ప్లీజ్' అంటూ అక్కడే కుర్చీలో కూలబడింది.

టైం గడుస్తోంది కానీ పిలుపు రావట్లేదు.

ఇక ఆగలేక మానస కాంపౌండర్ దగ్గరికి వెళ్లి, "డాక్టరుగారు ఎంతసేపటికి వస్తారు?" అంటూ నిలదీసింది.

'వస్తారుండమ్మా. అసలే డాక్టరుగారికి రాత్రినుంచి తలపోటుగా ఉంటే వాళ్ళమ్మ చేత దిష్టి తీయించుకుంటున్నారు' చెప్పాడు కాంపౌండర్.

### ఒక ప్రశ్న?

శివాపురం పక్కా పల్లెటూరూ కాదు, పట్టణమూ కాదు. ఒక మోస్తరు గ్రామం. ఆ ఊరికి ఒక పక్క చెరువు, ఇంకోపక్క శివాలయం ఉన్నాయి. ఆ ఊళ్ళోనే ఉన్నత పాఠశాల ఉండటంవల్ల చదువుకోడానికి చుట్టుపక్కల గ్రామాల పిల్లలందరిదీ అ ఊరి బాటే! పక్క ఊర్లోనే ఉండే రాజు, దినకర్, సూర్య, రమేష్ నలుగురూ కలిసే స్కూలుకి వస్తారు సైకిళ్ళపై! పక్క ఊరే కావటం వల్ల ఆడుతూ పాడుతూ తిరుగుతుంటారు. ఒకరోజు స్కూలు నుంచి ఇంటికి వెళుతూ, కాసేపు చెరువుగట్టున కాలక్షేపం చేద్దామని ఆగారు. కబుర్లూ కాకరకాయలూ అయిన తరువాత రాజు సరదాగా ఓ పందెం వేసుకుందామా? అనడిగాడు. సరేనన్నారు ముగ్గురూ. అప్పుడు రాజు "తలా ఒక అయిదు గులకరాళ్ళు తీసుకుందాం. ఒకరి తరువాత ఒకరం గులకరాళ్ళను నీళ్ళలోకి విసురుదాం. అయితే విసిరిన రాయి నీళ్లలో పడి మునిగిపోకూడదు. చెరువు మధ్యలో ఉన్న, పైకి తేలిన ప్రాంతంపై పడాలి. ఎవరు ఎక్కువ రాళ్ళను నీటిలో కాకుండా పైకి తేలిన ప్రాంతంపై పడేట్టుగా విసిరేస్తారో వాళ్ళే గెలిచినట్టు" అని పందెం చెప్పాడు రాజు. ఒకరి తరువాత ఒకరు రాళ్లు వేశారు. అయితే దినకర్ వేసిన ఐదురాళ్ళూ మునిగిపోయాయి. సూర్య వేసిన ఐదు రాళ్ళలో మూడు మునిగిపోయాయి, రెండు గట్టిగా ఉన్న ప్రాంతంపై పడ్డాయి. రాజు వేసిన మూడు రాళ్ళు పైకి తేలిన ప్రాంతంపై పడ్డాయి, ఇంకొకటి మునిగిపోయింది. రమేష్ విసిరిన ఐదు రాళ్ళూ గట్టి ప్రాంతంపై పడ్డాయి. అంటే రమేష్ పందెం గెలిచాడన్న మాట. అయితే ఇక్కడ విషయం ఏంటంటే రమేష్ గెలిచాడు సరే కానీ అతడికి పెద్దగాయమై రక్తం కారసాగింది. ఎవరో గులకరాయితో అతన్ని కొట్టారు. అక్కడ ఉన్నది నలుగురు. వారిలో ఎవరు రమేష్‌ని కొట్టారు? ఇదీ ప్రశ్న? కనుక్కోండి.

**సమాధానం**

రాజు. ఎందుకంటే రాజు తన దగ్గరున్న ఐదు గులకరాళ్ళలో నాలుగింటిని మాత్రమే విసిరాడు. ఐదోది అతడిదగ్గరే ఉంది. కాబట్టి గెలిచాడన్న అక్కసుతో రమేష్‌ని గాయపరిచింది రాజే!

## తీన్ మార్




నా కళ్ళు బాగానే వున్నాయి డాక్టర్!! ఆ చెట్టుకే ఎదురుగా వస్తున్న నా స్కూటరు కనబడలేదు.. పాపం!!

డా॥ ఆనందం MBBS




ఈ ఏడాది త్రాగకూడదని డైరీలో రాసుకుని ప్రతిరోజు చదువుతున్నా... ఈరోజు డైరీ మర్చిపోయి వెళ్ళా!! కాంతం!!

కళ్ళుదానం చేస్తానన్నారట కదా!? యింకా బ్రతికే వున్నారా అని అడుగుతున్నారు!!



# ఎనిమిదో అడుగు

## -ఎం. వెంకటేశ్వరరావు

**అతనికీ, ఆమెకీ అది తొలిరేయి. పాలగ్లాసుతో గదిలోకి వచ్చి తలుపులేసి, తల వంచుకుని నిలబడిందామె. ఐదు నిమిషాలు గడిచాయి. నిశ్శబ్దంగానే కూర్చున్నాడతను. ఆమె కళ్ళెత్తి చూసింది. ఆపాదమస్తకం పైనుండి కిందకి తనని కళ్ళతో తడుముతున్న అతన్ని చూసేసరికి ఒళ్ళంతా గిలిగింతలు పెడుతున్నట్టనిపించింది. లిప్తకాలం ఆమె మోములో చిరునవ్వు మెరిసింది.**

ఆమె తననే చూస్తోందని గమనించిన అతని మొహంలో ఎలాంటి స్పందనా కనిపించలేదామెకి. ఆమె చిరునవ్వు క్షణభంగురమైంది. ఆమె మళ్ళీ తలొంచుకుంది. అతను లేచి నిలబడి ఆమెవైపు వస్తున్నాడు. దగ్గరగా వచ్చేశాడు. ఇప్పుడు ఇద్దరిమధ్య దూరం రెండడుగులే. ఏడడుగులు కలిసి నడిచేటప్పుడు కలగని భయం ఇప్పుడీ రెండడుగుల దూరంలో కలిగింది. భారంగా ఉందామెకి. ఒళ్ళంతా ముచ్చెమటలు పడుతున్నాయి. చెయ్యిజాపి ఆమె చేయి తన చేతుల్లోకి తీసుకున్నాడతను. ఆమె తనువులో ఎన్నడూలేని ప్రకంపనలు మొదలయ్యాయి. మౌనంగా ఆమెని మంచం వరకూ నడిపించుకెళ్ళి కూచోబెట్టాడు. పాలగ్లాసు పక్కనబెట్టి మంచం చివరికి జరిగిందామె. మళ్ళీ ఇద్దరి మధ్యామౌనం. దిండుకిందున్న డైరీతీసి ఆమెకివ్వబోయాడు. 'ఏమిటి?' అన్నట్టు చూసిందామె.

"మన దాంపత్య ప్రయాణానికి ముందు దీన్ని నువ్వు చదవాలి".

"మీ డైరీ నేను చదవడం..." చిలకపలుకుల్లాంటి ఆమె మాటలు సభ్యత కాదన్నట్టు ధ్వనించాయి.

"సీక్రెట్స్ ఏమీలేవు.. నీ కోసం రాసిందే ఈ డైరీ! చదువు" అన్నాడు.

డైరీ తీసుకుని, పాలగ్లాసు అతనికి అందించింది.

కొంచెంతాగి, గ్లాసు పక్కనబెడుతుంటే, గ్లాసు అందుకుని తనూ కొంచెంతాగి పక్కనపెట్టింది.

"ఇన్నేళ్ళూ నేను..." ఉపోద్ఘాతంలా చెప్పబోతుంటే.. "చెప్పొద్దు... చదువుతాను" అని డైరీ తెరచిందామె. ముత్యాల్లాంటి అక్షరాలవెంట ఆమె కళ్ళు కదలసాగాయి.

●●●

ప్రతిరోజూలాగే, ఇంటికి ఆలస్యంగా వచ్చాడు భాస్కర్రావు. గుమ్మంలో నిలబడిన భార్య కమల అతన్ని చూసి "హు!" అని నిట్టూర్చింది. బ్లాక్ అండ్ వైట్ టీవీ ముందు కూర్చున్న కొడుకు ప్రవీణ్‌తో, "ఇంకా చిత్రలహరి మొదలుకాలేదా!" అన్నాడు భాస్కర్రావు.

"రాబోతోంది డాడీ! డ్రెస్ మార్చుకుని రండి!" అన్నాడు.

"రేయ్, టీవీ ఆఫ్‌చేసి నీ గదిలోకెళ్ళి చదువుకో" కొడుకుని కసిరింది కమల.

"ఇప్పటిదాకా చదువుకున్నానుకదమ్మా! పాటలొచ్చేది వారానికోసారి. పాటలయ్యాక చదువుకుంటా!"

"పరీక్షలు దగ్గర పడుతుంటే నీకు పాటలు కావాల్సొచ్చాయా పాటలు, లేరా! లేచెళ్ళు" అంటూ లోపలినుంచి వచ్చి, టీవీ ఆఫ్ చేసింది తల్లి.

"పో అమ్మా! నేను పాటలు చూశాకే చదువుకుంటా!" అంటూ టీవీ ఆన్ చెయ్యబోతున్న కొడుకు వైపు గుడ్లురిమిచూసింది. "ఎదురు చెప్పావంటే చేతికి పని చెప్పాల్సొస్తుంది. వెళ్ళి చదువుకో పో!" కోపంగా అరిచింది కమల.

"ఏంటి కమలా! వాడేమైనా చిన్న పిల్లాడా? పదోతరగతి చదువుతున్నవాడితో ఇలాగేనా మాట్లాడేది?" అని భాస్కర్రావు అనేసరికి, "ఇల్లు, బాధ్యతలు వదిలేసి తమరు రోజూ ఇలాగేనా ఇంటికి ఆలస్యంగా వేంచేసేది?!" అని ప్రశ్నించింది.

"ఇవ్వాళ మా కొలీగ్ రవీంద్ర..."

"..కొడుకు బర్త్‌డే అంటారు. నిన్నేమో పాత మేనేజరు డెత్‌డే, రేపు మరొకళ్ళ మేరేజ్ డే, ఇవి రోజూచెప్పే కథలేగా!" అంది భర్తమాట పూర్తికాకుండానే.

"పూర్తిగా వినకుండా నోరు పారేసుకోకు. రవీంద్ర కొడుకు బస్ దిగి రోడ్ క్రాస్ చేస్తుంటే, యాక్సిడెంటైంది. రక్తం ఎక్కువగా పోయింది. బ్లడ్ డొనేట్‌చేసి వస్తున్నా" అని చెయ్యి చూపించాడు.

అదిచూసి కమలనోటికి తాళం పడ్డట్టయింది.

"ఛ! ఏం జన్మో! నీ అనుమానం నాకు అవమానంగా ఉంది. నీ మాటలు వింటుంటే నా మాటమీద నాకే నమ్మకం పోతోంది" అని టీవీ ఆన్‌చేసి చిత్రలహరి పెట్టాడు భాస్కర్రావు.

గదిలో పుస్తకాలముందు కూచున్న ప్రవీణ్ చిత్రలహరి పాటలువిని కిటికీతెరచి చూస్తుంటే, కొడుకుని పిలిచి పక్కన కూచోబెట్టుకున్నాడు భాస్కర్రావు.

●●●

ఫ్రెండ్స్‌తో సినిమాకెళ్ళి రాత్రి పది గంటలకి ఇంటికొచ్చాడు ప్రవీణ్. తండ్రిని గుమ్మంలోనే నిలబెట్టి, నిలదీస్తున్న తల్లిని చూసి, మౌనంగా లోపలికి వెళ్ళబోయాడు ప్రవీణ్. "ఎక్కడికెళ్ళావురా!" అడిగింది కమల.

"సినిమాకి"

"ఇంటర్‌చదువుకే చెప్పకుండా సినిమాలకి వెళ్ళటం మొదలెట్టావా? ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున ఎలా మేస్తుంది?"

ప్రవీణ్ బదులివ్వకుండా లోపలికెళ్ళాడు.

కమల భర్తవైపు తిరిగి, "ఏంటి? కళ్ళలా ఎర్రగా నిప్పుకణికల్లా ఉన్నాయి. ఇవ్వాళకూడా..." నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని "మా మేనేజరు చిన్నపార్టీ ఇస్తేనూ..."

"ఫ్రీగా వచ్చిందని పీకల్దాకా తాగొచ్చారు. మిమ్మల్ని చూసి వాడుకూడా సినిమాలూ, షికార్లూ మొదలెట్టాడు. యథా తండ్రీ! తథా కొడుకు" అని గుమ్మంలోనే అరుస్తుంటే, "అమ్మా! నువ్వు ముందు లోపలికి రా! ఆకలేస్తోంది" గట్టిగా పిలిచాడు ప్రవీణ్.

ఆ పిలుపుతో లోపలికొచ్చిన కమల "ఎవరితో సినిమాకెళ్ళావురా!" అని ప్రశ్నించింది.

"ఫ్రెండ్స్‌తో వెళ్ళానమ్మా! దీనిక్కూడా రాద్ధాంతమేనా?" విసుక్కున్నాడు.

"సినిమాకి తగలడు, లేకపోతే మీ నాన్నలా తాగి తందనాలాడు నాకెందుకు.." అంటూ అన్నం పెట్టింది.

హాల్లో కూచుని సిగరెట్ కాలుస్తున్న భర్త దగ్గర



కొచ్చి, "ఎన్నని తగలేస్తారు? పగలంతా కాల్చింది చాల్లేదా.. ఇక తినడానికి వస్తే వడ్డిస్తా!"

"వడ్డిస్తున్నది చాల్లేగానీ, నాకు లేటవుతుంది నువ్వెళ్ళు".

చిర్రెత్తినదాన్లాగా అక్కడే కుర్చీలో కూర్చుని

"మత్తింకా దిగలేదా?" భర్తను అడిగింది కమల.

"నిత్యం ఉండే పెళ్ళికి మేళం దేనికి కమలా? కాసేపు నన్ను ఒంటరిగా వదిలెయ్".

"మందూ, విందూ, ఇహ ముచ్చటగా ఆ మూడో దానిక్కూడా అలవాటుపడితే, పురుషోత్తముడి పట్టం గట్టొచ్చు మీకు".

"నోర్మూస్తావా? లేదా?" భాస్కర్రావు భరించలే నట్టు అరిచాడు.

"ఏం చేస్తారు? కొడతారా?"

అన్నం తింటున్న ప్రవీణ్ వాళ్ళిద్దరి మాటలు వినలేక,

"ఏంటమ్మా! అసహ్యంగా ఈ అరుపులు. నేను చదువుకోవాలి, లోపలికిరండి" అన్నాడు చిరాగ్గా.

"అలవాట్లు అదుపుతప్పితే ఇప్పుడు వీడు, రేపు పక్కింటివాళ్ళు ఛీ! కొడతారు" అని కమల కన్నీళ్ళొత్తుకుంటూ లోపలికెళ్తుంటే, "సాయంత్రం నాకేమైనా ఫోనొచ్చిందా?" అని అడిగాడు.

చటుక్కున వెనక్కి తిరిగి "లేదు" అంది.

"సునందగారు చేస్తానందే...!"

"ఓహో! ఈ బాగోతం కూడా మొదలైందీ!" అంది అసహనంగా.

"అనవసరంగా ఆడిపోసుకోకే, ఆవిడ నాకంటే పదేళ్ళు పెద్దది".

"పెద్దదైతే నాకెందుకు, పతివ్రతైతే నాకెందుకు? కన్న నేరానికి ముందు కొడుకుని ప్రయోజకుణ్ణి చేయండి. ఆ తర్వాత ఎవరే మురికిలో మునిగితే నాకెందుకు" అని ఏడుస్తూ లోపలికెళుతున్న భార్య వైపు నిస్సహాయంగా చూశాడు భాస్కర్రావు.

•••

రాత్రి ఒంటిగంట.

"ఇంజనీరింగ్ చదువుతున్న కొడుకు ఇంట్లో ఉన్నాడన్న ఇంగితం లేకుండా దొంగలా వస్తున్నా రేంటి..." గుమ్మంలోనే భార్యకి దొరికిపోయాడు భాస్కర్రావు.

"అదీ... అదీ..."

**ఆఫీసునుంచి వచ్చిన భర్తను గుమ్మంలోనే నిలదీస్తుంది ఆ ఇల్లాలు. రోజూ ఇదేతంతు. అతనుచెప్పే కారణాలు ఆమె సరిగా అర్థం చేసుకునేదికాదు. అతడికి జీవితం నరక ప్రాయమైంది. ఎదిగిన కొడుకు ఇదంతా గమ నిస్తూనే ఉన్నాడు. అమ్మను సైకియాట్రిస్ట్‌కి చూపిద్దాం అన్నాడు తండ్రితో. అంతలోనే తల్లిలో మార్పు కనిపించింది. కానీ తర్వాత ఆ ఇంట్లో ఏం జరిగింది? అసలు ఆ తండ్రి మంచివాడేనా? లేక తప్పంతా ఇల్లాలిదేనా?**

"ఏది? ఎవత్తెనో వెంటేసుకుని చార్మినార్‌దగ్గర చక్కర్లు కొడుతున్నారట, ఎవత్తది?"

"చార్మినార్ దగ్గర కూడా సి.ఐ.డీల్ని పెట్టావా?"

"సిగ్గులేకపోతే సరి".

"అబ్బా! అర్ధరాత్రి అరవకే బాబూ! ముందు లోపలికి రానియ్".

"అంటే, నిజమేనన్నమాట..."

"అవునే! మా బంధువులమ్మాయే, తోడురమ్మంటే వెళ్ళాను".

"నాకు తెలీని బంధువులమ్మాయెవరో?"

"మా శంకరం మామయ్య మూడోకూతురు గాయత్రి".

"ఏదీ! మొగుణ్ణి వదిలేసిందేనా? ఇంకేం మంచి సంతే. ఎర్రగా, బుర్రగా ఉన్నారు. వల విసిరింది" ఆప కుండా మాట్లాడుతోంది కమల. "ఇంక ఒక్కమాట ఎక్కువ మాట్లాడినా ఇంట్లోంచి వెళ్ళిపోతాను. ఆ పిల్ల నాకంటే పన్నెండేళ్ళు చిన్నదే. నాలిక్కి నరం లేనట్టు మాట్లాడకు. ఏదో ఒకరోజు నీ అనుమా నమే నన్ను ఆత్మహత్య చేసుకునేలా చేస్తుంది చూడు" అన్నాడు గట్టిగా.

వాళ్ళిద్దరి వాగ్యుద్ధానికి నిద్రలేచొచ్చాడు ప్రవీణ్.

"ఏంటమ్మా! ఈ అర్ధరాత్రి బాగోతం. నాల్రో జులు సెలవులకి ఇంటికొస్తే... ఛ! మీరిద్దరూ మారరా? అనవసరంగా ఇంటికొచ్చాను. హాస్టల్లోనే హాయిగా ఉంది" అన్నాడు ఛీత్కారంగా.

కమల ఏడుస్తూ లోపలికెళ్ళింది.

•••

ఆదివారం ఉదయం...

భాస్కర్రావు పేపరు చూస్తున్నాడు.

"నేనివాళ మా పిన్ని వాళ్ళింటికి చైతన్యపురి వెళ్తున్నాను" కాఫీ తెచ్చిచ్చి చెప్పింది కమల.

"మ్యాట్నీ సినిమాకి టిక్కెట్లు బుక్‌చేశాను. ముగ్గురం వెళ్దాం" అన్నాడు.

"అయ్యో! నా బతుక్కి సినిమా ఒక్కటే తక్కువ".

"రేపు ప్రవీణ్ కాలేజ్‌కి వెళ్ళిపోతాడు. హోటల్లో తిని, సినిమాకెళ్దాం" చెప్పాడు భాస్కర్రావు.

ఏ సమాధానం చెప్పకుండా అక్కణ్ణించి కదల బోతుంటే, అంతలో కాలింగ్‌బెల్ మోగింది. వెళ్ళి తలుపుతీసింది కమల. ఎదురుగా అపరిచిత స్త్రీ.

"ఎవరు కావాలండీ!"

"భాస్కర్రావుగారిల్లు?!"

"ఇదే"



"నేను ఆయన కొలీగ్‌ని".

"రండి" అంది కమల ముక్తసరిగా.

అంతలో భాస్కర్రావు లేచొచ్చి... "రండి! పుష్పగారూ...!" అన్నాడు. ఆమె లోపలికొచ్చాక..

"కమలా! ఈమె పుష్పగారు. బెజవాడ నుండి మా బ్రాంచికి బదిలీపైన వచ్చారు. మన పక్కవీధి ప్రసాదుగారింట్లో ఓ పోర్షను అద్దెకుందంటే...." అతని మాట పూర్తికాకుండానే కమల మౌనంగా లోపలికెళ్ళి కాఫీ తెచ్చిచ్చింది.

పది నిమిషాల తర్వాత పుష్ప, భాస్కర్రావు బయటికెళ్ళారు.

గంట తర్వాత భాస్కర్రావు ఇంటికొచ్చేసరికి ప్రవీణ్ టీ.వీ. చూస్తూ కనిపించాడు.

"మీ అమ్మేది?"

"చైతన్యపురి వెళ్ళింది".

"వంట చేసిందా?"

"లేదు"

వెంటనే కమలవాళ్ళ పిన్ని ఇంటి ల్యాండ్ లైనుకి ఫోన్ చేశాడు.

"కమలా! త్వరగా వచ్చెయ్! సినిమా కెళదాం"

వస్తాననీ, రాననీ చెప్పలేదు, "మీ ముగ్గురూ వెళ్ళండి" అంది.

"ముగ్గురెవరు?!"

"వచ్చిందిగా మీ కొలీగ్".

"ఆ మాటకి చిర్రెత్తి భాస్కర్రావు ఫోన్ పెట్టేశాడు.

"ఛ! రాన్రానూ దీనికి అనుమానపు రోగం ఎక్కువైంది. సర్లే నువ్వు తయారవ్వు. మనిద్దరం సినిమాకెళ్దాం" అన్నాడు  కొడుకుతో.

•••

ఇద్దరూ హోటల్లో భోజనంచేసి, థియేటర్ దగ్గరకి చేరుకున్నారు. షో మొదలు కావడానికి ఇంకొంచెం టైమ్ ఉంది. దాంతో తండ్రీకొడుకులిద్దరూ ఓచోట కూచున్నారు.

"నాన్నా! అమ్మని సైకియాట్రిస్ట్‌కి చూపించండి" అన్నాడు ప్రవీణ్.

"మీ అమ్మకంటే నేను ముందు మానసికరోగిలా మారేట్టున్నాను. రాన్రానూ దానిమాటలు వినీ వినీ నేను  కూడా వ్యక్తిత్వం కోల్పోతున్నాను. ఇంటికి రావాలంటేనే నరకంగా ఉంది".

"మరీ ఎక్కువ తాగుతున్నారు నాన్నా! మీ ఆరోగ్యం పాడవుతోంది".

"మీ అమ్మవల్లే ఇలా అవుతున్నాను. గతంలో ఏదో జరిగిందని నన్నిప్పుడు సాధిస్తోంది".

"అవునా? ఏం జరిగింది?'

"ఆరోజుల్లో మీ అమ్మావాళ్ళు మా ఇంటికి ఎదురుగా ఉండేవాళ్ళు. అప్పుడే నేను డిగ్రీ చదువుతున్నాను. మీ అమ్మ ఇంటర్ చదివేది. మీ అమ్మమ్మని ఆ కాలంలో మీ తాతయ్య ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడట. కానీ అప్పటికే ఆయనకి పెళ్ళయింది. పిల్లలుకూడా ఉన్న సంగతి మీ అమ్మమ్మకి చెప్పలేదట. మీ అమ్మపుట్టిన పదేళ్ళకి గానీ విషయం తెలియలేదు. అప్పుడు నిలదీసేసరికి ఇంటికి రావడం మానేశాడట మీ తాతయ్య. ఆయన్ని వెతుక్కుంటూ మీ అమ్మమ్మ వైజాగ్‌వెళ్తే, ఆయన మొదటిభార్య పిల్లలు మీ అమ్మమ్మని తీవ్రంగా అవమానించారట. తర్వాత కోర్టు, కేసు... ఇల్లు గడవని పరిస్థితుల్లో మా అమ్మ, మీ అమ్మమ్మకి ఆసరా చూపించింది. మీ అమ్మ చదువు ఆగకుండా ఆదుకునేది. ఈ లోపు నాకు రైల్వేలో ఉద్యోగం వచ్చింది.

"ఒరేయ్ భాస్కర్! ఎదురింటి కమల ఇంటర్ ఫస్టుక్లాసులో పాసయిందటరా! కమలమీద నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగింది మా అమ్మ.

అందంగా, నాజూగ్గా ఉండే మీ అమ్మని చాటుమాటుగా చూసే నేను ఆలోచించకుండా "బ్యూటీఫుల్" అనేశాను.

ఆ తర్వాత నా ప్రమేయం లేకుండానే కమల నా భార్య అయింది.

"ఇదీ జరిగినకథ. ఇప్పుడు జరుగుతున్నకథ నీకు తెల్సిందే" ముగించాడు భాస్కర్రావు.

•••

సినిమా నుండి ఇంటికొచ్చేసరికి కమల ఇంట్లో ఉంది. తండ్రీ కొడుకుల్ని చూసి కొడుకుతో, "నువ్వూ ఆయనతో కలిసి తిరుగుతున్నావా? ఆయన లక్షణాలన్నీ నేర్చుకో, వృద్ధిలో కొస్తావు" అంది.

"ఏంటమ్మా! నోటికి ఏదొస్తే అదే మాట్లాడతావా? నువ్వు అసలు మారవా? మీనాన్న మీ అమ్మని మోసం చేశాడని, అందరూ అలానే ఉంటారా? నాన్నని అనుక్షణం అనుమానిస్తూ నిప్పంటుకున్న కట్టెలా నువ్వు కాలిపోతూ మమ్మల్ని బూడిద చెయ్యకు" అని విసురుగా గదిలోకి వెళ్ళాడు.

కమల విభ్రాంతి చెందింది. చాలాసేపు మౌనంగా ఒంటరిగా కూచుండిపోయింది. ఆ రోజురాత్రి కొడుకు దగ్గరకెళ్ళి, "మీనాన్న మంచివాడే, కానీ ఆయన ఫ్రెండ్స్, చుట్టూ వాతావరణం మంచిది కాదు. చూస్తున్నావుగా తాగుడు, సిగరెట్లు... అందుకే ఆయనతో కఠినంగా ఉంటున్నా! నాగతం మళ్ళీ నా జీవితంలో, నీ జీవితంలో రిపీట్ కాకూడదన్న అభద్రత, నా మనస్సుని తప్పొప్పులు ఆలోచించనీయటం లేదు" అంది ఏడుస్తూ.

"ఎందుకైనా మంచిది, సైకియాట్రిస్ట్ దగ్గర కౌన్సెలింగ్ తీసుకుంటే బావుంటుందమ్మా" అన్నాడు ప్రవీణ్.

కొడుకువైపు అవాక్కైనట్టుచూసి అక్కడినుంచి లేచెళ్ళిపోయింది కమల. ఆ రాత్రంతా ఆలోచిస్తూనే ఉంది. తనవల్లే భర్త వ్యసనాలకి దగ్గరవుతున్నాడు, కొడుక్కికూడా అలాంటిస్థితి రాకూడదు. అలా రాకుండా ఉండాలంటే, ముందు తనే మారాలని నిర్ణయించుకుంది కమల.

•••

మరుసటిరోజు ఆఫీసుకెళ్తున్న భర్తతో "సాయంత్రం త్వరగా రండి! ప్రవీణ్ మనం కలిసి బయటికెళ్దాం" అంది నవ్వుతూ.

చాలాకాలం తర్వాత భార్య భిన్నంగా కనిపించేసరికి ఉబ్బితబ్బిబ్బయ్యాడు భాస్కర్రావు. సాయంత్రం ఐదు గంటలకే ఇంటికొచ్చాడు.

ఆరోజు షాపింగ్‌కెళ్ళి భర్తకీ, కొడుక్కీ బట్టలు కొని, హోటల్లో తిని ఇంటికొచ్చారు. చాలా నెలల తర్వాత భాస్కర్రావుని పడగ్గదిలో స్వర్గపుటంచుల్లో ఓలలాడించింది కమల.

•••

పది రోజుల తర్వాత అర్ధరాత్రి,

భాస్కర్రావు, కమల బెడ్రూమ్‌లో అలసిపోయి నిద్రపోతున్నారు. ఫోన్ రింగవుతుంటే బద్ధకంగా ఫోన్ అందుకుని "హలో!" అన్నాడు భాస్కర్రావు నిద్ర మత్తులో.

"నేను పుష్పని"

అంతే! భాస్కర్రావు నిద్రమత్తు వదిలి పోయింది. ధన్‌మంటూ లేచికూర్చున్నాడు. పక్కనే పడుకున్న కమల వైపు చూశాడు. గాఢనిద్రలో వుంది.

"ఏంటి పుష్పా! ఈ వేళప్పుడు?" గొంతు తగ్గించి అడిగాడు.

"బాబుకి ఒళ్ళు కాలిపోతోంది. మూడ్రోజుల నుంచి జ్వరం తగ్గటంలేదు. రెండు రోజుల నుంచీ మీరు వస్తారని ఎదురుచూశాను. ఆఫీసుకి ఫోన్ చేస్తే లేరని చెప్పారు".

"ఉష్! నెమ్మదిగా మాట్లాడు. కమల వింటుంది. నేను రేపు వస్తాను. ఇంట్లోవున్న మందులు వాడు. ఈ మధ్యే కమల నామీద ఏ అనుమానం లేకుండా ఉంటోంది. మన విషయం గుట్టుగా ఉండాలంటే, ఈ సమయంలో కమలకి అనుమానం రాకూడదు. బాబుకి జ్వరం తగ్గిపోతుందిలే, కంగారుపడకు" అని ఫోన్ పెట్టి పక్కకి తిరిగాడు.

మంచంమధ్యలో రుద్రకాళిలా కూచున్న కమలని చూసేసరికి ముచ్చెమటలు పట్టాయి.

"కమలా!.... అదీ... అ...ది" అంటున్న భర్త మాటలు వినిపించుకోకుండా ఒక్క ఉదుటునలేచి

## కాథరిన్‌కు పొగరెక్కువట!



**కాథరిన్** థ్రెసాకి పొగరెక్కువ అంటారు సినీజనాలు. ఈ కారణంగానే అవకాశాలు వచ్చినట్టే వచ్చి చేజారిపోతున్నాయనీ, సెట్‌లో ఆటిట్యూడ్ చూపిస్తుందనీ, పొగరుగా ప్రవర్తిస్తుందని అంటున్నారు. తానేదో ప్రత్యేకమైన వ్యక్తిగా బిహేవ్ చేస్తుందనీ, అలాంటి ట్రీట్‌మెంటే కావాలని పట్టుపడుతుందన్న అపవాదు కూడా ఆమె మీద ఉంది. ఇవన్నీ భరించలేకనే కాథరిన్‌కు సినిమాల్లో అవకాశాలు ఇవ్వడం లేదని చాలా మంది అంటూంటారు. తన పద్ధతి మార్చుకోకపోతే కెరీర్ నాశనమయ్యే ప్రమాదం ఉందని ఆమె సన్నిహితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

వంటింట్లో కెళ్ళి గడియపెట్టుకుంది. కిరోసిన్ పోసుకుని, భాస్కర్రావు కళ్ళముందే కాలి బూడిదైపోయింది.

"తనమీద అనుమానంతోనే తల్లి ఆత్మహత్య చేసుకుందని ఇంటికొచ్చిన కొడుకును నమ్మించే ప్రయత్నం చేశాడు భాస్కర్రావు.

ఆ క్షణంనుండీ ఇంట్లోకి అడుగుపెట్టేందుకు భయపడ్డాడు ప్రవీణ్. తల్లి ఆత్మహత్య అతని మనసు మీద మానని గాయమై కూర్చుంది.

ఇంజనీరింగ్ పరీక్షలురాసి ఇంటికొచ్చాడు ప్రవీణ్.

తల్లిస్థానంలో పుష్పని రెండోపెళ్ళి చేసుకున్నాడు తండ్రి. ఆమె కొడుకుని తనకి తమ్ముడిగా పరిచయంచేసి ప్రవీణ్ చేతికి ఎత్తుకోమని ఇవ్వబోయాడు తండ్రి. మొహం మీద కాండ్రించి ఉమ్మేసి ఇల్లొదిలి బైటికెళ్ళిపోయాడు ప్రవీణ్.

క్యాంపస్ ఇంటర్వ్యూలో ప్రవీణ్‌కి సాఫ్ట్‌వేర్ ఉద్యోగం వచ్చింది. పూనాలో సెటిలయ్యాడు. మంచి ఉద్యోగం, డబ్బూ ఉన్నప్పటికీ పెళ్ళంటేమాత్రం ప్రవీణ్‌కి పీడకలలా మారింది. అలా తాత్సారం చేస్తుండగానే ప్రవీణ్‌కి ముప్ఫయ్యేళ్ళొచ్చేశాయి.

ఆమధ్య ఆఫీసు పనిమీద హైదరాబాద్ వచ్చాడు ప్రవీణ్. ఎయిర్‌పోర్ట్‌లో దూరపు బంధువు కనిపించి పలకరించాడు. వివరాలు అడిగితెల్సుకుని ప్రవీణ్‌ని పెళ్ళికి ఒప్పించాడాయన. దగ్గరుండి అతడి పెళ్ళి జరిపించాడు.

●●●

డైరీ చదివి అతనివైపు ఆశ్చర్యంగా చూసిందామె. "మీరు కథలు రాస్తారా?!" అంది.

"ఇది కథ కాదు. నా జీవితం, ఇందులోని ప్రవీణ్‌ని నేనే. కమల, భాస్కర్రావు మా అమ్మా నాన్న".

ఆశ్చర్యంగా చూస్తూ, "ఇప్పుడు మీ నాన్నగారు..?" అంది.

"చనిపోయి రెండేళ్ళయింది".

"ఓ! గాడ్?!"

"చూడు! భిన్నపరిసరాల్లో పెరిగిన స్త్రీ పురుషుల్ని ఒకటి చేసేది వివాహబంధం. రెండు గుండె చప్పుళ్ళను ఐక్యం చేసే అయస్కాంతం. ఐక్యమైన ఆ గుండె చప్పుళ్ళు తుదిశ్వాస వరకూ ఒక్కటిగా ఆ ఇద్దరికీ విన్పిస్తే అది అన్యోన్యదాంపత్యం. అన్యోన్య దాంపత్యం పరస్పర కాంప్లిమెంట్స్‌తో సాగాలిగానీ, ఒకరికోసం మరొకరు అనుక్షణం కాంప్రమైజ్ అవుతూ జీవించకూడదు. ఎందుకు చెబుతున్నానంటే తల్లిదండ్రుల ప్రవర్తన పిల్లల మనసులపై ఎంతో ప్రభావం చూపిస్తుంది. అందుకు ఉదాహరణ నా జీవితమే. మొన్న పెళ్ళిచూపుల్లో నాకు 30 ఏళ్ళ వరకూ పెళ్ళి కాలేదని వినగానే, మొదటిచూపులో నీ మొహంలో కన్పించిన ప్రశ్నార్థకానికి జవాబే ఈ నా డైరీ" అన్నాడు గంభీరంగా.

ఆమె అతనికి దగ్గరగా జరిగి ఆప్యాయంగా అతని చేతి మీద చెయ్యి వేసింది.

"మనిషి జీవితంలో వివాహం ముఖ్యఘట్టమే. మీకు మీ జీవితంలో తల్లిదండ్రులవల్ల ఎదురైన చేదు అనుభవాలు మీలో పెళ్ళంటే విముఖత పెంచితే, నాకు మా అమ్మానాన్నలు పంచిచ్చిన మధురానుభూతులు వివాహంపై మమకారం కలిగించాయి.

మా నాన్న స్కూల్ టీచర్. అమ్మ హౌస్‌వైఫ్. మా ముగ్గురు అక్కా చెల్లెళ్ళకీ మంచి చదువులు చెప్పించారు. అక్కలిద్దరికీ ఉద్యోగాలతోపాటు మంచి భర్తలే దొరికారు. నాన్న సంపాదనతో అమ్మ సమర్థవంతంగా ఇల్లు నిర్వహించేది. చిన్నసంతోషాన్నైనా, పెద్ద దుఃఖాన్నైనా ఇంట్లో అందరం పంచుకునే వాళ్ళం. మానవ సంబంధాలపై అపారగౌరవం, అవగాహన ఉన్న అమ్మానాన్నలు బాల్యం నుండీ మాకు అవే నేర్పారు.

సో! ఇన్నేళ్ళూ వివాహం అంటే విరక్తి కలిగించిన ఆ దుర్ఘటనలకి దూరంగా ఇప్పుడు మీరు కోరుకుంటున్న మధురమైన జీవితప్రయాణంలో మీతో కలిసి ముందుకుసాగడానికి నావంతు సహకారం అందిస్తాను. పెళ్ళిలో వేదమంత్రాల సాక్షిగా ఏడడుగులు కలిసి నడచిన మనకి ఆ క్షణంనుండే ఒకరి మీద ఒకరికి ఏర్పడ్డ నమ్మకమే ఆలంబనగా ఇద్దరం కలిసి ఈ తొలిరేయి జీవితంలోకి 'ఎనిమిదో అడుగు' వేద్దాం" అని అతని చేతుల్ని తమలపాకుల్లాంటి తన చేతుల మధ్య ఉంచుకుని "ఇది నా ప్రామిస్" అంది ఆమె.

అంతే! మాటలురాని మౌనిలా ఆమెను ఆర్తిగా గుండెల్లో పొదువుకున్నాడతను.

**సెల్:96665 62422**

## మనమీదేనరోయ్!

సరసి





# సౌభాగ్య చక్రం

ఫిబ్రవరి 22 నుంచి
ఫిబ్రవరి 28 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. 26, 27 తేదీల్లో విద్య, దూరప్రయాణాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. సినీ, రాజకీయ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 28న బోధన, న్యాయ, పరిశోధన, శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి శుభప్రదం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థికపరమైన సమావేశాలు, చర్చలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి. 24, 25 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం. 26. 27 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సమావేశాల్లో తొందరపాటువల్ల నష్టపోయే అవకాశం ఉంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 28న సినీ రాజకీయ, ఉన్నత విద్యా రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థిక విషయాల్లో ఆశించిన సహకారం లభించక నిరుత్సాహపడతారు. 24,25 తేదీల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలించకపోవచ్చు. పెద్దలతో చర్చల్లో నిదానం అవసరం. రాజకీయ, సినీరంగాలవారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 26 27 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఉన్నత పదవుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 28న సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో మాటపడాల్సి రావచ్చు. 24,25 తేదీల్లో రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ఖర్చులు అధికం. 26, 27 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. వేడుకల్లో పాల్గొంటారు. 28న వృత్తి, వ్యాపారాల్లో వ్యూహాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు.

### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)



భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరం. 24, 25 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 26, 27 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సంస్మరణల్లో పాల్గొంటారు. క్రయవిక్రయాలకు అనుకూలం. 28న సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బృందకార్యక్రమాల్లో గతస్మృతులు నెమరు వేసుకుంటారు.

### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)



వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. 24, 25 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 26, 27 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. వేడుకలు, సమావేశాలు ఉల్లాసం కలిగిస్తాయి. 28న పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.

### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)



విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషిరంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు. 26, 27 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28న భాగస్వామి సహకారంతో వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి.

### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)



విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఒక సమాచారం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి శుభప్రదం. కుటుంబసభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 26, 27 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల విషయాలు ఆందోళన కలిగిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 28న వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కొత్త పరిచయాలు ఉల్లాసం కలిగిస్తాయి.

### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)



స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలు, వృత్తి వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఖర్చులు అధికం. 24, 25 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యా రంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. విద్యార్థులు లక్ష్యసాధనకు అధికంగా శ్రమించాలి. 26, 27 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఇల్లు, స్థలం మార్పిడి, బదిలీలకు అనుకూల సమయం. 28న చిన్నారులు, ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల విషయాలు, రాతకోతలు, చర్చలపై దృష్టి పెడతారు. 24, 25 తేదీల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. కీలకపత్రాలు సకాలంలో కనిపించక ఇబ్బంది పడతారు. 26, 27 తేదీల్లో చర్చలు, ప్రయాణాల్లో నిదానం పాటించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు తగిన సమయం కాదు. 28న కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఇంటికి అవసరమైన వస్తువుల రవాణాకు అనుకూలం.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన నిర్ణయాలు, చర్చలు, బిల్లుల చెల్లింపులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు, ఆర్థికపరమైన చర్చలకు అనుకూలం. ఒక సమాచారం కలవరపెడుతుంది. 24,25 తేదీల్లో అదనపు ఆదాయంకోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. 26, 27 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాల్లో నిదానం అవసరం. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువుల గురించి ఆరాతీస్తారు. 28న ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. విలువైన పత్రాలు అందుకుంటారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. 24,25 తేదీల్లో సినీ, రాజకీయరంగాల వారికి ప్రోత్సాహకరం. మనసు అశాంతిగా ఉంటుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి. 26, 27 తేదీల్లో కొత్త వ్యూహాలు రచిస్తారు. కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మీ ఆలోచనలు సమీక్షించుకుంటారు. 28న పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. కొత్త ఆదాయం మార్గాల అన్వేషణ ఫలిస్తుంది.

# సినిమాలకు బాద్‌షా బై... బై...!



బాలీవుడ్ బాద్‌షా షారూఖ్‌ఖాన్ సినిమాలకు బై బై చెప్పే సమయం దగ్గరపడింది అంటున్నారు బాలీవుడ్ జనాలు. నిన్న మొన్నటి వరకూ సినిమా వసూళ్లలో అమీర్‌ఖాన్, సల్మాన్ ఖాన్‌లతో పోటీపడే బాద్‌షాకి రాయీస్ సినిమా పెద్ద షాకే ఇచ్చింది. ఈ సినిమా దాదాపు రెండు వందల కోట్లు వసూలు చేస్తుందని అందరూ ఊహించారు.

అయితే ఎవరూ ఊహించని విధంగా ఆ సినిమాకు కనీసం వసూళ్లు రావడం గగనమైపోయింది. ఈ ఒక్క సినిమానే కాకుండా ఇటీవలి కాలంలో బాద్‌షా సినిమాలు అనుకున్న రేంజ్‌లో సక్సెస్ కావడం లేదు.

ప్రస్తుతానికి అతని చేతిలో సినిమాలేవీ లేవు కూడా! ఇన్ని పరిణామాల మధ్యలో బాద్‌షా హీరోగా బై బై చెప్పే అవకాశాలు ఉన్నాయి అంటున్నారు బాలీవుడ్ జనాలు.

తమ హీరో హవా ఇంకా తగ్గలేదనీ, ఒక్కటంటే ఒక్క హిట్టు పడితే మునుపటి రేంజ్ అందుకోవడం పెద్ద కష్టమేమీ కాదని బాద్‌షా అభిమానులు ధీమా వ్యక్తం చేస్తున్నా, అలాంటి పరిస్థితులు ఏవీ దరిదాపుల్లో కనిపించడం లేదని మరికొందరు చెబుతున్నారు.

# కత్రినా కొత్త అవతారం?

సినిమా రంగంలో వారసులు రావడం కొత్తేమీ కాదు. హీరోలు, దర్శకనిర్మాతల వారసులు వచ్చినంత త్వరగా, హీరోయిన్ల వారసులు రారు. వచ్చినా నిలదొక్కుకోలేరు. ఈ విషయం గ్రహించిన కత్రినా తనే నిర్మాతగా మారి చెల్లెళ్లను హీరోయిన్లను చేయబోతోంది. గతంలో ఓ చెల్లెలు హీరోయిన్‌గా బాలీవుడ్‌లో ఓ సినిమా చేసింది. కానీ చెప్పుకోదగిన పేరు మాత్రం రాలేదు. దాంతో ఇతరుల మీద ఆధారపడడం కన్నా తానే నిర్మాతగా మారి చెల్లెళ్లను సెట్ చేసే పనిలో పడింది. కత్రినా చేయబోయే సినిమా గురించిన వివరాలు ఇంకా బయటకు రావలసి ఉంది. ఈ సినిమాలో చెల్లెళ్లతో పాటు తనూ ఓ పాత్ర చేసే అవకాశం ఉందని బాలీవుడ్ జనాలు అంటున్నారు.



# రాజమౌళి సినిమాలో రజనీకాంత్



ఇదే కనుక నిజమైతే సినీ అభిమానులకు పండగే పండగ! ఒకరు సూపర్ స్టార్ అయితే, మరొకరు దర్శకధీరుడు. వీరిద్దరూ కలిసి సినిమా చేస్తే మరోసారి భారతీయ సినీ రికార్డులు బద్దలవుతాయి అంటున్నారు సినీ జనాలు. కాకపోతే ఈ కాంబినేషన్ సెట్ కావడానికి ఇంకా టైముంది. ప్రస్తుతం రాజమౌళి 'బాహుబలి 2' సినిమా పనులు పూర్తి చేయడంలో బిజీగా ఉంటే రజనీకాంత్ 'రోబో' సీక్వెల్ పూర్తి చేసుకుని 'కబాలి 2'కి సిద్ధమవుతున్నాడు.

ఇద్దరికీ చేతిలో ఉన్న ప్రాజెక్టులు పూర్తి అయితే కొత్త సినిమా మొదలవుతుంది. 'బాహుబలి 2' తరువాత మహాభారతంలోని కొన్ని ఘట్టాలను సినిమాగా తీయాలనే ఆలోచన రాజమౌళిలో ఎప్పటినుంచో ఉంది. ఈ సినిమాలో ఓ కీలక పాత్ర కోసం రజనీకాంత్‌ని సంప్రదించగా ఆయన ఓకే చెప్పారట! మరో ముఖ్య పాత్ర కోసం అమీర్ కూడా రెడీగా ఉన్నాడు. ఈ మేరకు సంప్రదింపులు, సన్నాహాలు పూర్తి అయ్యాయని సినీజనాలు అంటున్నారు.






# సెల్ఫీలు వద్దంటోంది

శ్రీదేవి తన కూతురు జాహ్నవి సినీ రంగ ప్రవేశం కోసం ఎన్నో అతి జాగ్రత్తలు తీసుకుంటోందట! మొదటి సినిమాతోనే కూతుర్ని స్టార్ హీరోయిన్ రేంజ్‌లో చూడాలన్నది శ్రీదేవి కోరిక అంటున్నారు బాలీవుడ్ జనాలు. అందుకే జాహ్నవికి రోజుకో కొత్త ఆంక్ష పెడుతోంది.

అప్పుడామధ్య బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగొద్దు అంటూ గట్టిగా వార్నింగ్ ఇచ్చింది. జాహ్నవి కొద్దిగా లైట్‌గా తీసుకుంది. ఇప్పుడు సెల్ఫీలు దిగి వాటిని సోషల్‌మీడియాలో పెట్టొద్దు అంటోందట! ఆ వయసు పిల్లలకి సెల్ఫీలంటే సరదా ఉంటుంది. ఆ సరదాను కంట్రోల్ చేయాలనుకోవడం శ్రీదేవి పిచ్చి కాకపోతే ఏమనుకోవాలి? అంటున్నారు బాలీవుడ్ జనాలు. మొత్తానికి శ్రీదేవి రోజుకో రూల్‌తో కూతురికి నరకం చూపిస్తోంది అన్నవారూ లేకపోలేదు.



# నిగ్గదీసి అడుగు ఈ సిగ్గులేని సినిమాని!

## 85 ఏళ్ళు పూర్తిచేసుకున్న తెలుగు టాకీచిత్రంపై సినీ ప్రముఖుల ఇష్టాగోష్టి

**భజన, తోలుబొమ్మలాట, హరికథ, బుర్రకథ, యక్షగానం, నాటకం, సినిమా...ఇదీ మనకు తెలిసిన సినిమా పరిణామక్రమం. కదిలేబొమ్మ, గోడమీద బొమ్మ, మాట్లాడేబొమ్మ, వెండితెర, చలనచిత్రం, సినిమా, సెల్యులాయిడ్...పేరు ఏదైతేనేం? సినిమా మన జీవితాల్లోకి చొచ్చుకుని వచ్చింది. మన ప్రవర్తనను, కుటుంబ సంబంధాలను ప్రభావితం చేసింది. మనల్ని మంచివారుగానో, చెడ్డవారుగానో తయారుచేసింది. టాలీవుడ్‌గా పాపులరైన తెలుగుచిత్ర పరిశ్రమలో టాకీచిత్రం విడుదలై 2017 ఫిబ్రవరి 6వ తేదీ నాటికి 85 సంవత్సరాలు పూర్తయ్యాయి.**

ఈ సందర్భంగా ఆ మంచిచెడ్డలు విశ్లేషించేందుకు సాహిత్య సంగీత సమాఖ్య హైదరాబాద్ మోతీనగర్‌లో ఇష్టాగోష్టి ఏర్పాటు చేసింది. తెలుగు సినిమాను బాధ్యతాయుతంగా తీర్చిదిద్దాల్సిన ఆవశ్యకతపై సినీప్రముఖులు విలువైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు. సినిమా స్వర్ణయుగం (1950-70) నాటి ప్రేక్షకుల్ని బాధ్యతాయుతమైన వ్యక్తులుగా తీర్చిదిద్దితే, ఆధునిక సినిమా సెక్స్, హింస ప్రేరేపిస్తూ యువతరంలో బాధ్యతారాహిత్యం పెంచింది. కానీ కొన్ని మంచి సినిమాలు కూడా వస్తున్నాయనే అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ప్రముఖ నటుడు, సమాఖ్య అధ్యక్షుడు రావికొండలరావు నివాసంలో ఫిబ్రవరి ఏడవతేదీ, మంగళవారం సాయంత్రం ఈ ఇష్టాగోష్టి కార్యక్రమం జరిగింది.

### ప్రశ్నించేవారే లేరు!

తెరమీద తప్పుచేస్తే ఆనాడు ప్రజల్లోంచి వ్యతిరేకత వచ్చేదని ప్రముఖ దర్శకుడు రేలంగి నరసింహారావు అన్నారు. సెన్సార్‌బోర్డ్‌లో విలువలు తెలియనివారు, రాజకీయ పార్టీలకు చెందినవారు సభ్యులుగా ఉంటున్నారని వాపోయారు. నేటి సమాజంలో సినిమాను, అందులోని తప్పొప్పుల్ని ప్రశ్నించేవారే కనిపించడం లేదన్నారు. సమాజంలో మంచిమార్పు తెచ్చే సాధనంగా తెలుగు సినిమా తయారుకావాలనీ, కమర్షియల్ మీడియంలో కూడా మోరల్స్ పాటించాలనీ అన్నారు.



### మనింట్లోంచే మార్పు ప్రారంభం కావాలి

మంచి సినిమాకు ప్రేక్షకులు, జనబాహుళ్యం వెన్నుదన్నుగా నిలవాలని సిరివెన్నెల సీతారామశాస్త్రి అన్నారు. సమాజంలోని ప్రతివ్యక్తీ తనను తాను జనంలో ఒకభాగంగా గుర్తించి బాధ్యతాయుతంగా మెలుగుతూ, సినిమాలో మంచిమార్పు తెచ్చేందుకు తనవంతు కర్తవ్యం నిర్వర్తించాలన్నారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు. '14-25 ఏళ్ళ వయసు వారిని గురిపెట్టి సినిమాలు తీస్తున్నారు. మన పిల్లల్ని మనం ప్రశ్నించలేకపోతున్నాం, మన అనుభవాలను వారితో పంచుకోలేకపోతున్నాం, మంచి సినిమావైపు వారిని మళ్ళించలేకపోతున్నాం, అందుకే మనతోనే ఈ ఉద్యమం ప్రారంభం కావాలి. ఈ మార్పు మన ఇంటి నుండే ప్రారంభం కావాలి.

ప్రతి ఇంట్లోనూ ఒక డిబ్బీపెట్టి డబ్బు ఆదాచెయ్యాలి. మంచి సినిమా వచ్చినప్పుడు కుటుంబసమేతంగా వెళ్ళిచూసి మద్దతివ్వాలి. ఆ విధంగా మంచి సినిమాకు గుర్తింపు, ఆదరణ తెచ్చే కర్తవ్యం ప్రేక్షకులదే! అలాంటప్పుడే మంచి సినిమా ఎక్కువ రోజులు ఎక్కువ థియేటర్లలో ఆడుతుంది' అన్నారు సీతారామశాస్త్రి.

### కళాత్మక వ్యాపారం

సినిమా ఒకప్పుడు కళాత్మకమైన వ్యాపారం కానీ ఈనాడు వ్యాపారాత్మకమైన కళగా మారిపోయిందని ప్రముఖ నటుడు రాళ్ళపల్లి ఆవేదన వ్యక్తం చేశారు. ఈ రోజు సినిమా నేటి తరాన్ని పెడతోవ పట్టిస్తోందని అన్నారు.

### తిడుతూ కూర్చుంటే ఏమీ సాధించలేం



ఏ రంగంలోనైనా మార్పు అనివార్యమనీ, సినిమారంగంలో వచ్చిన ఈ మార్పును అంగీకరించాలనీ ప్రముఖ సినీ రచయిత ఆకెళ్ళ అన్నారు. ఈ రంగంలో బాధ్యతాయుతమైన మంచిమార్పు కోసం మనం శ్రమించాలి తప్ప, తిట్టుకుంటూ కూర్చుంటే ఏమీ సాధించలేం అన్నారు ఆకెళ్ళ.

### సంఘాన్ని బాగుచేసే బాధ్యత సినిమాదే!

సంఘాన్ని బాగుచేసే బాధ్యత సినిమాపైనే ఉందని ప్రముఖ రంగస్థల, సినీనటుడు వైజాగ్



ప్రసాద్ అన్నారు. సినిమాతో పిల్లలకు హింస నేర్పిస్తున్నామన్నారు. గురుబ్రహ్మ అంటాం, కానీ స్టూడెంట్ టీచర్‌ని ప్రేమించే సన్నివేశాలు చూపించడం మానుకోవాలన్నారు.

సినిమా వ్యాపారాత్మకమే కావచ్చుగానీ, ఆ సంపాదన న్యాయబద్ధంగా ఉండాలన్నారు. పిల్లల్లో సినిమా నిర్లక్ష్యధోరణి తీసుకువస్తోందన్నారు. నిర్మాతలతో సాహిత్య సంగీత సమాఖ్య ఒక చర్చ పెట్టాలని కోరారు.

### మంచి సినిమాలకు థియేటర్లు దొరకవు

సినిమారంగంలో నాటికీ నేటికీ ఎంతో మార్పు వచ్చిందని ప్రముఖ నటుడు, ఇష్టాగోష్టికి అధ్యక్షత వహించిన రావికొండలరావు అన్నారు. కానీ ఈనాడు తెరమీద విలువలూ, తెరవెనుక క్రమశిక్షణ, గౌరవమర్యాదలు లేకుండా పోయాయనీ, సినిమా ఈనాడు దయనీయమైన స్థితిలో ఉందనీ ఆవేదన వ్యక్తం చేశారు.



'సినిమాను 1930-32 నాటికి గోడమీద వేసి చూపించేవారు గనుక 'గోడమీదబొమ్మ' అనేవారు. అలా వచ్చిన మొదటి సినిమా భక్తప్రహ్లాదను జనం విరగబడి చూశారు. డబ్బులు బస్తాల్లో మూట గట్టుకెళ్ళారని మా పెద్దవాళ్ళు చెప్పేవారు.

1950 - 70 మధ్య కాలం తెలుగు చిత్రపరిశ్రమకు స్వర్ణయుగం. అప్పుడన్నీ మంచి సినిమాలే! మంచి కథలూ, మంచి సాహిత్యం, మంచి పాటలతో అద్భుతంగా ఉంటాయి. ఆనాటి బాధ్యత, విలువలు ఈనాడు లేవు. మంచి సినిమా విడుదలకు థియేటర్లు దొరకవు. సుమారు 500 సినిమాలు విడుదల కాకుండా డబ్బాల్లోనే మూలుగుతున్నాయి. తమిళనాడులోనూ దాదాపు ఇంతే! ఈ పరిస్థితుల్ని మనం అధిగమించగలమా? మళ్ళీ అప్పటి కాలం వస్తుందా? అనే ప్రశ్నలే ఈ ఇష్టాగోష్టికి కారణం' అన్నారు రావికొండలరావు.

### తొలి తెలుగు టాకీచిత్రం తేదీని నిరూపించిన రెంటాల

తెలుగు చిత్రపరిశ్రమలో మొట్టమొదటి మాట్లాడే సినిమా 'భక్తప్రహ్లాద'. మునిపల్లె సుబ్బయ్య (హిరణ్యకశిపుడు), సురభికమలాబాయి (లీలావతి), షిండే కృష్ణారావు (ప్రహ్లాదుడు) ప్రభృతులు నటించారు. ఈ మధ్యకాలం వరకు ఈ చిత్రం విడుదల తేదీ ఖచ్చితంగా తెలియలేదు. కానీ భక్తప్రహ్లాద చిత్రం 1932 ఫిబ్రవరి 6వ తేదీన ముంబయిలో విడుదలైనట్లు ప్రముఖ జర్నలిస్టు డాక్టర్ రెంటాల జయదేవ్ పట్టుదలతో పరిశోధించి ఆధారాలతో నిరూపించారు. ఆ విధంగా తెలుగు చిత్రపరిశ్రమ ప్రస్థాన ప్రారంభం మనకు స్పష్టంగా తెలిసిందని సాహిత్య సంగీత సమాఖ్య కార్యదర్శి ఆచారం షన్ముఖాచారి స్వాగతోపన్యాసంలో చెప్పారు.



భక్తప్రహ్లాద చిత్రం విడుదల తేదీని కనిపెట్టే పరిశోధన సమయంలో ఎదుర్కొన్న కష్టాలు, ఒడిదుడుకులను రెంటాల జయదేవ్ ఈ సందర్భంగా వివరించారు. భారతదేశంలో విడుదలైన తొలి టాకీ చిత్రం, దక్షిణభారతదేశంలో విడుదలైన తొలి టాకీ చిత్రం, తెలుగులో విడుదలైన తొలి టాకీ చిత్రం....ఈ మూడింటిలో పనిచేసిన ఘనత హెచ్.ఎం.రెడ్డికే దక్కిందనీ, ఇది తెలుగువారికి గర్వకారణమనీ జయదేవ్ చెప్పారు. అదేవిధంగా ఈ మూడు సినిమాలలోనూ నటించిన ఘనత ఎల్.వి.ప్రసాద్‌కి దక్కుతుందన్నారు. ఈ విధంగా తెలుగువారు అటు తెరవెనుక, ఇటు తెరపైన భారతీయ టాకీచిత్రాల చరిత్రలో చిరస్థానం సంపాదించుకున్నారని చెప్పారు.

'సమాజంలో చెడు ఉంటుంది, కానీ మంచి కూడా ఉంటుంది తెలుసుకో' అని నేటి తరానికి మనం మార్గదర్శనం చేస్తూ ముందుకు వెళ్ళాలన్నారు జయదేవ్.

ప్రముఖ రచయిత, నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ, మ్యూజికాలజిస్టు మధుసూదన శర్మ, 160కి పైగా 'ఘంటశాల అవధానాలు' చేసిన గాయకుడు డాక్టర్ రహ్మతుల్లా, ప్రముఖ రచయిత ఓలేటి శ్రీనివాసభాను, ప్రముఖ అనువాద రచయిత గబ్బిట కృష్ణమోహన్, ప్రముఖ ఆర్టిస్టు రవికిషోర్, ప్రముఖ కార్టూనిస్టు సరసి, రచయిత, చిత్రకారుడు కోడూరి సహా సాహిత్య సంగీత సమాఖ్య సభ్యులు శ్రీమన్నారాయణ, నడిమింటి నరసింహారావు, విజయదుర్గ, అరుణకుమారి, నాగరత్నం, గోవిందాచార్యులు, శివరామకృష్ణ, రాజగోపాల్, అంబాజీ ప్రభృతులు పాల్గొన్నారు. పురాణం రమణ వందన సమర్పణ చేశారు.

**-రామ్మోహన్**




## రచయిత కలానికి స్వేచ్ఛ రావాలి

**-రాళ్ళపల్లి**



"హీరో భుజస్కంధాలపైన మాత్రమే ఇప్పటి సినిమా ఆధారపడివుంది! అందుకే హీరో డేట్లు దొరికితే కథ అల్లుతున్నారు. రెండు డేట్లు దొరికితే రెండుబైట్లు, మరో రెండు డేట్లు దొరికితే రెండు డ్యూయట్లు తీస్తున్నారు. మనం ఎవర్నీ ఆపలేం, 1500 రూపాయలు పెట్టి బ్లాక్‌లో టిక్కెట్టు కొని యువతరం ఎగబడి సినిమాలు చూస్తోంది. అందుకే నిర్మాతలు, 'మా సినిమా హిట్ అవ్వాలి అంటారుతప్ప మంచి సినిమా తియ్యాలి' అనరు!

ఈ రోజుల్లో సంగీతం గురించి అసలు చెప్పలేం. అక్షరాల్ని ముక్కలు ముక్కలుగా కత్తిరించి సంగీతానికి అనుగుణంగా మధ్యమధ్యలో అతికించాల్సి వస్తోంది. రచయితల కలానికి స్వేచ్ఛ ఇస్తే మంచి పాటలు రాస్తారు, అప్పుడే మళ్ళీ ఒక ఆత్రేయను, ఒక ఆరుద్రను చూడగలుగుతాం. రచయితలు బూతులూ, నీతులూ రెండూ చెప్పగలరు. 'సినిమాలో బూతులు జనానికి అర్థం కావాలిగానీ, సెన్సార్‌బోర్డ్ మెంబర్స్‌కి అర్థం కాకూడదు, ఆ పద్ధతిలో రాయండి పాటలు' అని అడుగుతున్నారు నిర్మాతలు. ఒకసారి వేటూరిగారు ఈ విషయమే నాతో చెప్పి బాధపడ్డారు.

సినిమా ఎంతో బాగుంటేతప్ప ఈనాటి ప్రేక్షకులు థియేటర్‌కి వెళ్ళడం లేదు. ప్రతి ఇంట్లో పాత సినిమాలు, పాత పాటలే కనిపిస్తున్నాయి. మనం చెప్పాలేగానీ నేటితరం కూడా క్లాసిక్ చిత్రాలు ఆసక్తిగా చూస్తోంది. మంచి సినిమాలకు ప్రేక్షకులు ఎప్పుడూ ఉంటారనీ, ఆదరణ ఎప్పుడూ ఉంటుందనీ నిర్మాతలు గుర్తుపెట్టుకోవాలి"



## పిల్లిమెడలో గంట కట్టేదెవరు?

సినిమా నిర్మాణంలో సామాజిక బాధ్యతతో కూడిన మంచిమార్పు తీసుకురావడం ఎలా? అనే విషయాలపై నిర్మాతల మండలితో సాహిత్య, సంగీత సమాఖ్య ఒక సమావేశం ఏర్పాటు చేయాలని సిరివెన్నెల సీతారామశాస్త్రి అభిప్రాయపడ్డారు.

మనం ఎందుకు భయపడుతున్నాం? ఎవరికి భయపడుతున్నాం? దేనికి భయపడుతున్నాం? పిల్లిమెడలో గంట ఎవరు కట్టాలి అనే ప్రస్తావన లేకుండా నిర్మాతలతో మన అభిప్రాయాలు పంచుకోవాలి. ఎవరు? ఎందుకు? ఏమిటి? ఎలా? లాంటి ప్రశ్నలకు నిర్మాతలతో కలిసి మనం ఆలోచించాలి, తగిన సమాధానాలు రాబట్టాలి. టీవీ ఛానల్స్ సైతం ఈ అంశంపై చర్చాగోష్ఠులు చేయాలి' అని సూచించారు సీతారామశాస్త్రి.

# అభినయ ఆలియా

**యూత్‌లో క్రేజ్ ఉన్న హీరోయిన్లలో ఆలియా భట్ పేరు ముందుగా ఉంటుంది. మహేష్‌భట్ కూతురుగా సినిమాల్లోకి ప్రవేశించినా, కొద్దికాలానికే తనకంటూ ఓ సుస్థిర స్థానాన్ని సంపాదించుకుని, తోటి హీరోయిన్లకు గట్టి సవాల్ విసరగల స్థాయికి చేరుకుందీ బబ్లీగర్ల్. గత సంవత్సరం మంచి విజయాలు అందుకుని అందరిచేతా అభినవ ఆలియా అనిపించుకోగలిగింది. ఈ సంవత్సరం కూడా అంత సక్సెస్ సాధించి ఆ పేరును నిలబెట్టుకుంటాను అంటున్న ఆలియాతో....**

**ఈ సంవత్సరం మీ డైరీ అస్సలు ఖాళీ లేనట్టుంది?**

ఈ సంవత్సరం మూడు సినిమాలు చేస్తున్నాను. త్వరలోనే 'బద్రీనాథ్ కి దుల్హనియా' విడుదల కాబోతోంది. మరో రెండు సినిమాలు షూటింగ్‌లో ఉన్నాయి. వీటి తరువాతే మరో సినిమా ఒప్పుకుంటాను.

**వరుణ్‌ధావన్‌తో రెండోసారి నటిస్తున్నట్టున్నారు?**

కెరీర్ ప్రారంభంలో చేశాను. తిరిగి ఇన్ని సంవత్సరాలకు తనతో చేసే అవకాశం వచ్చింది. తెరమీద మాది మంచి జోడి అని పేరు వచ్చింది. త్వరలో రాబోతున్న 'బద్రీనాథ్ కి దుల్హనియా' కూడా మంచి పేరు తెస్తుందన్న నమ్మకం నాకుంది. మరో సినిమా కూడా తనతో చేయబోతున్నాను. దాని వివరాలు త్వరలోనే చెబుతాను.

**ఈ సినిమా గురించి...**

అతి త్వరలోనే థియేటర్లలోకి రాబోతోంది కదా? ముందే చెప్పేస్తే థ్రిల్ ఉండదు. ఈ సినిమాలో ఎక్కువగా సంప్రదాయబద్ధమైన డ్రస్సుల్లోనే కనిపిస్తాను. ఇప్పటి వరకూ ఇలాంటి పాత్ర చేయలేదు. చాలా డిఫరెంట్ క్యారెక్టర్. తెరమీద చూస్తే అర్థమైపోతుంది. నా అభిమానులతో పాటు నాకూ ఈ సినిమా ఎప్పుడెప్పుడు థియేటర్‌లో చూద్దామా? అన్న ఆత్రుత ఉంది.

**తొలిసారి వందకోట్ల క్లబ్బులోకి అడుగుపెట్టినట్టున్నారు?**

నా సినిమా వసూళ్ల గురించి ఎప్పుడూ పెద్దగా పట్టించుకోను. కిందటి సంవత్సరం వచ్చిన 'కపూర్ అండ్ సన్స్' నటిగా నాకు మంచి పేరు తెచ్చింది. ఆర్థికంగా వందకోట్లు రాబట్టింది.

**మీ కెరీర్ బెస్ట్ సినిమా గురించి...**

'డియర్ జిందగీ'లో నాది గుర్తుండిపోయే పాత్ర. వసూళ్లు పక్కన పెడితే ఆ సినిమాలో నేను పోషించిన కైరా పాత్రకి మంచి మార్కులే పడ్డాయి. ఆ తరువాత 'ఉడ్తా పంజాబ్' గురించి చెప్పుకోవాలి. ఆ సినిమా విడుదలకు ముందే ఎన్ని సంచలనాలు కలిగించిందో ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. నా కెరీర్ మొత్తంలో బెస్ట్ అనే కాదు ఎప్పటికీ గుర్తుండిపోయే పాత్ర అది. అసలు తెరమీద నన్ను నేను చూసుకుని చాలా ఆశ్చర్యపోయాను. ఇంత బాగా చేశానా? అన్న అనుమానం కూడా వచ్చింది. నటిగా పూర్తి సంతృప్తినిచ్చిన పాత్ర. అది ఒక్కటి చాలు అనిపించింది. వసూళ్ల పరంగా ఆ సినిమా నిరాశ మిగిల్చింది.

**మీ సినిమాలు దాదాపు అన్నీ మంచి విజయాల్నే అందుకోవడం ఎలా అనిపిస్తోంది?**

ఆనందం కన్నా భయం ఎక్కువ వేస్తూ ఉంటుంది. సినిమా సక్సెస్ అన్నది నా ఒక్కదాని మీదే ఆధారపడి ఉండదు కదా! దానికి బోలెడన్ని అంశాలు తోడవుతాయి. నా అదృష్టం కొద్దీ నా దగ్గరకు మంచి మంచి కథలు రావడమే కాదు, వాటిని తెరమీద అద్భుతంగా ప్రజెంట్ చేయగల దర్శకులతో పని చేస్తున్నాను. మంచి యూనిట్‌తో వర్క్ చేయడం వల్లనే మంచి అవుట్‌పుట్ వస్తోంది.

**గతంలో ఆడపిల్లల కోసం ఏదైనా చేస్తానని చెప్పారు కదా? అది ఎంత వరకూ వచ్చింది?**

అది ఇంకా కార్యరూపం దాల్చలేదు. ఆడపిల్లల కోసం, వారి చదువు కోసం ఏదైనా చేయాలని ఎప్పటినుంచో ఉంది. అంతేకాదు మూగజీవాల కోసం ఓ షెల్టర్ ఏర్పాటు చేయాలనుకుంటున్నాను. వీటికి కొంతకాలం పడుతుంది. నేను అనుకున్న

వన్నీ తప్పకుండా చేస్తాను. నేను చేతల మనిషిని కానీ మాటల మనిషిని కాదు.

**మిమ్మల్ని అభినయ ఆలియా అంటుంటే ఎలా ఫీలవుతుంటారు?**

చెప్పానుగా ఓ పక్క ఆనందం, మరో పక్క భయం వేస్తుంది. వారి అభిమానాన్ని నిలబెట్టుకోవాలన్న పట్టుదల పెరుగుతుంది. అందుకే సినిమా సినిమాకీ నేను పడే కష్టం పెరుగుతోందే తప్ప తరగడం లేదు.

**అన్నీ ఒకదానితో మరొకటి పొంతనలేని పాత్రలే చేస్తున్నారు ఎలా సాధ్యం?**

అదంతా గాడ్‌గ్రేస్. కెరీర్ మొదలుపెట్టినప్పటినుంచీ ఒకే రకమైన కథలు వస్తున్నాయని ఎప్పుడూ ఫీలవలేదు. వెరైటీ స్టోరీస్‌తోనే నా దగ్గరకు వస్తున్నారు. కొన్ని నేను చేయలేని పాత్రలు కూడా ఉంటున్నాయి. అలాంటివి ఇప్పుడప్పుడే చేయను అని నిర్మొహమాటంగా చెప్పేస్తాను. కొన్ని రకాల పాత్రలు చేయడానికి ఇంకా కొంత కాలం పడుతుంది.

**స్టార్ హీరోయిన్ స్టేటస్ రాలేదని బాధ పడిన సందర్భం?**

ఇలాంటి స్టేటస్‌ల మీద పెద్దగా నమ్మకం లేదు. ఎప్పటికప్పుడు ఆ రేటింగ్‌లు మారిపోతూ ఉంటాయి. నేను ఇంకా చిన్నదాన్ని. ఆ స్థాయికి చేరుకోవడానికి చాలా సమయం ఉంది. అప్పటికీ అందుకోలేకపోతే అప్పుడు బాధపడతానేమో చెప్పలేను.

**వీకెండ్ ఎలా ఎంజాయ్ చేస్తారు?**

మా ప్రొఫెషన్లో వీకెండ్ ఎంజాయ్‌మెంట్లు తక్కువే! ఎప్పుడన్నా తీరిక దొరికితే స్నేహితులతో కలిసి పార్టీలకు వెడుతుంటాను. మరీ లేట్ నైట్ పార్టీలంటే ఇష్టముండదు. అలాగే అక్కడ డ్రింక్ చేయడం కూడా నచ్చదు. ఫ్రెండ్స్ బలవంతం చేస్తే కొద్దిగా టేస్ట్ చేస్తానంతే! క్యాలెండర్‌లో డేట్ మారకముందే ఇంటికి చేరుకుంటాను. అసలు పార్టీలంటే లండన్‌లో చూడాలి. అక్కడ నైట్‌లైఫ్ చాలా బాగుంటుంది.

**సిద్దార్థ మల్హోత్రా ఇంటికి వెళ్ళి వచ్చారట?**

మామూలుగా వాళ్లింటికి వెళ్లాను. సందర్భం అంటూ ఏదీ లేదు. ఇద్దరం కలిసి నటించాం, నటిస్తున్నాం. మా ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. నాకూ వెళ్లాలని అనిపించింది, వెళ్లాను. అంతే! అందరూ అనుకుంటున్నట్టుగా మా మధ్య ఎలాంటి రిలేషన్‌షిప్ లేదు. తను నాకు కోస్టార్ అంతే! నా సినిమాల్లో మిగతా హీరోలతో ఎలా ఉంటానో, తనతోనూ అలాగే ఉంటాను.

**బాలీవుడ్‌లో బాగా నచ్చిన హీరో?**

షారూఖ్‌ఖాన్ అంటే చిన్నతనం నుంచి చాలా ఇష్టం. తన సినిమాలు తరచు టీవీలో వస్తూండేవి. ఆ తరువాత అక్షయ్ కుమార్. ఈ ఇద్దరూ చాలా ఇష్టం. ఈ మాటలు నటిగా చెప్పడం లేదు. సినీ ప్రేక్షకురాలిగా మాత్రమే చెబుతున్నాను.



**బాగా వంట చేస్తారట..నిజమేనా?**

ఆలూ ఫ్రై మాత్రమే వచ్చు. మా గ్రాండ్ మదర్ దగ్గర్నుంచి నేర్చుకున్నాను. ఓసారి మా ఫాదర్‌కి చేసి పెట్టాను. తనకి చాలా బాగా నచ్చింది. మొత్తం తినేశారు. తిన్న తరువాత 'రేపు చనిపోయినా పరవాలేదు' అన్నారు. దాంతో నా వంట మీద నాకు నమ్మకం ఎక్కువైంది.

**ఏ వస్తువైనా దొంగిలించాలన్న చిలిపి ఆలోచన ఎప్పుడైనా కలిగితే..?**

మా సిస్టర్ దాచుకున్న కాయిన్స్ దొంగిలిస్తాను. తను ఎన్నో దేశాలు తిరిగి వాటిని కలెక్ట్ చేసింది. నాకు తిరగడం అంతగా ఇష్టం ఉండదు. తను కష్టపడి కలెక్ట్ చేసిన కాయిన్స్ దొంగిలించి నేను కలెక్ట్ చేసినట్టు బిల్డప్ ఇచ్చేస్తాను.

**మీకు బాగా నచ్చిన ప్రదేశం?**

గ్రీస్. వీలుంటే నా పుట్టినరోజు అక్కడ సెలబ్రేట్ చేసుకోవాలని ఉంది.

**హాలీవుడ్ సినిమాల్లో చేస్తారా?**

అవకాశం వస్తే చేయకుండా ఎలా ఉంటాను. అన్నిటికీ ఓ టైమ్ ఉంటుంది. ఆ టైమ్ వస్తే అన్నీ వాటంతట అవే జరిగిపోతుంటాయి. హాలీవుడ్‌లో అవకాశం కూడా అలాగే వస్తుందేమో!

-చిన్ని





## ఇంటర్వ్యూ

# జానపద, పౌరాణిక చిత్రాలు రావాలి

**-వరలక్ష్మి**

**బేబీ వరలక్ష్మిగా, ఆంధ్రా సిస్టర్‌గా తెలుగు ప్రజల అభిమానం పొందిన నటి వరలక్ష్మి. ఎంతోమంది హీరోలకు చెల్లెలుగా నటించారు. దిగ్గజాలవంటి దర్శకుల చిత్రాల్లో నటించి పేరుతెచ్చుకున్నారామె. ఇప్పటికి 300 లకు పైగా చిత్రాలు చేసిన బహుభాషా నటి.**

**జానపద, పౌరాణిక చిత్రాలు మరిన్ని రావాలనీ, బాహుబలి, మిథునం, పెళ్ళి చూపులు, శతమానంభవతి లాంటి మంచి చిత్రాలు మరిన్ని రావాలనీ ఆకాంక్షిస్తున్న వరలక్ష్మి ఇంటర్వ్యూ...**

పశ్చిమగోదావరిజిల్లా భీమవరం మండలం ఆచంట గ్రామంలో జన్మించాను. మా నాన్నగారు గొడవర్తి ఆనంద్. అమ్మ లక్ష్మి. మేం నలుగురు అక్కా చెల్లెళ్ళం. మద్రాసు టి.నగర్‌లోని కర్ణాటక సంఘ్ పాఠశాలలో ఎస్.ఎస్.ఎల్.సి. వరకు చదివాను. అప్పటినుండీ నాకు సినిమాల్లో అవకాశాలు రావడం మొదలు కావడంతో చదువుకు స్వస్తి చెప్పి సినిమా రంగంలోకి ప్రవేశించాను. బాలనటిగా సినీ జీవితం ప్రారంభించాను. అందువల్ల పెద్దయ్యాక కూడా నటిగా నాకు కెమెరా సెన్స్, టేకింగ్ సమయంలో భయ పడటం వంటి సమస్యలు రాలేదు.

### హిందీచిత్రంలో పసికందుగా

మా నాన్నగారు ఆనంద్ సినిమాల్లో చిన్న చిన్న వేషాలు వేయడంవల్ల నాకు అవకాశాలు మెండుగా వచ్చాయి. నిజం చెప్పాలంటే ఆరు నెలల పసికందుగా ఉన్నప్పుడే నేను సినీరంగ ప్రవేశం చేశాను. అదెలాగంటే, ఎ.వి.ఎం స్టూడియోలో 'జైసే కో తైసా' హిందీచిత్రం షూటింగ్ సమయంలో పసికందు అవసరం రావడంతో, నన్ను ఎంపిక చేసుకున్నారు. జితేంద్ర, రీనారాయ్ ఈ చిత్రం హీరోహీరోయిన్లు. 1973లో విడుదలైంది.

### అందాలరాముడులో బాలనటిగా

బాపూగారి దర్శకత్వంలో వచ్చిన అందాల రాముడు చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావుగారి 'ఎదగ డానికెందుకురా తొందరా/ఎదర బతుకంతా చిందర వందర...' పాట నాటికీ నేటికీ ఎంతో ఫేమస్. అందులో నాగేశ్వరరావుగారికి లత జోడీ. ఆ చిత్రంలో బాలనటిగా చేశాను. తర్వాత విశ్వనాధ్‌గారి దర్శ కత్వంలో 'జీవనజ్యోతి' చిత్రంలో రథం కింద నలిగి చనిపోయే పాత్ర, వాణిశ్రీ ఊహల్లో సజీవంగా ఉండే పాత్రలో చేశాను. 'మాంగల్యానికి మరో ముడి', స్నేహం, సిరిసిరిమువ్వ, ఎన్.టి.ఆర్ చిత్రం నిప్పులాంటి మనిషిలో చేశాను. 'శంకరాభరణం'లో రాజ్యలక్ష్మికి బాల్యంలో పాత్ర పోషించాను.

### తమిళంలో తొలి చిత్రం

దాదాపు పదమూడు సంవత్సరాలు బాలనటిగా చేశాను. హీరోయిన్‌గా నా సినీప్రస్థానం తమిళచిత్రంతో ప్రారంభమైంది. 'సౌందం పదునారు' అనే తమిళ చిత్రంలో హీరో మోహన్ సరసన నటించాను. నా మొదటి చిత్రమే సూపర్‌హిట్ అయింది. దాంతో తెలుగు దర్శకులనుండి కూడా ఆఫర్స్ రావడం ప్రారంభ మైంది. అలా నా సినీజీవితం దశ తిరిగింది. అటు తెలుగు, మలయాళం, కన్నడ చిత్రాల్లో కూడా ఆఫర్స్ వచ్చాయి. జీవితం బిజీబిజీగా మారిపోయింది.

### ఆంధ్రాసిస్టర్

'గూండా' చిత్రంలో మెగాస్టార్ చిరంజీవి గారికి చెల్లెలు పాత్రలో నటించాను. బేబీవరలక్ష్మిగా ఎన్నో చిత్రాల్లో చేసి పెద్దయ్యాక నేను నటించిన నా మొదటి తెలుగుచిత్రం అదే. ఆ చిత్రం విజయ వంతమైంది. దాంతో తెలుగు ప్రేక్షకులు 'ఆంధ్రా సిస్టర్' గా పిలవడం ప్రారంభించారు. చిత్ర పరిశ్రమలో కూడా అలాగే పిలిచేవారు. ఇలా చిరంజీవిగారి 'దేవాంతకుడు', 'అత్తకు యముడు-అమ్మాయికి మొగుడు', 'గూండా' వంటి చిత్రాల్లో చెల్లెలుగా చేశాను. 'స్టేట్‌రౌడీ'లో విభిన్నమైన పాత్ర చేయ డంలో నాకు ఎంతగానో చిరంజీవిగారి ప్రోద్బలం లభించింది. అదేవిధంగా 'స్వాతిముత్యం'లో కమల్ హాసన్ మరదలుగా చిట్టి పాత్ర బాగా హిట్టయింది. 'కలెక్టరుగారి అబ్బాయి, 'విక్కీదాదా' చిత్రాల్లో నాగార్జునకు చెల్లెలుగా, బాలకృష్ణకు చెల్లెలుగా 'రాముడు భీముడు', 'ప్రెసిడెంటుగారి అబ్బాయి',

'ఇన్‌స్పెక్టర్ ప్రతాప్' చిత్రాల్లో నటించాను. అదే విధంగా 'బ్రహ్మాస్త్రం', 'అశ్వత్థామ' చిత్రాల్లో సూపర్ స్టార్ కృష్ణగారికి చెల్లెలుగా నటించాను. 'అజేయుడు', 'శ్రీనివాస కల్యాణం' చిత్రాల్లో వెంకటేష్ చెల్లెలుగా నటించాను. ఇలా పెద్ద హీరోలకు చెల్లెలుగా నటించడంతో తెలుగు ప్రేక్షకులు నన్ను 'ఆంధ్రాసిస్టర్' అని పిలిచేవారు. అలా పిలవడం నాకు ఎంతో సంతోషం కలిగించేది.

### మలయాళ చిత్రానికి జాతీయ అవార్డు

'తుండిల్‌మీన్' తమిళచిత్రంలో బాలనటిగా చేశాను. ఆ చిత్రంలో నా నటనకుగాను ఫిలిమ్‌ఫేర్ అవార్డు లభించింది. ఈ చిత్రం 1977లో విడుదలైంది. మోహన్, లక్ష్మి ఈ చిత్రంలో నటించారు.

అదేవిధంగా 'తోరణం' మలయాళ చిత్రంలో నా నటన ఎందరి ప్రశంసలనో అందుకుంది. ఈ చిత్రంలో నా నటనకు జాతీయ అవార్డు లభించింది. ఈ చిత్రంలో నాతో పాటు నెడుముడి వేణు, జనార్దన్ తదితరులు నటించారు. జోసఫ్ మాడపల్లి దర్శకత్వం, యు.రాజన్ నిర్మాణంలో 1987లో ఈ చిత్రం విడుదలైంది.

### ఆమె

'ఆమె' చిత్రం 1994లో విడుదలైంది. ఈ చిత్రంలో నాకు జోడీగా తనికెళ్ళ భరణిగారు నటించారు. శ్రీకాంత్, ఊహ హీరోహీరోయిన్లు. ఈ చిత్రం తరువాతే వారిద్దరికీ వివాహం జరిగింది. ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో ఉత్తమచిత్రంగా దీనికి ఫిలిమ్‌ఫేర్ అవార్డు లభించింది. ఈ చిత్రం తర్వాత మెల్లిగా సినిమాలు తగ్గించాను. తర్వాత 'ఆడవాళ్ళా మజాకా' చిత్రంలో నటించాక పూర్తిగా నాకు గ్యాప్ వచ్చింది.

### నాన్న చలవే

నేను సినిమారంగంలో రాణించడం, నిలదొక్కుకోవడం అంతా మా నాన్నగారి చలవే. ఆయన నాకు మార్గదర్శనం చేశారు. నటన విషయంలో నాకు పూర్తిస్వేచ్ఛ ఇచ్చారు. అది సంతోషించదగ్గ విషయం. ఈ విషయంలో అమ్మానాన్న నన్నెప్పుడూ అభ్యంతరపెట్టలేదు.

### వెన్నుపూసకు గాయం

అశ్వత్థామ చిత్ర నిర్మాణ సమయంలో రౌడీలు నన్ను మేడమెట్ల పైనుండి కిందకులాగే సీన్ ఉంటుంది. అవి ఇనుపమెట్లు. ఆ రోజు వర్షంవల్ల ఆ మెట్లు తడిసిపోయాయి. ఆ సమయంలో షూటింగ్ జరిగింది. మెట్లు ఎక్కుతుంటే రౌడీలు నన్ను కిందకులాగే సన్నివేశం. ఆ సన్నివేశంలో వాళ్ళు లాగినప్పుడు కాలు స్లిప్ అయింది. జారిపడిపోయాను. వెన్నుపూసకు తీవ్రగాయమైంది. వారం రోజులు హాస్పిటల్‌లో ఉన్నాను. ఆ సమయంలో కృష్ణగారు ఎప్పటికప్పుడు నాకు ఫోన్‌చేసి నా క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకునేవారు. కృష్ణగారు చాలా బాధపడ్డారు. వాళ్ళందరినీ చెడామడా తిట్టారు. ఫేమస్ ఫైట్‌మాస్టర్ విజయన్ గారు ఆ చిత్రం చేశారు. కృష్ణ, విజయనిర్మల, మోహన్‌బాబు నటించిన ఈ చిత్రంలో నాకు జోడీగా రాజా నటించారు. బి.గోపాల్ దర్శకత్వంలో 1988లో ఈ చిత్రం విడుదలైంది.



### దేవుడు మావయ్య

మహానటి సావిత్రి అతిథినటిగా చేసిన చిత్రం 'దేవుడు మావయ్య'. ఇందులో నేను బాలనటిగా చేశాను. ఆ విధంగా ఆవిడను చూడటం నా అదృష్టంగా భావిస్తాను. నాతో ఎంతోచక్కగా మాట్లాడేవారు సావిత్రి. నువ్వు భవిష్యత్తులో మంచినటివి అవుతావు అని నన్ను ఆశీర్వదించారు. ఆ మాట, ఆ ఆశీర్వాదం నేను ఎన్నటికీ మరచిపోలేను. ఈ చిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ నటించారు. 'శంకరాభరణం' చిత్రంలో బాలనటిగా చేశాను. విశ్వనాథ్‌గారి చిత్రాల్లో నేను మెయిన్ క్యారెక్టర్స్ చేశాను. అందువల్ల నాకు విశ్వనాథ్‌గారు తులసికి ఇచ్చిన పాత్ర ఇద్దాం అనుకున్నారు. కానీ పద్యాలు ఉండటం, నా వయసు మరీచిన్నగా ఉండటంవల్ల ఈ చిత్రంలో రాజ్యలక్ష్మి బాల్యంలో పాత్ర పోషించాను. దాదాపు ఫస్ట్‌హాఫ్ అంతా నా పాత్ర ఉంటుంది.

పెద్ద దర్శకుల చిత్రాల్లో నేను ఎక్కువ నటించాను. వారిలో బాపు, విశ్వనాథ్, బి.గోపాల్, కోదండరామిరెడ్డి లాంటివారున్నారు. వారి చిత్రాల్లో ఎక్కువ చేశాను.

బాపూగారి దర్శకత్వంలో అందాలరాముడు, స్నేహం, బుల్లెట్, విశ్వనాథ్‌గారి దర్శకత్వంలో జీవన జ్యోతి, సిరిసిరిమువ్వ, స్వాతిముత్యం, సిరివెన్నెల లాంటి సూపర్‌హిట్ చిత్రాల్లో నటించడం నా అదృష్టంగా భావిస్తాను. అదేవిధంగా బి. గోపాల్‌గారి దర్శకత్వంలో ఆణిముత్యాల్లాంటి ప్రతిధ్వని, కలెక్టరుగారి అబ్బాయి, ప్రతిఘటన, అశ్వత్థామ చిత్రాల్లో నటించాను. చిరంజీవిగారి చెల్లెలుగా నటించిన చిత్రాలెన్నో మరువలేనివి. జానపదం, పౌరాణిక చిత్రాల్లో నటించింది తక్కువే.

ఇలా తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషల్లో నటించాను. ఆ చిత్రాలన్నీ విజయవంతమైనవే. ఎక్కువగా చెల్లెలు పాత్రలు చేశాను. అన్నిరకాల పాత్రలు పోషించాను. హీరోయిన్‌గా, సహనటిగా ఎన్నో చిత్రాలు చేశాను. తల్లిపాత్రలు



ఇంకా చేయలేదు. మంచికథ ఉంటే తల్లిపాత్ర చేయాలని ఉంది.

### 60 పైగా టీవీ సీరియల్స్

ఇరవై ఏళ్లుగా బుల్లితెరపై తెలుగు, తమిళంలో 60కి పైగా సీరియల్స్‌లో నటించాను. నేను నటించిన సీరియల్స్‌లో నాకు బాగా నచ్చినవి, ప్రేక్షకులు మెచ్చినవి ఉన్నాయి. మనసుగీసిన బొమ్మ, అమ్మ, చంద్రలేఖ సీరియల్స్ రవిప్రసాద్‌గారి దర్శకత్వంలో వచ్చాయి. నటీమణి రాధిక దర్శకత్వంలో రాజుగారి కూతురు, తల్లిప్రేమ సీరియల్స్‌లో నా పాత్రలు, ఆ కథలు నాకు ఎంతో నచ్చాయి. అమ్మ సీరియల్‌లో మంజుల, శరత్‌బాబుగారికి కూతురుగా నటించాను. ప్రస్తుతం 'అష్టాచెమ్మా' సీరియల్ చేస్తున్నాను.

### మంచి చిత్రాలు రావాలి

మార్పు సహజం. అది కాలానుగుణమైనది. సినీ పరిశ్రమ అన్నివిధాలుగా అభివృద్ధిచెందింది. ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా చిత్రాలు నిర్మిస్తున్నారు. టెక్నాలజీ ఎంతో పెరిగింది. ఒకప్పుడు ఒక సినిమా నిర్మించడానికి ఏడాది పట్టేది. ఇప్పుడు రెండు, మూడు నెలల్లో చిత్ర నిర్మాణం పూర్తిచేస్తున్నారు. కట్టు, బొట్టు, వేషం, నడత, నడక ...వీటన్నింటినీ ఎవరూ పట్టించుకోవడంలేదు. దర్శకుల్లో మార్పు వస్తే ఆనాటి సినీ స్వర్ణయుగంనాటి చిత్రాలు మళ్ళీ చూడగలుగుతామని అనుకుంటున్నాను.

ఇప్పుడు కూడా మంచి చిత్రాలు వస్తున్నాయి. ముఖ్యంగా పిల్లలకోసం బాహుబలి వంటి జానపద చిత్రాలు, పౌరాణిక చిత్రాలు బాగా రావాలి. బాహుబలి, మిథునం, పెళ్ళిచూపులు, శతమానం భవతి లాంటి మంచి చిత్రాలెన్నో ఇంకా రావాలని కోరుకుంటున్నాను.

### కుటుంబం

1991లో నాకు వివాహం జరిగింది. నా భర్త పేరు డాక్టర్ విశ్వనాథ్. మాకు ఒక పాప. పేరు వీణ.

**-కె.హరనాథ్, సెల్: 97035 42598**

# ఇవన్నీ నిజాలే!

### మెదడే గొప్ప యంత్రం

A మెదడును మించిన అద్భుత యంత్రం ప్రపంచంలో లేదు. మెదడులో 100 బిలియన్ల నాడీకణాలుంటాయి. ఈ కణాలు 100 ట్రిలియన్ బైట్ల సమాచారాన్ని దాచి ఉంచగలవు! అంతేకాదు, కేజిన్నర బరువుగల మెదడులో అయిదు లక్షల ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాల్లో ఉన్నంత సమాచారం ఇమిడిపోతుంది. అందుకే మనిషి అంతర్గత శక్తి మహా గొప్పది అంటారు!

•••

A మనదేశ వంటల్లో విరివిగా వాడే వాము ఈజిప్టులో పుట్టింది. దీని ఉత్పత్తిలో రాజస్థాన్‌దే అగ్రస్థానం. వాము గింజల్లో ఉండే థైమాల్ రసాయనంవల్లే దానికి ఆ ఘాటు వచ్చింది.

•••

A అమరావతినగరం క్రీస్తుశకం ఒకటీ, రెండూ శతాబ్దాలలో శాతవాహనుల రాజధాని. అప్పటి దాని పేరు ధాన్యకటకం.

•••

A అమరావతీ శిల్ప సంపదలోని శిల్పాలు, శిలాఫలకాలు సుమారు 122 వరకు బ్రిటీష్ మ్యూజియంలో ఉన్నాయి -డగ్లస్ బారెట్

•••

A వైణిక సార్వభౌముడు చల్లపల్లి చిట్టిబాబు. ప్రపంచ ప్రఖ్యాత న్యూయార్క్ వాల్‌డోర్ఫ్ అస్టోరియా ఫైవ్‌స్టార్ హోటల్‌లో నలభైయేళ్ళక్రితమే కచేరీ చేసిన తొలి భారతీయుడు.

•••

A మెలకువగా ఉన్నవాళ్ళందరిదీ ఒకటే ప్రపంచం. కానీ నిద్రలో ఉన్నప్పుడు ఎవరి కలల ప్రపంచం వారిదే!

*-హెరాక్లిటస్ (క్రీ.పూ.544-483)*

•••

A ప్రకృతిలో అతిచిన్న పుష్పం ఉల్ఫియా అంగుస్తా. మైక్రోస్కోపులో మాత్రమే కనబడేంత సూక్ష్మక్రిమిలాంటి పుష్పమిది.

•••

A ప్రపంచ ప్రఖ్యాత భారతీయ గణిత శాస్త్రజ్ఞుడు శ్రీనివాస రామానుజన్ కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలో ఉండగా మూడువేల సిద్ధాంతాలను ఋజువుచేసి సంప్రదాయేతర బుద్ధికుశలతగల మేధావిగా పేరు పొందాడు.

•••

A దేశం గర్వించదగిన జర్నలిస్టు సోదరులు కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు. వీరిలో పున్నయ్య మెట్రిక్యులేషన్ పరీక్ష తప్పినప్పుడు భయపడి ఇంట్లోంచి పారిపోయి ముంబయి చేరుకుని కావిడితో నీళ్ళుమోసి జీవించాడు. తర్వాత ఆయన ఏ స్థాయికి ఎదిగాడంటే కరాచీలో ఆయన పేరిట 'పున్నయ్యనగర్' పెట్టేంతగా!

-చిన్నారి

# సుధామ పదగారడి-302

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | | 5 |
| | | | | 6 | | | | |
| 7 | | | | 8 | | 8 | | |
| | | 9 | | | | | | |
| | 10 11 | 11 | | | 12 | | | |
| 13 | | 15 | | 14 | | | | 15 |
| 16 | | | 17 | | | 18 19 | | |
| | | | | | | | | |
| 19 | | | | | 20 | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. 'జన్మానికో....' అని నుడి (4)
3. రాత్రంతా మేల్కొని వుండడం (4)
7. అక్షతలు (3)
8. నవనిర్మాణ ఆలయమే! (5)
9. బొబ్బట్లు మధ్యలో వదలి నొసల ధరించండి (2)
10. చందమామ (3)
12. కెరటం పక్కన చేరి క (3)
14. ప్రపంచం, లోకం (2)
16. కాంతి (2)
17. అటుగా ధరిత్రి (2)
18. రణము (3)
19. నందిని విధిగా దర్శించగల గుడి (4)
20. శివలింగంపైని అభిషేక పాత్ర (4)

**నిలువు**

1. బాల్‌థాకరే సంస్థ (4)
2. మినుములు, జొన్నలు, పెసలు, కందులు గట్రానే మరోటి (3)
4. పి. సుశీలకు గల బిరుదు (5)
5. యాదవకులంలో చివరకు పుట్టింది (4)
6. పసిపాపను నిద్ర పుచ్చేందుకు తల్లి చేసే పని (3)
9. తెల్లమచ్చ, శోభి (2)
11. శిశువు (2)
12. గుర్రం (2)
13. కాశీయే! (4)
14. సంపద, బూడిద (3)
15. అడుగునుంచి చేతులు (4)
18. రెండు గొంతుకలు కలిస్తే....! (3)

### పదగారడి-301 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ● | ప్ర | యు | డు | ● | ప్ర | యు | రా | లు |
| కా | ● | క్షి | ● | బి | ● | క్ష | ● | ఖు |
| గి | రి | ● | న | గు | మో | ము | ● | డు |
| లి | ● | స | ● | వు | ● | ● | భ | ● |
| ● | వి | ర | హం | ● | ప్ర | మ | లే | ఖ |
| అ | ● | సం | ● | అం | ● | ది | ● | ర్గా |
| సా | బి | ● | ముం | బ | నం | ● | చి | ర |
| ర్క | ● | లై | ● | రం | ● | బా | ● | ము |
| లి | ప్ | లా | క్ | ● | డి | వ | దా | ● |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey
No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on

# ఆయనకోసం నేర్చుకున్నా

## -అమీజాక్సన్



**టాలెంట్ ఉంటే ఎక్కడున్నా గుర్తింపు వస్తుంది అనడానికి నిలువెత్తు నిదర్శనం అమీజాక్సన్. ఈ భామ విదేశీ వనితే అయినా, కోలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ల సరసన నటించే అవకాశాలను కెరీర్ తొలినాళ్లలోనే దక్కించుకుంది. ముఖ్యంగా శంకర్ దర్శకత్వంలో నటించాలని దక్షిణాదిన చాలా మంది హీరోయిన్లు ఆశపడుతుంటారు. అలాంటి ఆశ అమీకి రెండుసార్లు తీరింది. 'ఐ' సినిమా అమీని నిరాశపరిచినా, 'రోబో 2'లో అవకాశం ఆ నిరాశను కొంత వరకూ తీర్చిందన్న అమీజాక్సన్‌తో....**

**'రోబో 2'మీద చాలా ఆశలు పెట్టుకున్నట్టున్నారు?**

నిజమే! 'ఐ' సినిమా కొంతవరకూ నిరాశపరిచింది. ఈ సినిమా కచ్చితంగా పెద్ద హిట్ అవుతుందని నమ్ముతున్నాను. ఏ హాలీవుడ్ సినిమాకూ తీసిపోని రీతిలో శంకర్ సార్ ఈ సినిమా రూపొందించారు. రజనీకాంత్‌సార్, అక్షయ్‌కుమార్ సార్ లాంటి దిగ్గజాలు నటించిన ఈ సినిమా చరిత్రను తిరగరాస్తుందని గట్టిగా నమ్ముతున్నాను. శంకర్‌గారి సినిమాల్లో నటించడం ఇది రెండవసారి. మొదటి సినిమా కన్నా ఈ సినిమాలో ఎక్కువ విషయాలు నేర్చుకున్నాను.

**ఈ సినిమాలో మీ పాత్ర?**

పాత్ర కాదుగానీ, పాత్ర కోసం పడిన కష్టం చెబుతాను. కష్టపడి ఫైట్లు నేర్చుకున్నాను. నాన్ వెజ్‌ను పూర్తిగా మానేసి వెజిటేరియన్‌గా మారాను. యోగా, ధ్యానం వంటివి రెగ్యులర్‌గా చేస్తున్నాను. నా కష్టం తెర మీద తప్పకుండా కనిపిస్తుంది. నిజం చెప్పాలంటే రజనీసార్ కోసమే ఫైట్లు నేర్చుకున్నాను.

**భాష ఇబ్బంది అనిపించలేదా?**

నా మొదటి సినిమా కోలీవుడ్‌లోనే చేశాను. అప్పుడే ట్యూటర్‌ని పెట్టుకొని భాష నేర్చుకోవడం మొదలుపెట్టాను. ఇప్పుడు భాష వచ్చేసిందని చెప్పను గానీ, చిన్న చిన్న పదాలు పలుకుతున్నాను. ఎదుటివారు మాట్లాడేది అర్థం అవుతోంది. అలాగే హిందీ కూడా నేర్చుకుంటున్నాను. విదేశీ వనితనే అయినా ఇక్కడివారు ఆదరించడం ఆనందంగా ఉంది.

**సల్మాన్‌తో మీ ప్రేమ వ్యవహారం....**

అలాంటిదేమీ లేదని అప్పుడే చెప్పాను. అయినా సల్మాన్ లాంటి వ్యక్తిని ప్రేమించని వారు ఉండరు. ఆయనతో డేటింగ్ చేసే అవకాశం వస్తే ఎవరూ వదులుకోరు. నేనేమీ దానికి మినహాయింపుకాదు. అలాగని తనతో డేటింగ్‌లో ఉన్నానని మాత్రం కాదు. సల్మాన్ సార్ అంటే ఎంత ఇష్టమో చెప్పడానికే ఇదంతా.



**ఇటు ఉత్తరాదిన, అటు దక్షిణాదిన వరుసగా సినిమాలు చేయడం కష్టం అనిపించడం లేదా?**

లేదు. పైపెచ్చు తమిళనాడు టు ముంబయి ట్రావెల్‌ను బాగా ఎంజాయ్ చేస్తున్నాను. పనిని ప్రేమిస్తే ఎంత చేసినా కష్టం అనిపించదు.

**హాలీవుడ్‌కు ఎప్పుడు వెడుతున్నారు?**

సినిమాలు నా పాషన్. అన్ని భాషలలో నటించాలని ఉంది. భవిష్యత్తులో తప్పకుండా అక్కడ ఓ సినిమా చేస్తాను. దీపిక, ప్రియాంకల్లాగా నేను కూడా అక్కడ మంచి పేరు తెచ్చుకోవాలని ఉంది.

**ఇక్కడ పూర్తిగా స్థిరపడినట్టేనా?**

దాదాపు అంతే! ఇక్కడికి వచ్చిన తరువాత ఖాళీగా ఎప్పుడూ లేను.

**ఫ్యామిలీని మిస్ అవుతున్నానన్న బాధ లేదా?**

నాకిష్టమైన పని కోసమే ఇక్కడకు వచ్చాను. అలాంటప్పుడు బాధ ఎందుకు? అవకాశం దొరికినప్పుడు నేను మా ఫ్యామిలీ దగ్గరకు వెడుతుంటాను. లేకపోతే వాళ్లు వస్తుంటారు. ఎప్పుడు కావాలంటే అప్పుడు మాట్లాడుకునే వీలు ఉన్నప్పుడు ఇక బాధపడడం ఎందుకు?

**తెలుగులో చేసే అవకాశం ఉందా?**

చెప్పానుగా...అన్ని భాషల్లోనూ చేయాలని ఉంది. అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను. 'ఐ' సినిమా తరువాత కొన్ని కథలు విన్నాను. కానీ నచ్చక వాటికి ఓకే చెప్పలేదు. ఆ తరువాత బాలీవుడ్‌లో బిజీ అయ్యాను. ఎవరన్నా మంచి స్టోరీతో వస్తే తప్పకుండా తెలుగులో కూడా చేస్తాను.

-బికె

